# అభ్యుదయ

సాహిత్య సంచిక

మన్మథ హేమంతం

౧౯౫౬ జనవరి

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం

విజయవాడ

వెల: రూపాయి

# సంపాదక వర్గం

★

శ్రీరంగం శ్రీనివాసరావు

కొడవటిగంటి కుటుంబరావు

అనిసెట్టి సుబ్బారావు

తుమ్మల వెంకటరామయ్య

కే. వి. రమణారెడ్డి



ఈ సంచిక ముద్రణ వ్యయం ఆంధ్ర అభ్యుదయ
రచయితల సంఘం మద్రాసుశాఖ వారిది

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్సు. విజయవాడ-2.

# విషయ సూచిక



## చిత్రాలు



---

ముఖ్య సవరణ: 22 వ పేజీలో వ్యాసరచయిత పేరు "రామకృష్ణ" అని కాదు. "రాధాకృష్ణ". అలానే 62 వ పేజీలో రచయిత పేరు "ఏటుకూరు బలరామమూర్తి" అని చదువుకో ప్రార్థన.

# జయ జయ విశాలాంధ్ర!

## నాడూ, నేడూ

చరిత్రలో, ఆంధ్ర చరిత్ర అపూర్వం.
సంస్కృతిలో, ఆంధ్రులదో ప్రత్యేకత.
ఆంధ్రుల సాహిత్యం అపారం!
ఏనాడైనా ఆంధ్రులు అగ్రగాములు!



## నేడూ, రేపూ

అతి ప్రాచీనమూ, సుసంపన్నమూ ఐన మన ఆంధ్రజాతి చరిత్ర రూపురేఖల్ని, కళాప్రాభవాన్ని, సాహిత్య ప్రతిభనీ, సంస్కృతీ విభవాన్ని సమగ్రంగా నేటి యువతరంవారు ఎంతో తెలుసుకోవలసి ఉంది. విశాలాంధ్రలో సర్వే సర్వత్రా విజ్ఞానాన్ని వివేకాన్ని వినోదాన్ని వేయి ముఖాల వెదజల్లే బాధ్యత యువతరం వారిది. వారికి గ్రంథాలే కరదీపికలు. రేపటి తరంవారికి బాటలు వేసేవి గ్రంథాలే! ఆంధ్రుల మహౌన్నత్యాన్ని సమగ్రంగా తెలియచేసే సమస్త గ్రంథాల్ని అందించే వారిని గురించికూడా మీకు సమాచారం కావలసి ఉంది.



ఏ ఉత్తమ గ్రంథం మీకు కావలసి వచ్చినా,
వెంటనే జ్ఞాపకం వచ్చే ప్రచురణాలయం ఇదే!

**విశాలాంధ్ర ప్రచురణాలయం**

**విజయవాడ 2.**

# అభ్యుదయ

## విశాలాంధ్ర

విశాలాంధ్రావతరణ కోసం క్షణక్షణం ఎదురుచూచే అశేష ఆంధ్ర ప్రజానీకానికి ఆశాభంగం కల్గింది. కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం మళ్ళీ ఈ సమస్యను వాయిదా వేసింది.

విశాలాంధ్ర తెలుగు ప్రజల చిరకాల తపోవాంఛ. విశాలాంధ్ర తెలుగు ప్రజల తీయని కల. ఈ తపస్సు ఫలించి, ఈ కల నిజమై ఇన్నాళ్ళూ ముక్కచెక్కలుగా విడిపడియున్న మూడుకోట్ల ప్రజ లైక్యమయ్యే సుదినం యెప్పుడెపుడని తహతహ లాడుతున్నారు తెలుగు ప్రజలు. నలభై ఏండ్ల నాడే భాషారాష్ట్ర ఉద్యమానికి అంకురార్పణ... అంజవేసి భారతదేశానికి తలమానిక మైంది తెలుగు గడ్డ. అమరజీవి పొట్టి శ్రీరాములు మరి అనేక త్యాగధనులు ఆత్మార్పణచేసి ఇతర రాష్ట్రాలవారికి మార్గదర్శకులై రాష్ట్రాన్ని సాధించారు. స్వరాష్ట్ర సిద్ధితో తెలుగు ప్రజల చిరతరవాంఛ కొంతవరకు నెరవేరినా పూర్తి కాలేదు, ఒకజాతి సంస్కృతీవికాసానికి, సర్వతోముఖాభివృద్ధికి, భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణం అవసరమని నేడు కొత్తగా చెప్పవలసిన పని లేదు. భాషాప్రయుక్త ప్రాతిపదికపైననే కాంగ్రెస్ సంస్థ వివిధ రాష్ట్రాలలో దశాబ్దాలుగా పని చేస్తూ వచ్చింది. భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణం ఆంగ్లేయులతో మనం పోరాటం తలపెట్టి నపుడు ప్రకటించిన ఆశయాలలో ఒకటి.

ఒకభాష వికాసం మరోభాష పెంపుదలకు ప్రతిబంధకం కాదు, కారాదు. ఒకజాతి సంస్కృతి, మరోజాతి సంస్కృతిని నిరోధించవలసిన పనిలేదు. భారతదేశమంతటినీ ప్రతిబింబించే భారతీయ సంస్కృతీ వాహినిలో శాఖగా ఉంటూనే, తన వ్యక్తిత్వాన్ని, ఔన్నత్యాన్ని, విశిష్టతను, ప్రత్యేకతను నిలబెట్టుకోవచ్చు. అందుకే ప్రత్యేక భాషారాష్ట్రం. అందుకే విశాలాంధ్ర.

కంపెనీల, కుంపినీల రోజులు పోయాయి. రాజులు తరాజులయ్యారు. నవాబులకిక స్వస్తి చెప్పనున్నాం. అయితే ఇంకా ఎందుకు విలంబన. ద్విభాషా రాష్ట్రాలు, బహుభాషా రాష్ట్రాలు అంటూనే మరోప్రక్క తెలుగు వారి విషయం వచ్చేసరికి "ఏలికల నాల్కలలో చీలిక" లెందుకు? ఏనోటవిన్నా ఏనాట కన్నా, ఏపత్రాన్ని కదలించినా నీ నా భేదం లేక విశాలాంధ్ర నినాదం వినబడుతూనేవుంది. ఎక్కడో కొద్దిచోట్ల అపశ్రుతి వినబడినా అది లెక్కచేయతగింది కాదు.

యావదాంధ్ర ప్రజాహృదయాన్ని అర్థం చేసుకోక విశాలాంధ్ర నిర్మాణంలో విలంబనం చేస్తే, ఆంధ్రప్రజ ఆగ్రహానికి అంతు ఉండదు. అందువల్ల కలిగే ఫలితాలు దురూహ్యాం. వివేచనాశక్తితో, విశాల హృదయంతో సుదూర దృష్టితో విశాలాంధ్ర నిర్మాణానికి తక్షణం పరిపాలకులు పూనుకొంటారని ఆశిస్తున్నాం.

## సాంస్కృతిక మహాసభలు

మహోజ్జ్వల సంస్కృతీసంపద గలది ఆంధ్రజాతి. అజంతా, అమరావతీ, నాగార్జున, లేపాక్షి శిల్పాలు ఆంధ్రుల కళా ప్రతిభను భారతదేశమంతే గాక ఖండ ఖండాలకు వ్యాపింపజేశాయి. భరతనాట్య కళాసంప్రదాయానికి పుట్టిల్లు కూచిపూడి. త్యాగయ్య తెలుగువాడని సగర్వంగా చెప్పుకొంటాం. వెయ్యేండ్లకు పైబడిన ముత్తయిదువ తెలుగు భాషామతల్లి. కాని, పరాయి పాలనా ఫలితంగానూ, తెలుగుజాతి చీలికలై ఉండుటవల్లా మన సంస్కృతి పరిపూర్ణ వికాసం పొందలేదు. స్వరాజ్య, స్వరాష్ట్రవాంఛతో అన్ని జాతులలో వలెనే మనలోకూడ ఆత్మాభిమానం పెల్లుబికింది. మన ప్రాచ్యసంస్కృతీ పరిరక్షణకు, అన్య సంస్కృతిలోని సుసంపదను అలవరచుకోడానికి, మన సంస్కృతిని బహుముఖాలుగా వికసింపజేయడానికి, ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. ఇప్పుడూ జరుగుతున్నాయి. కాని ఈ ప్రయత్నాలు సంపూర్ణ సఫలత చెందాలంటే, అందుకు తగిన సుహృద్భావాతావరణం ఉండాలి. ఒక రాష్ట్రానికీ మరొక రాష్ట్రానికీ మధ్యనేగాక, ఒక దేశానికి మరొ దేశానికి మధ్యకూడ సత్సంబంధాలు, ప్రేమాదరాభిమాన గౌరవాలు ఉండాలి. అప్పుడే వారిసంస్కృతికి పరిరక్షణ ఉంటుంది.

కాని నేడు ప్రచ్ఛన్నయుద్ధ వాతావరణం, అణు, హైడ్రోజన్ బాంబు ప్రయోగాలు, బెదరింపులు ప్రపంచ వాతావరణాన్ని కలుషితం చేస్తున్నాయి. ఇట్టి దుష్పరిణామాల నుండి మన కళలనూ, సంస్కృతినీ — మానవజాతి మనుగడనే — రక్షించుకోవలసిన అవసరం ఉన్నది. ఈ విషయాన్ని సాహితీపరులూ, కళావేత్తలూ ఎంత త్వరగా గ్రహించితే అంతమంచిది.

ఫిబ్రవరి రెండవవారంలో రాజమహేంద్రవరంలో జరగనున్న విశాలాంధ్ర సాంస్కృతిక సభలు, ఆంధ్ర ప్రజల ఐక్యతకూ, ఆంధ్ర సంస్కృతి పరిరక్షణకూ, సర్వతోముఖంగా సంస్కృతీవ్యాప్తికీ, శాంతికి ప్రాతిపదిక నాలోచించగలవని ఆశించుతున్నాం.

## నాటక కళాపాఠశాల

జనవరి 28, 29, 30 తేదీల్లో ఆంధ్ర నాటక సంఘ సమాఖ్యవారు విజయవాడలో నాటక కళాపాఠశాలను నిర్వహించి వందమందికిపైగా ఔత్సాహిక నటులకు శిక్షణ ఇచ్చినందుకు వారిని అభినందిస్తున్నాం. ఈ పాఠశాల విద్యార్థులలో ఔత్సాహిక నటులేగాక, రచయితలు, నాటక కళాభిలాషులు, దశాబ్దం పైగా నాటక కళాసేవలో అనేక కష్టనష్టాలకు లోనయినవారుకూడా ఉండటం గమనార్హం. నాటక కళకు సంబంధించిన ప్రాచీన రంగ ప్రయోగం, ఆహార్యం మొదలగు ప్రయోగ విషయాలగురించీ, నాటక సమాజ నిర్వహణలో కలిగే సాధకబాధకాలగురించీ, ఈపాఠశాలలో బోధించిన విషయాలు నాటక కళాభిలాషులైన విద్యార్థులకు ఎంతో ఉపయోగపడ్డాయి. ఈ పాఠశాల నిర్వాహకులు చెప్పినట్లు "గత సంవత్సరంలో ఢిల్లీ జాతీయ కళోత్సవాలకు వెళ్ళిన దరఖాస్తుల్లో సగంకంటె పైగా ఆంధ్రదేశం నుంచి వెళ్ళాయి. 1929 లో స్థాపితమై నేటివరకు నిర్విరామంగా కృషిచేస్తున్న నాటక కళాపరిషత్తు వంటి సంస్థ ఏ యితర రాష్ట్రంలోనూ లేదు."

అర్ధశతాబ్దం క్రితం పార్సీ, మరాఠీ నాటకాలతో ప్రోద్బలమంది ఆధునిక నాటక ప్రదర్శనం ప్రారంభమయింది. విద్యావంతులనేకులు నాటకసమాజాలు నెలకొల్పి నాటక ప్రదర్శనలు సాగించారు. కాని రానురాను

నాటకసమాజాలు కిరాయి నాటక సమాజాలుగా మారిపోయాయి. నాటకరంగం పతనావస్థ చెందింది. నాటక కళాపరిషత్తు అవతరణతో ప్రారంభంలో ఔత్సాహిక నటక బృందాలకు కొంత ప్రోత్సాహం లభించిన మాట నిజమే. అయినా అది ఒక సంకుచిత పరిధిని దాటలేకపోయింది. అందుచేతనే శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు "1930 నుండి 1945 వరకు ఆంధ్ర నాటక రంగానికి అధోగతియుగం" అని అన్నారు. ఆ మాటలతో స్థూలంగా ఏకీభవించవచ్చు. అయితే ప్రజానాట్యమండలి స్థాపనతో ఆంధ్ర నాటక రంగంలో ఒక అపూర్వ చైతన్యమూ, సంచలనమూ కల్గింది. ప్రజాజీవితం ప్రతిబింబించే నాటకాలను సమర్థవంతంగా ప్రదర్శించుట ద్వారా ప్రజానాట్యమండలి నాటకరంగ కళాభివృద్ధికి ఎంతో తోడ్పడింది. ప్రజానాట్య మండలి కార్యకర్తలు అనేకమంది నిర్బంధాలకు గురి అవడంవల్ల 1948 తర్వాత ఆ నాట్యమండలి పని చేయ లేక పోయింది.

ఆంధ్ర నాటకసంఘ సమాఖ్య, ఇప్పుడు నాటక పాఠశాలను నిర్వహించుటద్వారా ఇతర సంస్థలకు మార్గదర్శక మగుటయేగాక నటకులకు ఎంతో సేవచేసింది. నాటకకళకు దోహదమిచ్చే ఇలాంటి పాఠశాలలకు ప్రభుత్వం ప్రోత్సాహమిస్తుందనీ, నా ట కా లు, బుర్రకథలు మొదలైన కళారూపాల ప్రదర్శనలపై నిషేధాలు, అవరోధాలు పెట్టే బిల్లులను తీసుకురాకూడదనీ, తీసుకురాదనీ ఆశించుతున్నాం. ప్రభుత్వంగాని, పురపాలకసంఘాలుగాని ప్రతి పట్టణంలో ఒక థియేటర్ (రంగస్థలం) కట్టించి ఇవ్వాలని కోరుతున్నాం.

నాటక కళాపిపాస మనలో ఎంతమిన్నగా ఉన్నా, రంగాలంకరణ మొదలైన విషయాలలో మనం ఇతర రాష్ట్రాలకంటె కొంత వెనకబడిఉన్నాం. అతివేగంగా పరుగెత్తుతున్న ప్రపంచగతిని అందుకున్ననాడే, సమాజ పరిస్థితులను ప్రగాఢంగా అవలోకించిననాడే, మననాటకాలు ఉత్తమస్థాయి నందుకోగలవని రచయితలకూ,నటకులకూ విజ్ఞప్తి చేస్తున్నాం.

శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ రాఘవలకు తగు వారసులమని నాటక కర్తలూ, నటులూ నిరూపించుకోవలసిన బాధ్యతవుంది.

## ఎహ్రెన్ బర్గ్‌కు సుస్వాగతం

సుప్రసిద్ధ సోవియట్ రచయిత ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ ఇపుడు భారతదేశంలో పర్యటిస్తున్నారు. వారి కిదే మా సుస్వాగతం. ఎహ్రెన్‌బర్గ్ విశ్వవిఖ్యాత నవలారచయిత. ఫాల్ ఆఫ్ పారిస్, దిస్టా(ర)మ్, ది నైన్త్ వేవ్, ది థా మున్నగు నవలలద్వారా భారతీయ రచయితలకూ, పాఠకులకూ ఆయన పరచితుడు. నవలారచయితగానే గాక పత్రికా రచనలోకూడ ఆయన ఎంత ప్రతిభావంతుడో యుద్ధకాలంలోనూ,యుద్ధానంతరమూ ఆయన వ్రాసినవ్యాసాలే నిదర్శనం. నవలారచయితగా పత్రికారచయితగా ఈనాడు మనకు ప్రసిద్ధుడుగా పరిచయమైన ఎహ్రెన్‌బర్గ్ సాహిత్య జీవితం కవితతో, వ్యంగరచనలతో ప్రారంభమైంది.

ప్రపంచశాంతి ఉద్యమంలోకూడ ప్రముఖ పాత్ర నిర్వహించుతున్న ఎహ్రెన్‌బర్గ్ రాక భారత – సోవియట్ రచయితల మధ్య స్నేహ సంబంధాలను ప్రపంచశాంతినీ, పెంపొందించి, ఈ రెండు దేశాల సంస్కృతీ సంబంధాలను మరింత గట్టిపరచగలదని ఆశిస్తున్నాం. సోవియట్ రచయితల సంఘానికి, ఎహ్రెన్‌బర్గ్ ద్వారా ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం ఇదే జేజేలర్పించుతూంది.

— తుమ్మల వెంకటరామయ్య

# ప్రస్థానం

మయాకోవస్కీ (1917)

విప్లవపద ఘట్టనతో వీధుల వెస త్రొక్కుడు;
దుర్గరోన్నత శిరముల నిక్కలణచికూల్చుడు;
నవ్యజలప్రళయ మహా వాహినులము మనము
వార్షికాభ్రసన్నిభులము, ధరప్రక్షాళింతము!

దినములు దివ్యాశ్వమ్ములు
ఏళ్ళకీడ్పు కాళ్లు
వేగము మన వేల్పు, ఎదురు
రొమ్ము మనది డ్రమ్ము.

ధ్వజములు మనవాటికంటె కలవా మరిదొడ్డవి?
చిరుతుపాకిగుళ్ల తేళ్ల కొండెలు మనలనదుమున?
సన్నీలకు రైఫిళ్ళకు బదులు వీరగాథలు!
పైడిగంట మ్రోతవంటి గాత్రమ్ములు మనవి!

ఎదుగును పచ్చిక బయళులు
కడచి చనును నాళులు
హరివిల్లా! వంగు; వల్గ
దశ్వాలూ! పొందు దౌడు!

చూడండటు మిన్నులు తొలిచినట్లు తారలు!
మిన్నున్నా లేకున్నా వర్థిల్లును పాటలు!
బల్లూకాకృతి గలిగిన సప్తర్షుల మండలమా!
బొందితోటిస్వర్గ మేగవలయుమేము తెల్పుము!

పాడుడు! మధువు నిదే వాడుడు!
మానాడులలో ఆమనిధుని!
స్పందించు! హృదీ! సంస్పందించు!
కాంస్యవక్షమా! మార్మ్రోగు!

---

# పిలుపు

ప్రభు

రేపటి రూపు
నేటి చూపులో
కనుపాపయై
ప్రతిఫలించగ –
భవితవ్యపు
స్వరూపమందు
గత ప్రశస్తిని
పొదువు కొనగా –
చీలి పోయిన
బొమ్మసిల్లిన
బ్రతుకువూపిరి
తేరుకొనగా –

పునర్జీవా
కృతి చిగుర్చుచు
పెంపువహింప
విప్పారగా –
జాతివికాస
స్ఫూర్తిలోనే
దేశోన్నత్య
స్థితిగమించగ –
జీవముడుగక
సంచలింపగ
పాటుబడుమో
తెలుగు వాడా.

# 'బండిరాముడి పెళ్ళాం'

మాగేఖలే

చెన్నపట్నంలో 'లా' చదువుతున్న గోపాలం ఆ ఏడు 'ఎఫ్ఎల్' పరీక్షకు కూచుని, వేసంగి సెలవలకు స్వగ్రామం మాధవపల్లికి బయలుదేరి, మర్నాడు పది బారల పొద్దెక్కేసరికి ఆ చిన్న స్టేషను గుండూరు చేరుకున్నాడు. గుండూరు స్టేషన్నుండి మాధవపల్లికి దాదాపు ఆరు మైళ్ళుంటుంది.

స్టేషన్లో దిగంగానే తనవూరు రాముడి గుర్రబ్బండి కోసం గాలించాడు గోపాలం. ఎక్కడా రాముడి బండిజాడ లేదు. ఇంకేవూరి బళ్ళయినా వుండొచ్చని ఆశతో చూసిన గోపాలానికి పుట్టింటికొస్తున్న ఓ ఆసామి ఆడకూతురుకోసం వచ్చిన ఒక్క రెండెడ్ల గూడుబండిమటుకే కనిపించింది.

దూరప్రయాణంచేసి స్వగ్రామానికొస్తున్న వుత్సాహమూ, ఉదయపువేళ మాగాణీప్రాంతపు శోభను చూసి పొందిన ఆనందమూ గోపాలం హృదయంలోంచి జారిపోవటం మొదలుపెట్టినై.

స్టేషన్లో దిగిన ప్రయాణీకులు పూర్వం మాదిరిగానే రంగు రంగుల ట్రంకు పెట్టెలూ, మూటలూ నెత్తికెత్తుకుని డొంక వెంబడి చుట్టుపక్కల పల్లెటూళ్ళకు కులాసాగా నడిచిపోతుంటం చూసి నిట్టూర్చాడు గోపాలం.

"ఏవూరు ?"

ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు గోపాలం. మెడమీద చేతికర్రకు రెండు చేతులూ వేళ్ళాడేసుకుని మెళ్లో వెండికంటెతో ఓ నల్ల పిల్లవాడు గోపాలాన్ని పరీక్షగా నిలబడి చూస్తున్నాడు.

'నువ్వు మాధవపల్లి అనుమంతయ్యగా రబ్బాయివి కదూ ?' మళ్ళీ అడిగాడా నల్లపిల్లవాడు.

'అవును. నీకెట్టా తెల్సా ?' అనడిగాడు గోపాలం నల్లపిల్లవాణ్ణి వింతగా చూస్తూ......

'నాకు తెల్సు. ఎనక నువ్వు మీఅయ్యా, అమ్మతో రాముడి గుర్రబ్బండిలో వచ్చి తెనాలి పోయిరాటం సానాసార్లు సూశా. ఇప్పుడు చూటు, బూటు మీదుంటే సప్పున గురుతుపట్టలా నిన్ను' అన్నాడు నల్లపిల్లవాడు.

'మంచివాడివే. మావూరి రాముడి గుర్రబ్బండి ఎందుకు రాలేదో నీకు తెలుసా ? వాడీ పాసింజరు టైముకు ఎప్పుడూ ఇక్కడుండేవాడే ?' అనడిగాడు గోపాలం.

'రాముడు గుర్రబ్బండి అమ్ముకుని ఒంటెద్దుబండి కొన్నాడుగా. మీవూర్నించి ఇటుగా తెనాలికి బస్సు పడింది నీకు తెల్సా ?' అన్నాడు నల్లపిల్లవాడు.

'నాకు తెలియదు. ఏదీ బస్సూ?' అనడిగాడు గోపాలం, బస్సులు దేశం నాలుగుమూలలకూ ఎగబాకుతున్నయ్యనుకుంటూ.

'అచ్చే, అది వుత్త సన్నాసి బస్సు. యాడన్నా కూసేపు ఆగిందంటే మళ్లీ మడుసులు తోస్తేగాని కదల్దు. ఇంతకు ముందలే ఆ బస్సులో కూకున్న మడుసులు దాన్ని తెనాలేపుకు తోసుకెళ్లారు. మరి తిరిగి ఎప్పుడొచ్చుద్దో? అదుగో, అదుగో రాముడి బండొత్తున్నది' అంటూ రోడ్డువేపుకు వేలుపెట్టి చూపించాడు నల్లపిల్లవాడు.

తెనాలి వెళ్ళే పెద్దరోడ్డునుంచి స్టేషనుకు వచ్చే చిన్నరోడ్డుకు మళ్ళించి, బండినీ, ఎద్దునూ పగ్గాల్తో లాక్కొస్తున్న రాముణ్ణి చూశాడు గోపాలం.

రాముడి ఒంటెద్దు బండిని చూసి గోపాలం నీళ్ళు కారిపోయినా, తనకు గుండూరు స్టేషన్నుంచి విముక్తి కలుగుతున్నందుకు సంతోషం తెచ్చుకున్నాడు.

బండిలో వచ్చిన తన వూరు కోమటి కోటమ్మ, కోటమ్మ మనమరాలు అక్కమ్మను చూడగానే కోటమ్మ దుకాణం చప్పున జ్ఞాపకాని కొచ్చింది గోపాలానికి.

కోటమ్మకు ఓ కన్ను కాయకాచి ఇంకో కన్ను మసగ్గా కనపిస్తుంది. వెనక తను ఓ చెల్లని అర్ధరూపాయీ, ఇంకో సత్తుపావలా కోటమ్మ కొట్లో మార్చుకోటమే కాకుండా తను అడిగిన గడియారం సిగిరెట్లకు కోటమ్మ పక్కకు తిరిగి గోనెసంచులు వెతుకుతుంటే చల్లగా తను అందినంతవరకు గల్లాపెట్టెలో చిల్లర డబ్బుల్ని జేబులో వేసుకోటం గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు గోపాలం.

'నాయనా నువ్వు భానుమంతయ్యగారబ్బాయి గోపాలానివి కావూ? బాగున్నావా? చెన్నా పట్టంలో పీడరీ చదువుతున్నావంటగా? పోనీలే. మనవరాల్ని అత్తారింటికి తీసుకెల్తున్నా' అని గోపాలాన్ని పలకరించి, మనమరాలు వెట్టే చేడతో ప్లాట్ ఫారంమీద కెళ్ళింది కోటమ్మ.

'ఏం అబ్బాయిగారూ? బాగుండారా? నాన మూడు దినాల కిందటే చెప్పాడు తమరొస్తుండారని. ఎక్కాం బండెక్కండి' అంటూ బండిలో గోనెపట్టా దులిపేసి, గోపాలం సామాన్లు బండిలో సర్ది, ఎద్దు పగ్గాలు పట్టుకుని ప్రయాణానికి సిద్ధమైనాడు రాముడు.

గోపాలం విసిరేసిన అణాబిళ్ళను గుప్పెట్లో కరుచుకుని, కూతేసూకుకుంటూ స్టేషన్లోకి పరుగెత్తి మాయమైనాడు నల్లపిల్లవాడు.

ఊరుదాటినాక బండెక్కి కూచుని, రాముణ్ణి బండెక్కవేమనడిగాడు గోపాలం.

'నేను బండెక్కితే ఎద్దు చెప్పినమాట వినదు. కాస్త ముందుకొచ్చి కూకోండి' అంటూ ఎద్దునదిలిస్తూ బండికిపక్కనే నడిచాడు రాముడు.

'నిన్న ఈ ఒంటెద్దుబండి పట్టుకుందేరా, రాముడూ? గుర్రబ్బండి అమ్మేశావుట దేనికి?' అనడిగాడు గోపాలం, రోడ్డు గతుకులకు బండిలో అటీటు వూగుతూ.

'గుర్రంచస్తే బండినమ్మేశా' అన్నాడు రాముడు.

'నిక్షేపమంటి గుర్రమే! ఏం, ఎందుకు చచ్చింది? ముసల్దయిందా?' అనడిగాడు గోపాలం, రోడ్డు పక్కనే వస్తున్న తంగేడుచెట్లను చూస్తూ.

'అప్పుడే ముసల్దా? అది బతికుంటే ఇంకా పది పదిహేనేళ్ళు బతికేది. ఎండుగడ్డీ, కుడితినీళ్ళూ పోస్తే ఏగుర్రమన్నా బతుకుద్దా?' అన్నాడు రాముడు.

'నీగుర్రం ఏం తినేదేం?' గుర్రాలు ఏంతింటాయో గోపాలం బుద్ధికి చప్పున తెగిలిరాలేదు.

'అన్ని గుర్రాలల్లే నా గుర్రమూ పచ్చిగడ్డీ, వులవ గుగ్గిళ్ళూ తినేది. మనూర్నుంచి తెనాలికోటి, గుంటూరుకోటి రెండు బస్సులేశారు. మీకు తెల్సా? అప్పట్నుంచి బండిబాడీగలు పడిపోయినై. నాకాడ డబ్బు తెగలక ఎండుగడ్డి వెయ్యటం మొదలుపెట్టేసరికి సర్ద్గా తినక మాడిచచ్చింది గుర్రం' అన్నాడు రాముడు, ఎద్దుతోక మెలిపెట్టి, 'పదవేందే నిదరమొగందానా' అని అదిలిస్తూ.

రాముడితో సానుభూతిగా ఏమన్నా అందామని పించి, ఏం తోచక, రాముణ్ణి, తోకనెప్పితో ఎగుర్తూ మొరాయిస్తున్న ఎద్దునీ ఓసారిచూచి, రోడ్డుపక్కకు దృష్టి మళ్ళించాడు గోపాలం.

నల్లగావున్న మాగాణి చేలల్లో రైతుకూలీలు గడ్డ విరుస్తున్నారు. వాళ్ళ నల్లటి దేహాలు చమటకు ఎండలో నిగనిగ మెరుస్తున్నయ్. చేలల్లో అక్కడక్కడ ఆసాములు తాటాకు పందిళ్ళువేసి, చేల బలం కోసం పశువుల్ని కట్టేశారు. కొంచెం వెనకాల చెట్ల మధ్యగా చిన్న పల్లెటూరు సున్నపుగోడలూ, గడ్డివాములూ, ఓచిన్న గుడిగోపురం కనపిస్తున్నయ్. ఎద్దుఒళ్ళూ, రాముడి బనీనూ, చమటకు తడిసినై. రాముడూ, ఎద్దూ ఒకరి ప్రక్కన ఒకరు లయప్రకారం నడుస్తున్నారు.

'అబ్బ! ఎండ చిటచిట్లాడిస్తున్నది. ఎండలో అనిధంగా ఎందుకు నడుస్తావు బండెక్కితోలరాదూ?' మళ్ళీ అడిగాడు గోపాలం రాముణ్ణి.

'కొత్తెద్దు కదండీ? ఇంకా దానికి బెదురుపోలేదు. వున్నట్లుండి సైడుకాలవలోకి లాగుద్ది. ఓసారి అంతే పనైందికూడా. దాని దర్మాన ఎవరికీ పెద్ద దెబ్బలు తగల్లేదులెండి' అన్నాడు రాముడు.

'అబ్బ! కొన్నియుగాలు ప్రయాణం చేస్తున్నట్టుందీ ఒంటెద్దుబండిలో. గతుకు గతుక్కీ తలపగుల్తుంటం అట్లావుంచు, మరి నీ సంగతేమిట్రా రాముడూ? ఈ తాబేలు నడకతో నీవృత్తికేమంత లాభంగావుంటుంది? గుర్రబ్బండి వున్నప్పుడు నీకింత కష్టం వుండేదికాదనుకుంటా. నువుతొందరగా ఈ ఒంటెద్దుబండిని ఒదిలించుకుని ఇంకోపని చూసుకోటం మంచిది' అన్నాడు గోపాలం.

'నా పెళ్ళామూ ఇదేమాటంటుంది. అయినా ఇన్నేళ్లు బండిపనికి అలవాటుపడి యిప్పుడు తెలవని కొత్తపని చేయడం నావల్లవవుతుందా? వృత్తది. కాని గుర్రబ్బండి తోల్తున్నప్పుడు నిజానికింత ఇబ్బందుండేదికాదు. ఇప్పుడీ బస్సులు పడినాక గుర్రం బతికుంటూడా వృత్తకుండగ. రోజులు చాలకపోతే మనుషులు వరన్నం బదులు జొన్నకూడో, నాగకేముడు గుబ్బలో తిన్నా తింటారుగాని గుర్రం పచ్చిగడ్డి మానేసి ఎండుగడ్డి తినమంటే తింటుందా? అందుకే అది చచ్చింది' మణికట్టుతో మొహంమీద చమట పక్కకు నెట్టుకుంటూ మళ్ళీ అన్నాడు రాముడు. 'మొత్తం పన్నెండేళ్ళు బండి

లాగిందాగుర్రం. పన్నెండేళ్ళు రోజూ దానికి మాలీసు చేశాను. కన్నతల్లిగ్గూడా అంతచాకిరీ చేసుండను!'

'ఏమిటో! మొహాన రాసిపెట్టినట్టే జరుగుతుంటయ్ కొన్ని' అన్నాడు గోపాలం రాముణ్ణి జాలిగా చూస్తూ.

'ఉత్తిది. యీసెన్నా పచ్చగడ్డి, ఎండుగడ్డి సంగతి మొహాన రాసుంటుదా? ఉత్తిది. నా పెళ్ళాం గూడా ఇదేమాటంటుంది. పిచ్చి సచ్చింది. చెప్పినా దానికి తెలవదు. అసలు దానికి మతెప్పుడో పోయింది' అన్నాడు రాముడు, బండిని రోడ్డుపక్కలకు లాగుతున్న ఎడ్లను రెండు పీకి దారినపెట్తూ.

'అన్నట్టు మరిచిపొయ్యాను. వెనక నీ పెళ్ళాం పోయిందని-' అని సగంలో ఆపాడు గోపాలం, సందేహిస్తూ.

'ఎవరు - నా మొదటి పెళ్ళామా? అదెప్పుడో చచ్చిపోయిందిగా? ఇది రెండో పెళ్ళాంలెండి' అన్నాడు రాముడు.

ఈ వేసంగిలో తనకొస్తున్న పెళ్ళి సంబంధాల్లో ఏదో ఒకటి ఖాయం కావచ్చుని యీమధ్య నాన్న చూచాయగా రాసాడు తనకు. అంటే దాదాపు ఏదో సంబంధం యీపాటికి ఖాయం గూడా చేసివుంటాడు నాన్న. పుర్రెలో ఏదన్నా తొలుస్తుంటే దాన్ని ఓదారికి తీసుకురావటం నాన్నకు అలవాటే. తను ఇంటికి వెళ్ళేటప్పటికి పెళ్ళి సామాన్లు సగం పైగా నన్నా నాన్న ఇంటో చేర్చివుంటా డనుకున్నాడు గోపాలం.

'నువే నయంరా, రాముడూ. సునాయాసంగా అప్పుడే రెండో పెళ్ళి కూడా చేసేసుకున్నావు!' అన్నాడు గోపాలం, ఇంకా మాధవపల్లి ఎంతదూరం వుందోనని తొంగిచూస్తూ.

'నిజంగా యీ పెళ్ళి అనుకోకుండానే జరిగింది లెండి. నిచ్చేపమంటిది కాస్తా నా జీవానపడి ఏడ్చింది' అన్నాడు రాముడు.

'నిక్షేపమంటిదైతే ఇంకా ఏం? దాన్ని పువ్వును చూసినట్టు చూసుకో' అన్నాడు గోపాలం నవ్వుతూ.

'మనూరెళ్ళినాక మీకన్నీ తెలుస్తయ్. ఈ పెళ్ళిని గురించి మనూళ్లో నన్ను సానామంది సానామాట లన్నారు. అయన్నీ మీరేం ఇనిపిచ్చుకోబాకండి, అబ్బాయిగారూ' అన్నాడు రాముడు, గోపాలంవేపు ఓసారి తిరిగి చూస్తూ.

'పుణ్యానికి నువ్వు పెళ్ళిచేసుకుంటే వూళ్ళోవాళ్ళు ఆడిపోసుకోటం దేనికి? ఏం అంత విశేషం వుందా నీ పెళ్ళిలో?' సరదాగా అన్నాడు గోపాలం.

'నా పెళ్ళప్పటికే దానికి కడుపైంది.'

'ఎవరికి?'

'అదేలెండి - నా పెళ్ళానికి. అదే నేను ముంగల మీతో చెప్పింది. వూరెళ్ళినాక యివన్నీ మీకు తెలుస్తయ్యని' అన్నాడు రాముడు.

'చచ్చాం. అదేమిట్రా రాముడూ?'

'అదంతేలెండి, అబ్బాయిగారూ. దాన్ని పిచ్చిదాన్ని చేసి ఎవడో ఎదవ దానికి కడుపుచేశాడు. ఇంక దానికి పెళ్ళి ఎట్టవుద్ది? అది మంచిపిల్లని వూళ్ళో అందరికీ తెలుసు. పెళ్ళి సంగతి దేముడికెరుక. అసలు ఆడగూతురన్నది ఎట్టా తలెత్తుకు తిరుగుతుంది నలుగుర్లో? సిగ్గుతో పగలంతా అళ్ళ గుడిసెలోనే కూకునేది ఏడుస్తా.'

'చాలా అన్యాయం' అన్నాడు గోపాలం, రాముణ్ణిచూస్తూ.

'అన్యాయమని మెల్లిగా అంటారేం? ఓరోజు వాళ్ళ గుడిసెకు దాని అయ్యతో పనుండి నేనెళ్ళబోతే నన్ను జూసి బోవురుమంది. నాకు తల తిరిగిపోయింది, నిజంచెప్పన్నా? దాని అయ్యా, అమ్మోళ్ళకు దాన్ని సంపాలో, దాచిపెట్టుకోవాలో తెలవలేదు. అదేమాటన్నాడు దాని అయ్య, కర్రోటి తీసుకుని. ఈ జాతరంతా దేనికీ దానికిష్టమైతే నేనే పెళ్ళిచేసుకుంటానన్నా. ఇగనంతే. అమాంతంగా వచ్చి నన్ను వాటేసుకుంది' అన్నాడు రాముడు.

'ఆపాటు పెళ్ళిచేసుకున్నా వన్నమాట?'

'ఆ! అందులో ఇంక చచ్చేంలేదు. పెళ్ళికి వచ్చినోరు వచ్చారు, రానోళ్ళ గురించి నేనంతగా పట్టించుకోలేదు. అసలు తమాశ ఎక్కడుందంటే దాని కసలు నేనే కడుపుచేశానని వూళ్లో పుకారు పుట్టించారు', అన్నాడు రాముడు పెద్దగా నవ్వుతూ.

రాముణ్ణి కొత్తమనిషిగా దిమ్మరబోయి చూశాడు గోపాలం.

'నువ్వు చాలా ధైర్యస్తుడివి. నువ్వు చేసినపని ఇంకోడివల్ల కాదు. ఆ భ్రష్టుడెవడో నరికెయ్యక బోయినా వాణ్ణి?' అన్నాడు గోపాలం.

'ఇంతకీ వాడెవడో తెలియలేదుగా?' అన్నాడు రాముడు.

'ఆదేమిటి ? నీ పెళ్ళాం చెప్పలామరి?' అడిగాడు గోపాలం.

'రెండుమూడుసార్లు అడుగుతే చెప్పలా. తనకు ఇంతపనైనాక వాడెవడవుతేమట్టుకేమంది. అజాతరంతా మళ్ళీదేనికంటుంది. బలేవుండే', అన్నాడు రాముడు.

దారిలో అడ్డుతగిలే ట్రంకురోడ్డుమీద అడ్డంగా వచ్చిన బస్సును తప్పించుకుని మాధవపల్లి రోడ్డుకు బండిని మళ్ళించాడు రాముడు. గోపాలం ఆత్రంగా 'ఒరేయ్ రాముడూ, అదిగో అక్కడ మా పొలాలదగ్గర పొడుగ్గా నుంచుంది, మానాన్నల్లే వుంది, సరిగ్గా మాడూ ?' అంటూ బండి దిగాడు గోపాలం.

... ... ...

గోపాలం కొంచెం స్థిమితంగా వుంటంచూసి, తాము దాదాపు ఖాయంచేసిన పెళ్ళిసంబంధాన్ని గురించిన వివరాలు చెప్పారు అమ్మా, నాన్నలు. పడుచువాడి కుండాల్సిన వుద్రేకాలన్నీవున్న గోపాలానికి అందమైన పెళ్ళాం కావాలనే కోరికతప్ప తనపెళ్ళికి కాల పరిమితులు అడ్డంపెట్టాలనే ఆలోచన లేదు. తనకు కాబోయ్యే పెళ్లాన్నిగురించీ, ఆమెతో తనకు కలగబోయ్యే సంపర్కంగురించీ వింతవింత వూహాలు చేసుకుంటూ డాబామీద పచార్లుచేస్తున్న గోపాలం తమ దొడ్లో బావిలోంచి మంచినీళ్ళు తోడుకువెళ్తున్న మంగనుచూసి వుద్రేకంతో అపాదమస్తకం కంపించి పోయ్యాడు. తను పట్నంనుంచి వచ్చినట్టు మంగకు తెలిసుంటుంది. తను డాబామీద తిరుగుతూంటం కూడా చూసుంటుంది. అందుకే మంచినీళ్ళ మిషతో దొడ్లో బావిదగ్గిరకొచ్చింది. అయినా మంగ తనను చూడనట్టు తల ఒంచుకుపోవటం గోపాలానికంత రుచించలేదు.

గబగబ కిందికి దిగిపోయి, నాన్న వూళ్లోకి పనిమీద పోవటం, అమ్మ పొరుగింటివాళ్తో ఏదో లోకాభిరామాయణం సాగిస్తుంటం తెలుసుకుని, ఓతుండుగుడ్డ భుజాన వేసుకుని నీళ్ళగదిలో స్నానం చేయటాని కొచ్చాడు గోపాలం. నీళ్ళగది పక్కనే దొడ్లో వుంది బావి. నీళ్ళ గదిలోకి తను వచ్చిన ద్వారాన్ని బంధించి దొడ్డి వేపువున్న ద్వారం దగ్గిరకొచ్చి నుంచున్నాడు గోపాలం వేడి శ్వాసలొదుల్తా.

తిర్చ్చినట్టు కనుముక్కు తీరూ, జారుముడీ, ఎర్ర చీర మోకాళ్ళపైగా దోపుకుని బావిదగ్గిర నుంచుని కడవకు చేంతాడు వుచ్చు బిగిస్తున్నది మంగ.

మంగ తనను చూసింది. బిగుసుకుపోతున్న తను మంగను చూసి వికారంగా నవ్వాడు.

'మాట' అన్నాడు తను, తడబడ్తా అస్పష్టంగా.

నాగుమల్లె చువ్వలాగా అట్టాగే కదలకుండా నుంచుంది మంగ.

'ఇక్కడ ఎవరూ లేరు. ఒక్కమాట.' అన్నాడు తను.

బొమ్మల్లే ద్వారం దగ్గరికి మెల్లిగా వచ్చి నుంచుంది మంగ. మెరుస్తున్న మంగ కళ్ళు చూశాడు గోపాలం.

ఆకళ్ళలోంచి వదుల్తున్నది విస్ఫుకణాలో కామ కిరణాలో, పోల్చుకోలేదు గోపాలం.

'లోపలికి రా...' అన్నాడు గోపాలం.

'నాకు పెళ్ళయింది, నీకు తెల్సా?' అంది మంగ, గోపాలాన్ని సూటిగా చూస్తా.

'ఏం? పెళ్ళి చేసుకోటం తప్పా?' అన్నాడు గోపాలం.

'నువు చేసినపనికి నన్నెవరూ పెళ్ళిసేసుకోనన్నారు' అంది మంగ కన్నార్పకుండా......

'పరవాలేదులే - ఒక్కసారి లోపలికిరా' -అంటూ ఒంగి ఎర్రచీర పట్టుకుని లాగాడు గోపాలం, మంగ లోంచి బుస్సున బుసరావటం వినిపించుకోకుండా.

ద్వారంకింద పగిల్న నాపరాతి ముక్కమీదకు చప్పున వెళ్ళిన మంగచెయ్యి చక్రాకారంగా తిరిగి గోపాలం నెత్తిమీదకు విసురుగా వెళ్ళిపడింది.

చిన్నకేకపెడ్తా తలను రెండుచేతుల్తో పట్టుకుని అట్లాగే కిందికి జారిన గోపాలం కళ్ళల్లో ఎర్రతీగెల్లో ఎర్రచీరతో మంగా, మంగవెనక బండిరాముడూ తీగలల్లే కదుల్తా కనుపించారు.

# 'ప్రకటన'

[ పరారీ అయిన వ్యక్తికోసం ]

**బాలగంగాధర తిలక్**

స్టేషన్లలో టికెట్లను జారీ చెయ్యకండి
ఎక్కడి రైళ్లు అక్కడ ఆపివెయ్యండి
దేశదేశాలకి కేబిలు గ్రాముృ పంపించండి
దేవాలయాల్లో నిత్యం పూజలు చేయండి !

ఆకాశవాణిలో యీ విషయం ప్రకటించండి
కాఫీహోటళ్ళలో, క్లబ్బులలో, కర్మాగారాల్లో
కాస్త జాగ్రత్తగా నిశితంగా పరిశీలించండి
సముద్రతీరాలలో నదీజలాలలో వెదకండి !

సాయుధ దళాల్ని దిక్కులలో నిలబెట్టండి
రాకెట్లను అంగారకాదిగ్రహాలకు పంపించండి
అడుగుజాడల్ని కాపీ తియ్యండి
వ్రేలి ముద్రల్ని పరీక్షించండి !

ప్రజలు తండోపతండాలుగా విరగబడుతున్నారు
కంగారుతో భయంతో గుసగుస లాడుతున్నారు
విజ్ఞానవేత్తలు నాగరికత సైతోలు వొలుస్తున్నారు
మనుష్యభక్షకులు నేడు చంకలు కొట్టుకొంటున్నారు !

కావ్యచర్చలు కళానిలయాలు ఆకర్షించడంలేదు
రాజకీయవేత్తల ఉపన్యాలు ఎవరూ వినడంలేదు
సైంటిస్టులు ఒకొక్కరే ఆత్మహత్య చేసుకుంటున్నారు
స్వార్థజీవనులు గభాలున రొమ్ములు బాదుకుంటున్నారు !

సిద్ధాంతాలు చర్చలు ఎవ్వరూ చెయ్యడంలేదు
సిరా యింకకుండానే ఎగ్రిమెంట్లు చింపేస్తున్నారు
అతృప్త అశాంత ప్రజాపారావారతరంగం
అంచుల్ని దాటి భీకరంగా విరుచుకుపడుతోంది !

ఇంక చరిత్రలు వ్రాయనక్కర లేదు
ఇంక రాజ్యాలు పాలింపనక్కర లేదు
అణుబాంబు యుగాంతాన్ని నిరూపిస్తున్నది
ఆ ముహూర్తం త్వరలోనే వస్తున్నది!

కాబట్టి Stand attention – మన జాతిని మనం
కాపాడుకోవాలంటే ఒక్కటే ఒక్కటే మార్గం
నెతికి తీసుకురండి పరారీ అయిన వ్యక్తిని
వేరు దారిలేదు – కదలండి కదలండి జై అని!

"అపారకృపాతరంగితాలైన నయనాంచలాలు
ఆనందం జాలువారే స్నిగ్ధ దరహాస పరీమళాలు
సంస్కారపు కేశపాశంలో తురిమిన అనురాగపు గులాబి
సదా ప్రజాహితైషిణి, సుభాషిణి, గర్వంలేనిరాణి
కల్లనీ, క్రౌర్యాన్నీ కాలుష్యాన్ని తిరస్కరిస్తుంది
తెల్లని పావురాల్ని సరదాగా ఎగరేస్తుంది
చల్లని తల్లి – చక్కని చెల్లి – ఆమెపేరు శాంతి!"



"ఆటంబాంబు చరిత్ర నెత్తినెక్కి తైతక్కలాడ దలుచుకొంది. అందుకని, అది చరిత్రలోంచే జారిపోయే అవకాశంలేక పోలేదు. ఇంత వరకూ సాముదాయక చరిత్రలో కోపానికీ, తాపానికీ, పొరపాట్లకూ, తడబాట్లకూ అట్టే విలువవుండేది కాదు. కాని ఇప్పుడా ఏకులు మేకులుగా మారగలవు. నాయకుల బుర్రలోపుట్టే బుడి బుడి ఊహాలు నేడు చారిత్రక సత్యాలై కూర్చోగలవు.

లోగడ యుద్ధాలే చరిత్రకు రూపురేఖలు దిద్దేవి. ఇప్పుడో! యుద్ధంఅంటే జగత్ప్రళయం – అందుకని చరిత్రను సృష్టించగలిగింది ఒక్కటే. అదే శాంతి!"

— జీన్ పాల్ సార్త్రే

# పస్తావం

కొడవటిగంటి కుటుంబరావు

ఈ కాంతం, కనకం, శరభయ్య, గోపాల రావూ ముఠా అంతా చేరి నన్ను మేధావుల జాబితాలోంచి తీసేస్తామంటున్నారుట. ఇది చాలా అక్రమం. నేను అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ మేధావినే. "కమ్యూనిజమంటే నా కెందుకు కడుపుమంట ?" అనే శీర్షికకు నన్ను రాయమన్నారు. నేను చిత్తురాశానుకూడా. దాన్ని సాఫురాసే లోపుగా కిష్టమూర్తివచ్చి "ఏం భాయ్ ? ఇక ఊరుకుంటే లాభంలేదు. మెరికల్లాటివి నాలుగు పాయింట్లు చెప్పు!" అన్నాడు. బుద్ధి గడ్డితిని నేను రాసిన పాయింట్లన్నీ చెప్పేశా. అతను వాటినికాస్తా కాగితంమీద పెట్టేసి పత్రిక్కి తనపేర పంపే సుకున్నాడు.

"పోనీలే! ఎవరిపేర పడితేనేం ? ప్రచారం కదా ప్రధానం ?" అని నేను సరిపెట్టుకున్నా. అదంతా కలిసి నాకే ఎదురొస్తుందని ఎట్లా అనుకునేదీ ?

" 'కమ్యూనిజం – కడుపుమంట' శీర్షికకు నువు రాస్తానని ఎందుకు రాయలేదూ ?" అని శరభయ్య నన్నిప్పుడు నిలవదీసి అడుగుతు న్నాడు?

"నేను రాశాను. కాని కిష్టమూర్తి కాజేశాడు," అని చెప్పనా ? అసలే ఐకమత్యం ప్రధానం అయిన ఈ క్లిష్టపరిస్థితుల్లో కీచులాడుకోవటం ఏమన్నా భావ్యంగా ఉంటుందీ? 'వాళ్ళకు' అలుసైపోమూ ?

నేను రాయలేదన్న పొడ్డే అనుకుంటే, కిష్టమూర్తిచేత నేనే రాయించానని గోపాల రావు నామీద ఇంకోపొడ్డు వేశాడు! అది చూడండి!

కిష్టమూర్తి రాసిన దానిమీద "వాళ్ళు" ఎదురురాస్తూ వెటకారమూ, వేళాకోళమూ చేశారు. చాతకాకుండా రాస్తే చెయ్యరూ? కిష్టమూర్తికి అపఖ్యాతి రావటంకోసం నేను అతనిచేత అది రాయించానట! గోపాలరావు అంటున్నాడు. ఎబ్బెబ్బే ఏం మనుషులు ?

ఇంతకూ ఇవన్నీ నైమిత్తిక కారణాలు. అసలు కారణం రంగయ్య. ఈ మాట పైకి అన్నానో వేటకుక్కల్లాగా మీద పడతారు– అసలే రంగయ్యకు ద్రోహంచేశానని ఆడిపోసుకుంటున్నారు!

మాట పడవలసే యోగం వచ్చేసరికి అందరూ ఒక్కసారిగా గతం మరిచి పోతారు కాబోలు. ఈ కాంతం, కనకం, శరభయ్య, గోపాలరావూ, రంగయ్యను దుమ్మెత్తిపోసిన రోజుల్లో అతన్ని వెనకేసుకొచ్చింది నేనూ ! వాళ్ళు రంగయ్యను దుమ్మెత్తి పోయటం తప్పనికాదు. మన వాడు, కీర్తి కండూతి ఎక్కువై, "అభ్యుదయం, అభ్యుదయం" అంటూ గంతులేసి కమ్యూనిస్టుల నోళ్లలో తలదూర్చి రైతు కూలీలను గురించీ, వాళ్ళు ఓడ్చే చెమట గురించీ ఇంకేమేమిటో గురించీ చెత్తా ఖానీ పద్యాలు తెగరాశాడు.

"గుడ్డికన్ను తెరిచినా, మూసినా ఒకటే! రంగయ్య ఏదో రాసిపోతున్నాడని మనం విచారించ వలసిన పనిలేదు. వాడు మనిషి మనవాడే!" అని నేనన్నాను కూడానూ.

తల్లిశిగగోయ్యా, ఆ మాటకూడా నా కిప్పుడెదురే వచ్చింది! "నన్ను నువ్వు గుడ్డి కన్ను అన్నావుటగా?" అని రంగయ్యే నిలవదీసి అడిగాడు.

'నేను లోగడ రాసిందంతా చెత్త! కమ్యూనిస్టులు నన్ను మభ్యపెట్టి నాచేత ఆ చెత్తంతా రాయించారు! నా కొన్నికొన్ని రచనలు వాళ్ళు పూర్తిగా తిరగరాశారు?' అని నువే చెబితివి గదటయ్యా?" అని అడిగాను. ఉన్నమాట అడగరూ...?

అసలు అందాకా దేనికి? రంగయ్యను వాళ్ళనుంచి బయటపడమని సలహా ఇచ్చింది నేగాదూ? కాదనమనూ!

"ఇదేమిటి, రంగయ్యా? పడకపడక నువ్వు వాళ్ళమధ్య పడ్డావేమిటి? ఎన్నికలు వచ్చి పడుతున్నై! బోలెడంత పనివుంది నీవల్ల" అని నేనంటే, రంగయ్య ఆలోచించి, "సరే. నేను చెప్పినట్టు ఏర్పాటు చేయించు. బయటికి రావట మెంతసేపులే!" అని రంగయ్య అన్నాడు,

అన్నమాట నిలబెట్టుకున్నాడుకూడా! అంతా సజావుగానేజరిగిపోయింది. "వాళ్ళు" అనవలిసినమాటలు "వాళ్ళు" అన్నారు; మనవాడు రాంబాణంలాంటి ప్రకటన తయారుచేసి పత్రికల్లో పారేశాడు. అంతా చక్కగా అనుకున్నట్టు జరిగిపోయింది.

లేకపోతే, నాకు తెలీకడుగుతాను, రంగయ్యకు సాహిత్యమేమిటి? సాహిత్యం మొహం తెలీని ప్రజలు అనుకోవచ్చుగాని— తెలిసిన వాణ్ణి నేనెట్లా ఒప్పుకుంటానూ? రాజకీయాలంటారూ? ఛీష్! నేను కాదన్లేదే? రంగయ్య రైటైన మనిషి! రంగయ్య సాహితీపరుడుగా మనపక్షాన లేకపోయెనే అని నేనెన్నడూ దుఃఖ పడలేదే!

అటువంటప్పుడు కాంతంవచ్చి "ఏమోయ్? రంగయ్యకు సన్మానం ఏర్పాటు చేస్తున్నాం!" అనగానే నాకు బాంబుపేలి నట్టుండదూ?

నా చెవులను నేనే నమ్మలేక, "ఏం సన్మానం?" అన్నాను.

"ఇంకేం సన్మానం? కవిసన్మానం?" అన్నాడు కాంతం.

"చూడు, కాంతం! రంగయ్య తాను నిన్నటిదాకా రాసిందంతా చెత్త అని, వాళ్లు మోసగించి రాయించారనీ అనె! ఆ తరవాత ఏమీ రాయకపోయె! ఈ సన్మానం దేనికని ఏర్పాటు చేసినట్టు?" అని అడిగాను.

అడగనూ? అడితప్పా? రేపు "వాళ్ళు" మటుకు అడగరూ? అప్పుడు బాగుంటుందేం? ఇందుకు నేను "ప్రచ్ఛన్న అభ్యుదయ" వాదినా? మొదటినుంచీ నా ప్రవర్తన "అనుమానాస్పదం" గానే ఉందా? కన్యాశుల్కం గురజాడదే అయి ఉంటుందని నేననటం అందుకు సాక్ష్యమా?

ఈ లెక్కన మేధావులగతి ఏమయ్యేట్టు?

# వింత మరణం

## పిచ్చేశ్వరరావు

నిన్న సాయంత్రం నీకు కన్పించి, కుశల ప్రశ్నలు వేసి, నవ్వుతూ, పేలుతూ మాట్లాడిన మనిషి చని పోయ్యాడని ఉదయం వెలువడ్డ పత్రికల్లో చూస్తే ఏమౌతుంది? చెప్పడం కష్టం. ఆవ్యక్తిదివరకు గుండె జబ్బుతో బాధపడుతున్నాడని తెలిసినా సరే, కొద్ది రోజుల్లో అతనెలాగూ చనిపోతాడనే విషయం నీకు తెలిసున్నా సరే, క్రిందటి సాయంత్రం కలుసుకోవడమే చివరిసారి కలుసుకోవడం అనుకోవడం ఒక పట్టాన సాధ్యంకాదు. విశ్వనాథంగారు చనిపోయ్యాడని ఉదయం పత్రికల్లో చదవగానే నాకలాగే అనిపించింది: నిజమేనా! అని.

"నేను గొప్పవాణ్ణే నన్న సంగతి మరచిపోకండి రావుగారూ!" అన్నాడు ఆ క్రిందటి సాయంత్రం నేనాయనదగ్గర శలవుతీసుకున్నప్పుడు; అని యీ చెవి నించి ఆ చెవివరకూ నవ్వాడు బోసిగా. నవ్వుతూనే సాగనంపాడు నన్ను వీధిగుమ్మం వరకూవచ్చి. ఇతరుల కలా నవ్వడం చేతగాదు; ఆ నవ్వతని ట్రేడ్‌మార్కు.

నా కాయనతో ప్రథమంగా పరిచయం యేర్పడింది ఎనిమిది సంవత్సరాలక్రితం, ఒక టీపార్టీలో. నేనప్పుడే ఒక పక్షపత్రిక్కి సినీ విమర్శకుడిగా ఉద్యోగంలో చేరాను. అదెన్నిరోజులుంటుందో నాకూ తెలియదు. ఏతేనేం, పక్షపత్రిక పక్షపత్రికే; సినీ విమర్శకుడు సినీ విమర్శకుడే. జీతండబ్బులు రాలేదాకా ఆ పత్రిక వుంటుందో లేదో అనే ఆలోచనకూడా కలగలేదు నా కప్పట్లో. పత్రికవ ప్రారంభోత్సవం. పెద్దలూ, పిన్నలూ అందరూ ఆహ్వానితులే; సినీతారలతో సహా. అందరూ యింతో అంతో పేరున్నవాళ్ళే. అందరూ ఒకరి నొకరు యెరిగినవాళ్ళే. మూతి కుడిచివరని వెనక్కి లాగి కనుబొమ యెగరేసే పరిచయమైనా వున్న మనుషులే. నేనే కొత్తవాణ్ణి; ఆ పత్రిక సంపాదకుణ్ణి తప్పితే యింకెవరినీ యెరగనివాణ్ణి. ఆయనగారికి వచ్చిన వారిని గౌరవించడం తోనే సరిపోతోంది.

నా సంగతి నలుగురితోనూ చెప్పాలని నాతహతహ. నే నీపత్రిక్కి సినీమావిమర్శకుణ్ణని ప్రపంచాని కంతటికీ యెలా తెలియజెయ్యాలా అనే నా తపన. నా యీ గొప్ప పదవిని గురించి, మాట్లాడ్డం మొదలు పెట్టిన మొట్టమొదటి పెద్దమనిషితో, యెలా ప్రారంభిస్తే బావుంటుందోనని ఆ రోజున అప్పటికే అనేకసార్లు వేసుకున్న రిహార్సల్ మళ్ళీ వేసుకుంటూ నిలబడి పోయాను నలుగురికీ దూరంగా, ఒకమూల.

కాస్సే పున్న తర్వాత, యిలాగాదు యెవరితోనో ఒకరితో యెలాగో ఒకలా యేదోఒక పిచ్చాపాటీ ప్రారంభిస్తేనేగాని బ్రతకలే ననిపించింది. చుట్టూ చూశాను అందుకు తగిన వ్యక్తి యెవరా అని. ఆవ్యక్తి నేను చెప్పింది నమ్మేట్టుండాలి; నే చెప్పింది విన్తర్వాత నన్ను గౌరవిస్తాడనే నమ్మకం కుదరాలి మరి!

నే నలాంటి స్థితిలో వున్నప్పుడూ, విశ్వనాథం గారు నాక్కనిపించింది. ఆ సినీపత్రిక ప్రారంభోత్సవాని కొచ్చినవాళ్ళలోకెల్లా నా కాయనొక ప్రత్యేక రకంగా కన్పించాడు. జుట్టు బాగా నెరసింది. బాగా లావుగా బొద్దుగా వున్నాడు. నెరసిన జుట్టుకి నూనెరాసి వెనక్కి దువ్వాడు. మిగతా వేషమంతా పల్లెటూరి రైతుబిడ్డ సినీమా చూచేందుకని ముస్తాబై పట్టణానికొచ్చినట్లుంది. ఆ టీపార్టీ జరిగే హాలంతా ప్రతిధ్వనించేట్లు నవ్వుతూమాట్లాడుతున్నాడు చుట్టూ కూర్చున్నవాళ్ళతో. దూరాన కూర్చున్న వాళ్ళుకూడా ఆ ట్రేడ్‌మార్కు నవ్వువిని, అటువైపే చూచి, అతనెందుకు నవ్వుతున్నాడో తెలీకపోయినా సరే, నవ్వుతెచ్చుకుంటున్నారు.

ఫర్వాలేదు; యీమనిషి పనికొస్తాడనుకున్నాను నేను.

నెమ్మదినెమ్మదిగా ఆయనగారిదగ్గరికి చేరుకున్నాను. ఎలాగైతేనేం ఆయనకంటబడేట్లు జాగ్రత్తపడ్డాను. దగ్గరకెళ్ళి మాట్లాడితే నాకే ఆశ్చర్యం వేసింది. అక్కడి కొచ్చినవాళ్లనందరినీ ఆతనెరుగును. ఎవళ్లెవళ్ళకి యెందుకెందుకు కీర్తివచ్చిందోకూడా చెప్పగలిగాడు నేనడిగిందే తడవుగా. నాక్కాస్త దారి దొరికే నట్లనిపించింది.

"మీరేం చేస్తారండీ" అన్నాను సాహసించి.

ఈ చెవినించి ఆ చెవివరకూ పెదవులు సాచి చిరునవ్వు నవ్వాడు: "నేనేదో మానవమాత్రుణ్ణను కోండి; మరి మీరెవరో చెప్పారుకాదు" అన్నాడు.

ఆయన అడగడమేమిటి, "సినిమా విమర్శకుణ్ణి" అని అంతవరకూ వేసుకున్న రిహార్సల్స్ డైలాగ్ ని నేను వాంతి చెయ్యడమేమిటి, ఒక్కసారే జరిగి పొయ్యాయి.

"ఇంత గొప్పగా హాస్యంవాడ కలిగినవాణ్ణి నిన్నొక్కణ్ణేసుమా యింతవరకూ నా జన్మలో చూచింది" అని ఫకాలున నవ్వాడు విశ్వనాథంగారు, నా వీపు చరుస్తూ. "పద, కాస్సేపలా బయటికి పోయి మాట్లాడుకుందాం. పదమరి, చూస్తావేం యిక్కడ కూర్చుంటే వూపిరాడదు, పద!" అన్నాడు.

ఇద్దరం కలిసి బయటికెళ్లాం. కాస్తదూరం నడచి, కనిపించిన కాఫీహోటల్లో దూరాం. కాఫీ తాగుతూ, సర్వర్ నూనె గుడ్డతో తుడిచివెళ్లిన జిడ్డుబల్లమీద మోచేతులు ఆనించుకుని, మాట్లాడుకున్నాం పట్టపగలు ముసురుకునే తెల్లదోమల్ని పక్కకి నెట్టుకుంటూ. ఆ కాస్సేపట్లోనూ, రచయితల్ని గురించి నేను తెలుసుకున్న దింతా అంతాగాదు; నా యిరవయ్యేళ్ల అనుభవం మొత్తాన్నంతా క్రోడీకరించినా, ఆ కాస్సేపట్లో తెలుసుకున్న దానికింద బలాదూరే!

మళ్ళీ అడిగాను: "మీరేంచేస్తారండీ" అని. అతను తప్పకుండా రచయితే అయ్యుంటాడని నా దృఢాభిప్రాయం. రచయిత కాకపోతే, రచయితల్ని గురించి అన్ని విషయాలాయనకి తెలియడం సాధ్యంగాదు. తప్పదు. అతనుగూడా రచయితే. లేకపోతే అలా మాట్లాడలేడు, అలా ఆలోచించడం శక్యం గాదు, మనుషుల్ని, పరిసరాల్ని అలా పరిశీలించడు. ఐనా దేశంలో రచయితలందరి పేర్లూ యెరిగిన నేను, అతని పేరింతవరకూ విననేలేదు!

"ఇంకొక రెండు కప్పులు కాఫీ!" అన్నాడు సర్వర్ని చేయెత్తి పిలిచి. జేబులోనుంచి సిగరెట్ కేస్ తీసి, నాకొక సిగరెట్ యిచ్చి, తానొక సిగరెట్ నోట్లో పెట్టుకున్నాడు. లైటర్తో యిద్దరి సిగరెట్లూ వెలిగించి, సిగరెట్ కేస్ పక్కకితోసి, కేస్ మీద లైటర్ పెట్టి, ముందుకు వంగి, "నేనా? నేపథ్య రచయితని" అన్నాడు.

నేపథ్య సంగీతాన్ని నిర్వహించే సంగీత దర్శకుల పేర్లు గూడా తెలుసు నాకు; నేపథ్య గాయకుల పేర్లు తెరలమీద చూసినవాణ్ణి నేను!

"అంటే మీరు ఘోస్టురైటర్, వ్రాసే వాళ్లపేరూ వీళ్లపేరూ పెట్టారన్న మాట, పేరున్నవాళ్ల పేరు. ఐనా, మీ పేరుమీద గూడా రాసేవుంటారు, రానే వుండాలి" అన్నాను నేను కంగారు తింటూనే, సాధ్యమైనంత జాగ్రత్తగా.

"లేదు, వ్రాయలేదు"

"యేం యెందుకని?"

ఇంతలో కాఫీ వచ్చింది. కాఫీ గ్లాసు పట్టుకుని, బల్లమీద ముందుకూ వెనక్కీ జరుపుతూ, "ఎందుకూ? వ్రాస్తానే వున్నాగా యెల్లాగూ. యెవరిపేరు మీద వ్రాస్తే మాత్రం యేమిటి నష్టం? నా పేరు కింద వ్రాస్తే వొరిగేదేమిటి?" అన్నాడు.

"అంటే మీరు సినిమా మాటలూ పాటలూ, అన్నీ, మొదట్నించీ చివరివరకూ మీరే వ్రాస్తారన్నమాట. యెవరో వ్రాసిందానికి అక్కడక్కడ మెరుగులు దిద్దడంగూడా కాదన్నమాట?"

"స్క్రిప్ట్ గానీ, సినేరియోగానీ, మాటలుగానీ, పాటలుగానీ, ఆ బాధితుల సహాయార్థం, ఈ బాధితుల సహాయార్థం వేసే నాటకాలుగానీ — నేను మాటలూ పాటలూ వ్రాసిన సినిమా వొకటి మొన్నీ మధ్యనే శతదినోత్సవం చేసుకుంది."

నా ఆశ్చర్యమూ, ఆవేదనా, జిజ్ఞాసా చూచి ముసి ముసి నవ్వులు నవ్వాడు విశ్వనాథంగారు.

చాలా సార్లడిగి చూశాను, విశ్వప్రయత్నం చేసి చూశానుగాని ఆవేళమట్టుకు ఆయన్తో ఆ శతదినోత్సవం చేసుకుంటున్న చిత్రం పేరుమట్టుకు చెప్పించుకోలేక పోయాను. ఈ రోజుల్లో చలనచిత్రాలు శతదినోత్సవం చేసుకోవడంలో గొప్పేంవుంది; హాలు యజమానిహోమీకి డబ్బులిచ్చి వుత్సవాలు జరుపుకుంటున్న విగూడా కద్దేకదా!

ఆనాడైతే చెప్పించుకోలేక పోయానుగాని, తర్వాత మా యిద్దరికీ బాగా పరిచయం యేర్పడింతర్వాత, నన్ను నమ్మవచ్చుననీ, నేనితరులకు చెప్పననీ ఆయనకు నమ్మకం కుదిరినతర్వాత చెప్పాడు. చక్కనిచిత్రం అది, శతదినోత్సవాలు జరుపుకున్న వాటిల్లోకెల్లా బాగున్నదని జనం మెచ్చుకున్నదే అది. ఇంకా ఆయన మాటలూ పాటలూ వ్రాసిన చిత్రాలున్నాయి కాని, అవేమంత విజయవంతమూ కాలేదు; మామూలు సరుకేగూడాను. ఐతే ఆ చిత్రాలకి పెట్టుబడి పెట్టి, యిలాంటిలాంటి కథ, యీ యీ విధంగా వుండాలి యీ యీ పాత్రలిలా ఆడాలి, మాటాడాలి అని చెప్పిన ప్రొడ్యూసర్లు గూడా అంతంతమాత్రంవాళ్ళే. కాని, విశ్వనాథంగారికి స్వాతంత్ర్యం యిచ్చి వ్రాయించుకున్నవి మాత్రం మంచివే, చెప్పుకోతగ్గవి గూడాను.

ఆయనవదంతా చెబుతూంటే నా కాశ్చర్యంవేసింది; అనుమానం వచ్చింది; ఈయన చెప్పేదంతా నిజమేనా అని గూడా ఆశ్చర్యపోయాను, అనుమానపడ్డానుమధ్యమధ్య. కాని, నిజమే; ఆయనచెప్పిందంతా నిజమే, అక్షరాలా. నాకు పరిచయం ఏర్పడిం తర్వాత గూడా చూశాను. ప్రతిరోజూ కష్టపడి, నెలల తరబడి కూర్చుని, మాటలూ పాటలూ వ్రాసి యితరులకి ఆయన కీర్తి సంపాదించిపెట్టడం కళ్ళారా చూశాను. దాంతో పాటు ఆయన నాలుగురాళ్ళు, నాలుగురాళ్ళేంటి, బాగా సుఖంగానే జీవితం గడిపేందుకు సరిపడ సంపాయించుకుంటూండడం గూడా చూశాను. అయినా నాకదేమీ గొప్పనిపించలా.

* * *

అసలీ వ్యవహారమంతా యెలా ప్రారంభమైందనడిగాను తర్వాత చాలా కాలానికొకనాడు.

"మొట్టమొదట్లో నాపేరుమీదే వ్రాశాను. రెండు సంవత్సరాలకి పైగానే తిరిగాను యీ స్టుడియోల చుట్టూ కాళ్ళుబలపాలు కట్టేట్టు. యెలావుందని అడిగిన నాథుడుగూడా లేకపోయాడు చివరికి. యింటికి ప్రయాణం కడదామనుకున్నాను. రైలుటిక్కెట్టుకి గూడా డబ్బులేదు జేబులో. అప్పుడూ ఒకసోదర రచయిత కన్పించాడు. 'వ్రాసి, వ్రాసి నాచేతులు బలపాలు కట్టినై; వూరాలిపెట్టి, మనుషుల్నొదిలిపెట్టి యేళ్ళుపూడినై. యికిప్పుడేది వ్రాసినా, యింగ్లీషు సినీమాలూ హిందీ సినీమాలూ చూస్తేతప్పితే సన్నివేశాలు సృష్టించలేను. ఏ పాత్రతో మాట్లాడించాలన్నా గ్రంథస్తమైన తెలుగో, రోజూ తారలూ డైరక్టర్లూ మాట్లాడే తెలుగో తప్పితే యింకేదీరావడంలేదు. ఓపికలేదు. శక్తిలేదు. కాంట్రాక్టులు మాత్రం వున్నై. ఇంటికెళ్ళేంజేస్తావు. కథలురాస్తే కాండబ్బిచ్చే పత్రికల్లేవు. నాటకాలురాస్తే, ఆడేవాళ్ళకి పెట్టుబడి పెట్టాలి. ఎందుకొచ్చిన గొడవ. ఇక్కడేవుండు. యింతరాయి, నే సూచన లిస్తాను, డబ్బు లిస్తాను. రాసిపెట్టు' అన్నాడు. వ్రాస్తున్నాను. ముందాసోదరుడికీ, తర్వాతింకో సోదరుడికీ..."

"ఆ తర్వాతింకో సోదరుడికీ? అంతేగా? యెప్పుడో మాంధాతల నాటెబ్బందొచ్చిందని, యివాళ గూడా అదేపనా? మీ మాట వింటూంటే కోపం గూడా వస్తోంది నాకు. ఇప్పుడుగూడా యింకా ఆ కక్కుర్తెందుకు?" అన్నాను కోపంగా.

ఈమాత్రం తెలియదా అన్నట్లు జాలిగా చూశాడు విశ్వనాథంగారు నావంక. నాకు తెలుసులే సమర్థం చేసుకోలేవని అన్నట్టు చూశాడు. "యెవరి పేరుతో వ్రాస్తేనేం, నా మాటలూ, పాటలూ విని జనం సంతోషిస్తున్నారు, చాలదూ! పేరంటావ్, నా కదంటే యెందుకనో మోజులేదు. కీర్తనేక రకాలు. నా కా కీర్తంటే యేమీ యిదిలేదు" అన్నాడు.

"అది కాదు. ఇంతకంటే పచ్చి అన్యాయమూ, మోసమూ, యింకేమన్నా వుంటుందా? వల్లగాదు. మీరలా మాటునే వుండడానికి వీల్లేదు."

"అది కాదయ్యాబాబూ, నేను చెప్పేదిగూడా విను మరి. జనానికా, వ్రాసింది కావాలిగాని, అదెవరు వ్రాశారో అవసరంలేదు. నాకు సన్నిహితంగా వుండే స్నేహితులికంటావా నేను ఫలానా ఫలానా చిత్రాలకి వ్రాశానని తెలుసనే తెలుసు. చూస్తారు, వింటారు, ఆనందిస్తారు. డబ్బు యెలాగూ బాగానే ముడ్తోంది నాకు. ఇకిప్పుడు కాటికి కాళ్ళు చాచుకున్నవాణ్ని నా పేరుకింద వ్రాస్తేయెంత, వ్రాయకపోతే యెంత! నువ్వంటున్నావే యేదో అన్యాయం జరిగిపోతోందని, జరగనీ. నాకు జరగాలిసిందేదో జరిగిపోయింది."

విశ్వనాథంగారి మాటలు వింటూంటే నవ్వొచ్చింది నాకు. ఆపూట కా సంభాషణ నక్కడ వదిలిపెట్టాను గాని, తర్వాత మానుకోలేదు. నేనూ, ఆయన స్నేహితులు మరియిద్దరుముగ్గురమూ కలిసి రోజూ ఆయన్ని కొరుక్కుతినడం ప్రారంభించాం; సొంతంగా కథా, సంభాషణలూ, పాటలూ వ్రాయమనీ, అవి తీసుకెళ్ళి యేదోఒక ప్రొడ్యూసర్ నంగీకరింపజేసే బాధ్యత మాదనీ, యిలాగే — చివరికలాగైతేనే ఒప్పుకున్నాడు బ్రహ్మప్రళయంమీద.

"ఇదిగో అబ్బాయి, నీతో పట్టి బలవంతాన చేయిస్తున్నా రీ పని. మీరుచెప్పినట్టు నాపేరే పెడతాను. దైవవశాత్తిది బాక్సాఫీస్‌లో ఫ్లాపై కూర్చుందా, మీ కందరికీ వొకటే భజన, రాంభజన!" అన్నాడు విశ్వనాథంగారు.

"యేం ఫర్వాలేదు" అన్నాన్నేను అంటానికన్నానుగాని, ఆలోచించుకుంటే నాకూ భయం వేసింది. ఈయన్తో వ్రాయించుకున్న సోదర రచయితలు గూడా మొట్టమొదట బాక్సాఫీస్ హిట్స్ వ్రాసిన వారే; తర్వాతతర్వాత జ్యోతి ఆరిపోయింది. జనానికీ, జనం జీవితానికీ దూరమైపొయ్యారు. మరీయనా యిక్కడికి వచ్చేసి, యీ ప్రపంచంలో పడిపోయి,

చాలా కాలమైపోయింది. మనిషి హుషారుగానే కనిపిస్తున్నాడు గాని, ఆరోగ్యం సరిగ్గావున్నట్లు లేదు. గట్లంతు కాడుగదా? మొట్టమొదటిసారి తన పేరు తెర మీద లక్షలాదిజనం చూస్తారని అనుకుని ఉబ్బితబ్బిబ్బు కాడు గదా? తల్లక్రిందవ్వడుగదా? న్యాయంగా ఆలోచిస్తే మనిషులాంటివాడు కాడుమరి. అయినా నాకు బాధగానే వుంది, ఆందోళన పడుతూనే వున్నాను ఏమౌతుందో నని.

* * *

రోజులుగడిచినై. నాలో ఆందోళన యెక్కువైంది. విశ్వనాథంగారు వున్న కొలదీ పాలిపోతున్నాడు. పిచ్చి వాడిలా కాఫీహోటళ్ళంట తిరుగుతున్నాడు. ఇదివరకు రోజు కిరవై కప్పులు తాగితే ఇప్పు డేభై తాగు తున్నాడు. పొట్ట చెడిపోక తప్పదు; ఆరోగ్యం దెబ్బతినక తప్పదు అని అనుకుంటూనే వున్నాను. పెట్టె బేడా సర్దుకొని, వాళ్ళ జిల్లా వెళ్ళిపోయాడని తెలిసింది. వచ్చేటప్పుడు వ్రాతప్రతిని పూర్తిచేసు కొస్తానని మాత్రం హామీ వదలి వెళ్ళాడు.

నాలుగు నెల్లతర్వాత తిరిగొచ్చాడు వ్రాతపని పూర్తి చేసుకుని.

నిజంగానే బావుంది. ఇంతకు పూర్వం అతను వ్రాసిన వాటన్నిటికంటే బాగావుందనిగూడా చెప్పొచ్చును. మాటిచ్చిన ప్రొడ్యూసర్ మాటమీద నిలబడ్డాడు. ప్రఖ్యాత తారలిద్దరు పోటీలుపడివచ్చారు మేం నటిస్తామంటే మేం నటిస్తామని. చిత్రం తయారైంది. విడుదలైంది. మంచి చిత్రమని సమీక్ష వేశాను నేను మా పత్రికలో. చూసిన వాళ్ళంతా యీ చిత్రం తప్పక శతదినోత్సవం చేసుకుంటుందన్నారు. జనం ఎగబడింది.

అంతా బాగానే వుంది కాని, విశ్వనాథంగారు దిమ్మెచ్చి పడిపోయారు. ఇదివరకు మంచీవున్న గుండె జబ్బేనన్నాడు డాక్టరు; ఇంజక్షనిచ్చాడు. విశ్వనాథంగారు కోలుకున్నాడు.

"ఇక కొస్తానండీ" అన్నాన్నేను విశ్వనాథం గారితో.

"మాట" అన్నాడాయన, తలుపు దగ్గరనే తచ్చాడుతూంటే, దగ్గర కెళ్ళాను.

"చూశారా, నేనన్నదే నిజమైంది. మీరు విజయం పొందుతారని నాకు మొదట్నుంచీ తెలుసు" అన్నాను.

"నిజంగానా?"

"నిజంగానేనండీ. మీరు వ్రాసినయ్యిదివర కెన్ని సార్లు బాక్సాఫీస్‌హిట్స్ కాలేదు? ఈసారి గూడా బౌతుందని మీరెందు కనుకోలేకపోయారో అర్థం గావడంలేదు నాకు" అన్నాను. ఇదివరకాయన వ్రాసి పెట్టినందువల్ల పేర్లు సంపాయించుకున్న వాళ్ళందరూ గుర్తుకొచ్చారు నాకప్పుడు. ఈయన బదులు వాళ్ళు హాజరై వచ్చారు శతదినోత్సవాలకి. ఈయనకు రావలసిన కరతాళ ధ్వనులూ, అభినందన పత్రాలూ, పూల మాలలూ, బహుమానాలూ స్వీకరించుకొచ్చారు. కనీసం యీ సారైనా యీయన వెళ్తాడు. చేసిన కృషికీ, చూపిన ప్రతిభకీ జేజేలు స్వయంగా స్వీకరిస్తాడు.

"ఇంతవరకూ మీ పేరుపయోగించుకున్న వాళ్ళంతా శతదినోత్సవాల నాడెలా ఆనందించారో యీసారి మీరే స్వయంగా అలాగే ఆనందిస్తారు సుమండీ" అన్నాను వుత్సాహంగా.

ఈ చెవినించి ఆ చెవివరకూ చిరునవ్వు నవ్వాడాయన. "నిజమే, వాళ్ళప్పు డెంత ఆనందించారో సరిగ్గా అంతే ఆనందిస్తాను నే నీసారి" అన్నాడు. అని పకపకా నవ్వాడు. నిజంగానే ఆనవ్వాయన ట్రేడ్ మార్కు.

కాని, ఆయన "సరిగ్గా అంతే" అన్నప్పుడు చేసిన వుచ్చారణ, ముడిచిన కనుబొమలు, నొక్కినొక్కి చూచి దిగ్భ్రాంతుణ్ణయ్యాన్నేను.

"సరిగ్గా అంతే కాదనుకోండి. వాళ్ళంటే యెవరో వ్రాసిందానికి తామే కర్తలమని నిలబడ్డారు. ఇప్పుడంటే కర్తలూ, భర్తలూగూడా మీరే నాయె" అన్నాను తప్పు దిద్దుకుంటూన్నట్టు.

"బోనామరి" అన్నాడాయన.

తర్వాత కుశల ప్రశ్నలు వేశాను. నవ్వుతూ, సెలుతూ మాట్లాడాడు. నవ్వుతూనే సాగనంపాడు నన్ను వీధి గుమ్మం వరకూ. "నేమా గొప్పవాళ్లన్న సంగతి మరచిపోకండి రావుగారూ?" అన్నాడు నేను చేతులు జోడించి సెలవు తీసుకుంటూంటే. అని, యీ చెవినించి ఆ చెవివరకూ నవ్వాడు బోశాగా. ఇతరుల కలా నవ్వడం చేతగాదు. ఆ నవ్వాయనకి ట్రేడ్‌మార్కు.

# కారెంపూడి

## 'ధనకుధరం'

చెడుగుడులాడి రాకొదమ సింగములై పలనాటి వీరు లి
క్కడ ! – ఇట రక్తవాహిను లఖండములై ప్రవహించి సర్వమున్
మడుగులు కట్టెనా ! – పనికిమాలిన స్వార్థపిశాచి ఇచ్చటన్
జడముడి వీడగా విలయ నాట్యము చేసినదా మహోద్ధతిన్.

నాయకురాలి ప్రేరణమునన్ శివమెత్తి వృథాభిమానులై
మాయ మసంగు లంటని అమాయకు లీ పలనాటి వీరు ల
న్యాయముగా వధింపబడి రక్కట ! దీని తలంచుకొన్న నా
యీ యెద అగ్నిపర్వతము లెన్నియొ మంటలు పుక్కిలించెడిన్.

అప్పటి ఘోరమెల్ల కనులార కనుంగొని గుండెబండలై
ముప్పిరిగొన్న శోకమున ముందుకు సాగుచు నాగులేరు తా
నిప్పుడుగూడ ఘోషిలు మహీధర గహ్వరముల్ ధ్వనించగా
చెప్పెడు మాటలన్ విని నశించిన యోధుల వీరగాథలన్.

రాజ్యాంగ విదుడు ధర్మ విచక్షణాశీలి
　　బ్రహ్మనాయుని బుద్ధి పాటవమ్ము
అరిమదగజముల కురుకు సింగపు పిల్ల
　　బాలచంద్రుని భుజా స్ఫాలనమ్ము
సమరాంగణోత్తేజ చండ విక్రమమూర్తి
　　కన్నమదాసు హుంకార రవము
శస్త్రశాస్త్రకళా విశారదుండు మనీషి
　　అనపోతు నిర్మల త్యాగమహిమ

నాగమాంబిక కుటిల తంత్రమున తుదకు
సన్నగిలి – తేలి – గద్గదస్వరము బూని
బీదవడి నాగులేట బింబించి ఇపుడు
తీరని అశాంతి రేపి ఉద్విగ్న పరచు.

శైవ వైష్ణవాల సమరాన తెగబడ్డ
వీర రక్తధార చూరగ్రోలి
గంగాధారమడుగు సంగనాచికి పోలె
ఉలుకు పలుకు లేక ఉన్న దిపుడు.



# వచనపద్యాలు : కొన్ని సూచనలు

బూదరాజు రామకృష్ణ

బహుకాలంగా ఆంధ్ర సాహితీ ప్రపంచంలో ఛందస్సౌలభ్యం ( Free Verse ) కోసం తీవ్రమయిన ప్రయత్నాలు జరుగుతూనేవున్నాయి. సంప్రదాయబద్ధమైన ఛందస్సులను గతానుగతికంగా రచించటంలో కీర్తిశేషులు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారివంటి వారికే విసుగుపుట్టిందనుకుంటాను. అయితే వారు మార్పుకోసం సూచించిన 'వెండి, బంగారం' వంటి నూతన ఛందస్సులు వారితోనే అంతరించాయి. వాటిని అనుమోదించిన, లేక అనుకరించినవారు నా సామాన్య దృష్టికి తగలనేలేదు. తరువాత 1910 నాటికే ప్రజాకవి చక్రవర్తి గురజాడ అప్పారావుగారి 'ముత్యాలసరాలు' ముత్యాలవర్షం కురిపించి, ఆంధ్ర సాహితీపరులకు కొత్తదారులు చూపించాయి. తరువాత అభ్యుదయ వాదుల ప్రయత్నాలలో 'వచన పద్యాలు' ఆవిర్భవించాయి. ఎంకిపాటలవంటి జానపద గేయాలు, అంతకు ముందే దేశంలో వ్యాపించాయి. 'గీతాలు, గేయాలు' (రెండవ పదమే ఎక్కువ వాడుకలో వుంది) అన్ని పేర్లు ఎక్కువ ప్రచారంలోనికి వచ్చాయి. అయితే అభ్యుదయ కళాకారుల రచనలన్నీ పాడదగినవిగాలేవు.

ఆంగ్ల కవుల 'Blank verses' (బ్లాంక్ వర్సు)లో బీజప్రాయంగావుండి, తరువాతికాలంలో మంచిస్థితికి వచ్చిన ఛందస్స్వేచ్ఛ (Verse - libre) ఈ నాటి అభ్యుదయ కవిత్వానికి ఏకైక లక్ష్యం కాదుగాని, ప్రముఖలక్ష్యంగా వున్నదని చెప్పవచ్చు. వచనంవలె 'చదువదగిన' పద్యాలు కాబట్టి 'వచన పద్యాలని' వీటిని పేర్కొన్నందున ప్రయోజనమేమీ వుండదు. పద్యశబ్దానికిగల ప్రయోజనం శ్రవణపేయత్వమని గుర్తించినప్పుడు, 'వచన పద్యాలు' అవటంలో వచనంవలె కనిపించినా 'పాడదగినవే' అన్నభావం వుండక పోదనుకుంటాను. భావగతితోబాటు భాషాగతిలో పరివర్తన రావాలని, ఛందస్సు పేరిటి ఇనపచట్రంలో మాటలను పొదగాలన్న 'నియమం' వున్నంతకాలం బుద్ధికి శ్రమతోబాటు, భావవ్యక్తీకరణ కుంటుపడి భాషతొట్రుపడుతుంది కాబట్టి, ఏవోకొన్ని నియమాలు కాక ఛందస్స్వేచ్ఛయే కవికి వుండాలనీ, నవ్యులం వాదిస్తున్నాము. పద్యంలోవలె ఏదో ఒక తీరు 'నడక' వున్నప్పటికీ, భావానుగుణంగా అది మారుతుందనీ, అందువలన రచన ఆసాంతం ఏకచ్ఛందంలో వుండదనీ, వ్యక్తీకరించడానికి వచన పద్యాలన్న పేరుబాగా వుపకరిస్తుందని కూడా చెప్పవచ్చు. ఈ విషయంపై ఇంకా వ్యాఖ్యానించటం అవసరంకాబోదని భావిస్తున్నాను.

ఆంధ్ర సాహితీ పరిణామక్రమాన్ని పరిశీలించినప్పుడు సరిగా ఈలాటి ప్రయత్నాలు కాకపోయినా, ఇందుకు బీజప్రాయములయిన లక్షణాలుగల ప్రయత్నాలు కొన్ని జరిగినట్లు కనిపిస్తూనే వుంటున్నవి. ప్రాచీనాంధ్రకవుల 'శబ్దాభిమానం' అట్టి సంప్రదాయాలను సులభంగా జయించగలిగిందని అనుమానిస్తున్నాను. సంప్రదాయం 'పద్యకవిత' అని పరిగణించని రచనలు కొన్ని పద్యానికి సన్నిహితంగావున్నాయని చెప్పవచ్చు. ఒకకాలంలో పద్యగద్య శబ్దాలు రెండూ, సమానార్థకాలుగానే పరిగణింపబడినవన్నా ఆశ్చర్య పడవలసిన పనిలేదు.

అటు సంస్కృతాలంకారికులు, ఇటు ఆంధ్రలాక్షణికులు గద్య భేదాలను వర్ణించినప్పుడు - పద్య భాగాలు అంతర్గర్భితంగావున్న గద్యాలను 'వృత్తగంధి గద్య'లని పేర్కొనివున్నారు. నన్నయనుండి చిన్నయ వరకుగల సాహిత్యంలో ప్రాచీనాంధ్ర కవులు వృత్తగంధి గద్యరచన ఏయేవిధాల చేశారో చాలమంది విమర్శకులింతకుముందే నిరూపించివున్నారు. లాక్షణిక మర్యాదలనుబట్టి చూడగా 'ఉదాహరణ కావ్యాల'లోని 'కళికోత్కళిక'లనే మాత్రాచ్ఛందస్సులు పాల్కురికి సోమనాథాదులు రచించిన 'గద్యము'లూ, రగడలుగా, వాటి వికారరూపాలుగా, గానయోగ్యములుగా వున్నప్పటికీ పద్యాలుగా పరిగణింపబడలేదని తెలుస్తున్నది. ఈ విధమైన రచనకు 'ఉత్కళికాప్రాయగద్య' అనిపేరు. ఇట్లు గద్యభేదాలుగా చెప్పబడిన వాట్లింటిలో రెండు గానయోగ్యతచే పద్య కవితకు, లేక పద కవితకు సన్నిహితంగావున్నాయి. అయితే, గద్య వచన శబ్దాలను మనం పర్యాయ పదాలుగానే వుపయోగిస్తున్నాము. నేటి వచన పద్యాలలో కొన్ని సంగీత సంబంధం కలిగివున్నవని చెప్పటం విరుద్ధం కాబోదు.

'వచనవాగనుశాసను'డని చెప్పబడిన కృష్ణమాచార్యుని (క్రీ.శ. 14వశతాబ్దినాటివాడు) 'వచనముల'కు తరువాతిలాక్షణికులు 'చిన్నపాలం' అని పేరు పెట్టారు. 'అల్పసమాసకము' అని లాక్షణికులు నిర్వచించిన 'చూర్ణిక' అన్న గద్యభేదాన్ని 'సంకీర్తనాచార్యు'డైన అన్నమాచార్యుడు 'తాళగంధి చూర్ణిక'మని వ్యవహరించాడు. అంటే గద్యభేదాలలోమూడవదైన చూర్ణికకూడా తాళబద్ధమై గానయోగ్యమైనదే అని గుర్తించాలి. తాళ్ళపాక పెదతిరుమలయ్య రచించిన 'వేంకటేశ్వర వచనములు' 166 దాకా లభించాయి. 'వైరాగ్యవచన మాలికాగీతము'లను పేర 30 రాగాలలో పాడదగివున్న వని ప్రకటనకర్తలు విశదీకరించారు! వచనంలో 'శ్రావ్యత' లేదనే వారికీఉల్లేఖనం సమాధానప్రాయం కాగలదు. వీటినే 'వచనశతకాల'ని కూడా వ్యవహరించవచ్చు. ఛందస్సుతో నిమిత్తం లేక, పరిమితి ఇదమిత్థమని నిర్ణయింపబడక, రచింపబడిన ఆ వచనాలలో ఛందస్స్ఫూర్తి లేదని చెప్పలేము. కాగా 'ముక్తకము' అన్న గద్యభేద మొక్కటే గానయోగ్యంకానిదిగా వున్నది. ఈవిధంగా ప్రాచీన గద్యరచనలలో కవి ఛందస్స్వాతంత్ర్యంకోసం ప్రయత్నపడినట్లు తెలియవస్తున్నది. కాని యిట్టిరచనలను ప్రాచీనలాక్షణికులు 'గౌరవించి'నట్లు కనిపించదు. కవులలోనైనా, చాలమందికి నూతనత్వం గవేషించాలన్న అభిప్రాయ లేశమైనా లేనట్లు గోచరిస్తూనే వున్నది. 'ఈ తీరు' వచనపద్యాలు ప్రాచీన సాహిత్యంలో ప్రతిష్ఠాకరమైన స్థానాన్ని సంపాదించుకోలేదు.

కారణం ఏమిటన్నదే ముఖ్యమయిన ప్రశ్న. అది యుగధర్మమో, గద్య రచయితల అప్రయోజకత్వమో, కవితాశిల్పం వాటిలో కొరవడినదో, పద్యకవిత బలప్రయోగం చేసిందో ఈనాడు చెప్పటం సులభసాధ్యంకాదు. సంస్కృత ప్రియులయిన ప్రాచీన కవులు సంస్కృతంలో 'వలె', తెలుగులో కూడా వచన రచనలను ఆదరించలేదనినప్పటికీ - కాదంబరి వంటి ఉద్గ్రంథాలకు ప్రతికల్పమైన రచనలు తెలుగులో రానేలేదు. ఆంధ్ర కవుల మనస్తత్వం దశకుమారచరిత్రవంటి వచన గ్రంథాలను పద్యప్రబంధాలుగా ఆంధ్రీకరించేవరకు సంతృప్తిపడనేలేదు - విశ్రమించనూలేదు. నాటకాలను ప్రబంధీకరించిన కళావేత్తలకు గద్యరచనల నామోదించటం కష్టంగానే వుంటుంది! కవిత్వంలో దేశీయ విధానాలకోసం పాకులాడిన సోమనాథాదులు విప్లవకారులుగానే భావింపబడ్డారు. మత విప్లవానికి సహాయకరంగా సాహితీ విప్లవాన్ని సాగింపదలచిన సోమనాథాదుల 'వాక్స్వరూప్యం' చాలవరకు వారి పతనానికి కారణమైనదేమో అని నేను అనుమానిస్తున్నాను. అయినా ద్విపదవాఙ్మయాది దేశిప్రక్రియలు నశించలేదు. గద్యప్రక్రియలుమాత్రం కాలగర్భంలో కలిసిపోయినవి. కొందరు విద్వాంసులు రంగనాథ రామాయణంలోని రచనాసౌలభ్యం వీరశైవుల 'జాను తెనుగు'వాదాన్ని పడగొట్టగలిగిందనీ- సోమనాథాదులు చెప్పినంత సులభ భాషలో రచించలేకపోవటమే గాక, రంగనాథ రామాయణం 'బొమ్మలాట రామాయణం' కాగలిగినంత ప్రజాకర్షకం కావటముకూడా వీరశైవుల వాదాన్ని దుర్బలపరచగలిగిందనీ- అభిప్రాయపడుతున్నారు. ఇది కొంతవరకు నిజమే. దేశంలో జీర్ణించిపోయిన మతాభినివేశం, అసహిష్ణుకత, మూఢవిశ్వాసం అన్నవికూడా ఈ సందర్భంలో ప్రధానపాత్ర వహించాయనటం అసమంజసం కాబోదు. మరి గద్యసాహిత్యం గంగలో కలియుడానికి హేతువేమిటి? గద్యరచనలు కేవలం స్తోత్రపాఠాలు కావటమే నని నేను శంకిస్తున్నాను. చరిత్ర పునరావృత్తం కారాదంటే, ఈ గుణపాఠాలను గ్రహించక తప్పదు. దూషణప్రధానంగానో, స్తుతిప్రధానంగానో రచించినందున గ్రంథజీవితకాలం తగ్గిపోతుందని మనం గ్రహించవలసి వున్నది.

వీరశైవ యుగానంతరం తిక్కనవంటి మహాకవి సంప్రదాయ సంరక్షణకు నడుంకట్టినపుడు, తనరచనలో ఎక్కువ పాళ్ళు 'తెనుగుదనం' కోసం ప్రయత్నించక తప్పలేదనికూడా గుర్తించాలి. తిక్కన పద్యరచన వచనానికి సమీపంగా వుండేటట్లు రచించటంలో కొంత కృతకృత్యుడు కాకపోలేదు. వీరశైవుల ఉద్యమం సంప్రదాయ వృక్షాన్ని కొంతవర కీవిధంగా లొంగదీసింది. కాని కేవలం ఎదుర్కొనటమే ఎవరికీ సహాయం చేయలేదు. ప్రతివాది ప్రయత్నాలకు ప్రత్యామ్నాయం కాగలిగిన ఉత్తమరచనలను, ఉత్తమాదర్శాలను ప్రతిపాదించనిదే విజయం లభించదు. వ్యయ సంవత్సర పుష్యమాసపు 'భారతి'లో శ్రీయుతులు మల్లవరపు విశ్వేశ్వరరావుగారు "కవిత్వంలో క్రొత్త రీతులు-వచనములాంటి పద్యాలు" అన్న శీర్షికకింద శ్రీయుతులు వేంకట పార్వతీశ్వర కవులు మొదలైన వారి పద్యాలు వచనములాగా నడిచినట్లు నిరూపించి వున్నారు. తిక్కనవంటి ప్రాచీనుల రచనలలోకూడా అట్టి రచనా విధానాలను గుర్తించవచ్చు. అయితే ఆ కవుల ధారాశుద్ధికి ఛందోవశిత్వానికిమాత్రమే అట్టి గుర్తింపు నిరూపకం కాగలదు. (నేటి వచనపద్యాలు

స్వభావంలో వాటికి విపరీతమైనవని నేను భావిస్తున్నాను). అయితే ప్రాచీన కవిలోకంలో శైలివిషయంలో తిక్కనను ఆదర్శంగా పెట్టుకొన్నవారు అతి స్వల్ప సంఖ్యాకులే అని మనం గ్రహించాలి.

పోతన పద్యాలకు వచ్చిన ప్రచార గౌరవం తిక్కన పద్యాలకు రాలేదు. అందుకు పోతన శబ్దాలంకార ప్రియత్వమో, అతని జీవిత విధానాలపై ప్రజలకున్న సానుభూతియో, భాషకు జీవగర్రలైన సామెతల వంటివాటిలో విధిగా కనిపిస్తున్న అనుప్రాసం విన్యాసం ఆంధ్రప్రజలకు ఎక్కువ ప్రీతికరం కావటమో కారణాలు కావచ్చును. వచనంవలె నడిచిన పద్యాలపై అభిరుచిలేకపోవడానికి హేతువేమిటో విమర్శించి, ప్రజలుతిరస్కరించిన కవిత్వంలోని లోపాలను గుర్తించి, సవరించుకోవటం ప్రజాకవిత్వం చెప్పదలచిన అభ్యుదయ కాములకు ప్రధానకర్తవ్యం కాక తప్పదు. పోతన కవిత్వంలో 'ఉన్నంత' సంస్కృతాని నిజంగా ప్రజలు అర్థంచేసుకొని అనుమోదించి వుంటే-వ్యావహారిక భాషావాదులమైన మనం ఈనాడు రచనలో సౌలభ్యం కోరుతున్నాము గనుక, ప్రజాభాషలోనే రచింప దలపోస్తున్నాం కాబట్టి - 'అంత' సంస్కృతాన్ని ఆమోదించడానికి అభ్యంతరం చెప్పనక్కరలేదు. గ్రాంథికభాష 'కృతకభాష' అని నిరూపించగల్గిన మనం, 'అంత' కృతకభాషను స్వీకరించటంకంటె మన వాదాన్నే వదలుకోవటం మంచిది. కాని, బుర్రకథలవంటి సాహితీ ప్రక్రియల కున్నంత వ్యాప్తిగాని, సులభ బోధకత్వంగాని పోతన రచనకున్నదా అని ప్రశ్నించుకొందాం. దానికి సమాధానం 'లేదు' అన్న రెండక్షరాలుమాత్రమే. అట్టి సౌలభ్యం లేనివాని రచన మత విశ్వాసహేతువు, ఒక్కదానివల్లనే ప్రజాకర్షకం కాలేదు. శబ్ద సంవిధానంలోని 'మార్దవం' మాత్రమే పోతనకు పట్టాభిషేకం చేసిందని నేను భావిస్తున్నాను. లాక్షణిక మతానుసారంగా విమర్శించినా తిక్కనలో లేని కవితాశిల్పం పోతనలో లేదు. అయితే తిక్కన భాషకంటె పోతనభాష మృదువైనది, కర్ణపేయమైనది! ప్రతిసామెతలోనూ యతికోసం దేవులాడే ఆంధ్రప్రజ, సంస్కృత భూయిష్ఠభాషకదా అని పోతన భాషను ఆదరించలేదని నే ననుకుంటున్నాను. వేమన పద్యాలలో కనిపించే సులభభాష సంస్కృతమయం కాదు. అయినా దానికున్న ప్రజాభిమానం ఏ యితర రచనకూ లభించలేదు. అనగా చిన్న చిన్న తెలుగుపదాలలో ప్రాస చిత్రంతో రచించినప్పుడే ప్రజాతిత్వం (Genius of the Country) ఆ రచనల నభిమానించగలదని గుర్తించాలి. అందుచేత అభ్యుదయ కాముకుడైన కవి ప్రాచీన ప్రబంధాలలోని సంస్కృతానికి పరిమితులు సంస్కృతాన్ని దిగుమతిచేసినందున, తన ఉద్దేశ్యాలకు తానుగా దూరమైపోతున్నానని గ్రహించవలసి వుంటుంది...

తిక్కనాదులు పద్యాలను వచనంవలె వ్రాయటానికి ప్రయత్నించినా, వారి దృష్టి సంప్రదాయ ప్రపంచపు పరిహద్దులు దాటలేదు. అనంతాదు లాతని అనుసరించబోయినా, అట్టివారి సంఖ్యను వేళ్ళపై లెక్కించవచ్చు. ఇంతకాలానికి మళ్ళీ వచన పద్యరచన ఉద్యమ రూపం ధరించింది. ఇప్పుడు వచన పద్యాలు మంచివ్యాప్తిలో వున్నాయి. అందుచేతనే వచన పద్యరచనా ప్రయత్నాలను చరిత్రనుండి గ్రహించి పూర్వ ప్రయత్నాలలోని లోటుపాట్లను పునర్విమర్శించి, భవిష్యత్తుకై పాఠం నేర్చుకోవాలని భావిస్తున్నాను. శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారు, 'ముక్తచ్ఛందాలు' అన్నా, శ్రీ విశ్వేశ్వరరావుగారు 'నూతన ఛందస్సులకోసం జరిగే అజ్ఞాతాన్వేషణ' అన్నా, శ్రీ పఠాభిగారు 'వచనపద్యా' లన్నా, ఏకరూపమైన భావనలోనే వారున్నారని నమ్ముతున్నాను.

అభ్యుదయవాదు లింతగా నూతన ఛందాలను అన్వేషించి ఉపయోగిస్తున్నామని చెప్పుకొంటున్నా, సంప్రదాయ ప్రియులు కొందరు ప్రతిసభలోనూ, వీలు దొరికినప్పుడల్లా, వీరికవిత్వంలో 'ఛందస్సు' లేదనీ, ఆ ఛందస్సులకు 'పేర్లు' లేవనీ, ఆక్షేపిస్తూనేవున్నారు! ప్రాచీనుల దృక్పథంలో ఛందశ్శాస్త్రం, గణితశాస్త్రంలోని ఒకభాగమా అనిపించగలిగినంత విశాలంగావున్నదని వీరు గుర్తించినట్లులేదు. ఇరవైఆరు ఛందాలలోనూ పుట్టగలవని లాక్షణికులు భావించిన పదునాల్గు కోట్ల నలభై రెండు లక్షల పై చిల్లర పద్యాలలో ప్రతి వచనభాగం ఏదో ఒక పద్యభాగం కాకపోదనీ, అభ్యుదయ కవులింతకు మించిన నూతన ఛందాలను వేటిని 'కనిపెట్ట'గలరనీ ఆక్షేపించి మరికొందరు సంతృప్తి పడుతున్నారు! శ్రావ్యంగా పాడదగినవి లేక చదవదగినవి అనదగిన పద్యాల నన్నిటినీ అప్పకవి ఏకరువు పెట్టినందున, శ్రావ్యతాలోపం నూతన ఛందాలలో వుండక తప్పదని కొందరు ప్రకటిస్తున్నారు. అప్పకవికీ శ్రావ్యతకూ ప్రొద్దుకురని, సంగీత సంబంధులైన తాళగతులను గుర్తించలేని అప్పకవి ఉదాహరణ పద్యాలకు ''గతు'లు తప్పగా, ఆతడొక ప్రమాణమా అని కొందరు అపహసిస్తున్నారు. అప్పారాయోపజ్ఞకములయిన 'ముత్యాలసరాలు' రగడవికారములే అని కొందరు

మూసిపోగా, రగడలుకూడా పూర్వులదృష్టిలో గద్య భేదాలేనని కొందరు సంతోషిస్తున్నారు.

ఇంతకూ, ఇంత చర్చ అక్కరలేదంటాను. 'కని పెట్టటం', 'పేర్లుపెట్టటం' లాక్షణికుల పనిగాని, కవుల కర్తవ్యం కాదు. లక్షలాదిగా వెలువడుతున్న వచన పద్యాలను భవిష్య లాక్షణికులు పరిశీలించి, ఆ నాటికి నిలిచిన ఉత్తమ రచనలలోని 'సుప్తచ్ఛందాలకు' జాగ్రదవస్థ కల్పించి, వాటిలోని సమాన ధర్మాలను క్రోడీకరించి విమర్శిస్తారు - లక్షణం రచిస్తారు - ప్రమాణీకరిస్తారు. కాలక్రమాన క్రొత్త ప్రమాణాలు జీవద్భాషలో ఉద్భవిస్తుంటాయి. దేశకాలపాత్రల ప్రభావం ఎప్పటికప్పుడు వాటిని నిర్ణయిస్తుంది...ప్రతి వచనభాగం ఏదో ఒక పద్యపాదం కావచ్చు. ఛంద స్తత్వమే అట్టిది. పద్యగద్యాలు పుట్టుకలో సమానమైనవే. ఏకజాతి, ఏకభావ - సృష్టిధర్మాలుగా గుర్తింప గల సహృదయులు, వచన పద్యాలను 'అస్పృశ్యులు'గా నిరాదరించటంలో అర్థమే లేదు. గద్యపద్యాలకు వైవిధ్యం లేనపుడు, గద్యసాహితి నశించి, పద్య సాహితిమాత్రమే జీవిస్తుందని భావించటం అవ్యక్తుల పని. వచన గ్రంథమైన 'బైబిలు' నశించలేదు. పద్య గ్రంథాలయిన అజ్ఞాతకవుల రచన లెన్నో యిప్పటికి నశించకపోవనూలేదు. కాలం, కవితాధర్మం నిర్ణయించ వలసిన 'కావ్య జీవితాన్ని', అల్పజీవియైన మానవుడు నిర్ణయించగలననుకోవటం మన దౌర్బల్యానికి మాత్రమే నిదర్శనమవుతుంది.

పద్య గద్యాలను భిన్నదృష్టితో చూచేవారు చాల మంది వున్నారు. వ్యావహారిక భాషావాదాన్ని 'పాక్షికంగా' అంగీకరించిన పెద్దలు కొందరు ఈ కోవలోని వారే. వచన సాహితి నశిస్తుంది కాబట్టి, అది వ్యావహారిక భాషలోవున్నా, 'ప్రమాదం' లేదని వారిభావన. శుద్ధ సంస్కృతంలో, చిన్నయసూరి ఆజ్ఞలకు చిన్న మెత్తు భంగం కలగని పద్ధతిలో పద్యాలు రచిస్తూ, వచనంలో - దానితోబాటే నశించగలదని తాము భావిస్తున్న వ్యావహారిక భాషను - తటస్థవాదులయిన వీరు. భాషలోని పరిణామక్రమం గుర్తించలేనివారికి సమాధానాలు చెప్పటం ఈవ్యాసరచనోద్దేశ్యం కాదు. అయినా వచన పద్యాలకు ఉరిశిక్షను విధించగల శక్తి మీకు లేదని చెప్పదలచాను.

అయితే భాషలో సౌలభ్యం, భావంలో స్పష్టత, ఛందస్సులో స్వాతంత్ర్యం వచనపద్యాలలో సర్వత్రా కనిపించవలెనని చింతిస్తున్నాను. వ్యష్టిధర్మంగా కాక, సమష్టి లక్షణంగామాత్రమే నే నీమాట అంటున్నాను. ప్రత్యేక రచనలలోని ప్రత్యేక సుగుణాలను నేను కించ పరచటం లేదు. 'ఉదాత్త భావాల'ను 'ఉదాత్తభాష'లో (అంటే గ్రాంథిక భాషలో) మాత్రమే చెప్పగలమన్న వాదాన్ని నిరాకరించే వ్యావహారిక భాషావాదులే రచనలో సౌలభ్యాన్ని కోల్పోరాదని ఆశిస్తున్నాను. తత్వ విచారం ఉదాత్తం కానిదని ఎవరూ అనలేరు. వేమన సులభసుందర భాషలో దానినే వివరించాడని అందరూ అంగీకరిస్తారు. అందుచేతనే భాషనువినియోగించటంలో కవిలోపము వుండవచ్చుగాని, భాషలో సౌలభ్యలోపం లేదని మనవిచేస్తున్నాను. వచన పద్యరచయితలీ విషయాన్ని ముఖ్యంగా గమనించాలి. అలా అనటంలో అధిక్షేపణ కాక మిత్రవాక్యంమాత్రమే వున్నది. భావ, ఛందస్సులలో నూతనత్వం సాధించగలిగినవారు భాషా విషయంలో వెనకపడిపోరాదు. చిక్కని జాతీయాలతో, చిన్న చిన్న వాక్యాలతో, తెలుగువారు అభిమానించే ప్రాసచిత్రంతో, అన్వయక్లేశంలేని ధారాళతతో రచించటం అందరికీ సాధ్యపడకపోవచ్చు. నిజానికి నాకు ఈ నాటికీ సాధ్యపడలేదు. అయితే ప్రయత్నంవల్ల మానవుడు సాధించలేనిది వుండదన్న విశ్వాసం నా కున్నది. ప్రాసచిత్ర మనగానే శబ్దాలపై 'మోజు' పడ్డానని భావించటం పొరపాటు. భావ ప్రకటనకు అడ్డురానిచోట్ల, తాళగతికోసం అది ఉపాదేయమంటాను. శబ్దాధికారంకల కవిని అనుశాసించటం నా అభిప్రాయం కాదు. అట్లని అధికార దుర్వినియోగాన్ని నేను హర్షించలేను. భావప్రకటనకు పరుష వాక్యాలు, నిందాస్తుతులు ప్రధానం కానక్కరలేదని నేను అభిప్రాయపడుతున్నాను. కాని ఆవేశం దొడ్డది, చెడ్డదికూడా. ఆవేశంలేని కవిత్వం జీవంలేని శరీరమే అయినా, ఆ హద్దులేని ఆవేశం చెడ్డదికాకపోదు. నవ్యాదర్శాలను బోధించగల కల్పనలను, కథా సూత్రాలను స్వీకరించి, వచన పద్యాలలో ఉత్తమ కావ్యాలు రాగలవని, ఈ ప్రక్రియకు ఉజ్వల భవిష్యత్తు ఉండ గలదనీ ఆశిస్తాను. అభ్యుదయ రచయితలు నా యీ సూచనలను సాదరదృష్టితో పరిశీలించ గలరని ఆకాంక్షిస్తున్నాను.

# మా ఊరు

ఏల్చూరి సుబ్రహ్మణ్యం

చరిత్ర కంట్లో
నల్లటి నలుసు
మా ఊరు !

హింసా హింసల
మధ్యన నలిగిన
మా నాలుగిండ్లు !

నలుగురు రాజులు
నడిచిన పుంతలు
నాలుగు లక్షల
ప్రాణుల రక్తంతో

వ్రాయించిన
శాసనాలే;
నాల్క లేని
బండలలాగు
నిలుచున్నై
ఊరవతల
దయ్యాలై, గోరీలై
దడిపించుచు పిల్లల......!

కుబేరుడే పెట్టిన
ఈ గడ్డన
నాగుజెముడు
పుష్పించెను !

కొండమీది పులులు
గుహదాటిరావు !
ఊరి రైతులు, కోర్టు
గడి దాటి రారు !

పానకాల నరసింహుని
గుక్కకు చాలని
ఊరి చెరువు !
మా పాలిటి 'ప్రాజెక్టే'
వరమైనా,
మహజర్ కాగితాలు
మోసి మోసి
కాయలు కాచిన
మా కరణం చేతులు;
కరువుకన్న కొయ్యబారి
గోపరాజు లేడని చెప్పెను !

ఊరి బావిలో
పాతాళం నా కొద్దని
తెక్కలు కట్టండని
ఘోషించే తాబేటికి,
వంతపాట పాడి పాడి
ఎండినై మా కుతుకలు !

చుక్కల లోకం చూస్తున్నా
ఇప్పుడు మా చేలల్లో
గడ్డి లేదు !

నాల్క లేని మా గుడిగంటలు
మ్రోగును
దేవీ నవరాత్రుల !

సిరుల చినికిన
శిఖర దీపం
పదోనాడు నూనె లేక
తీసింది కునుకు !

ఊరి బళ్ళో జార్జి రాజు
లైబ్రరీలో గాంధీ — !
ఊరిబైట రోడ్డుముందు
మైలురాయి మా భవిష్యత్తు !

చింతతోపులో
వచ్చే రాజ్యాంగాన్నే
రాకాసి వ్యాఖ్యానించే మూలుగు
రాకాసి నోరుకట్టు
భూతవైద్యుని మంత్రంలా
హోరని వీచే గాడ్పులు !

మతి చెడ్డ పెద్ద శెట్టికి
మళ్ళీ పెళ్ళిచేసినా
రూపాయలు పట్టీలు వేసినా
నిమ్మరసం తలంటినా...
తిరగలేదు
వియుగుడు దత్తస్వీకారమ్మని,
వ్రాస్తున్నారు వీలునామా
ప్రైవేటుదార్లు !

సాయంత్రం పరుగెత్తే
సూర్యుణ్ణే వెక్కిరిస్తూ
కాపుపిల్ల కొడవలి !

పొరుగింట్లో వేగుచుక్క
పొడిచిందాకా
పేకాడి తిరిగివచ్చు శాస్త్రిగారు

ఉదయపు గోదానానికి
ఆతురతతో దిద్దిన
విభూతి రేఖలలాగా
తెలతెల మను తూర్పు...
కిలకిల కాకులు !

చరిత్ర కంట్లో
నల్లటి నలుసు
మా ఊరు !!

---

" ఈ నిర్లిప్తత కేవలం తాత్కాలికం మాత్రమే. పురోగమన శీలమైనది కాలం. పశ్చాద్దృక్కుల ప్రగల్భ ఘోషలకు లక్ష్యపెట్టక మహోదయం దిక్కుగా క్రాంతిరథం కదలిపోతుంది."

శ్రీ శ్రీ

# పట్టుదల

## కమతం నారాయణరెడ్డి

### పాత్రలు

| | | |
|---|---|---|
| రామనర్సయ్య, | రైతు | 50 సం॥ |
| చంద్రయ్య, | వ్యవసాయకూలి | 40 సం॥ |
| అబ్దుల్ ఖాదర్, | ,, | 35 సం॥ |
| సీతారామయ్య, | రైతు | 40 సం॥ |
| పిచ్చయ్య, | ,, | 55 సం॥ |
| ముత్తయ్య, | కూలి | 45 సం॥ |

(స్థలము: రామనర్సయ్య యిల్లు. వసారాలో మూలకు తాళ్ళు చిందరవందరగా పడవేసి వుంటాయి. రామనర్సయ్య లోపల నుంచి వసారాలోకివచ్చి తాళ్ళవైపు చూస్తాడు.)

రా : యెన్నిసార్లచెప్పినా వీళ్ళకు బుద్ధిరాదు. తాళ్ళు బాగాచుట్టి యే అరకవి ఆ అరకకు కట్టి పెట్టండిరా అంటే వినిపిస్తేనా. "పడుచులకాపురం చిలుగుల మంట"అని అన్నీ దుడుకులపనులు. (ఒక్కొక్కటే తీసి చుట్టుతూ) ఓపికలేక యెక్కడివక్కడ పడేస్తే, మళ్ళీ పనిపడ్డపుడు యెట్లా దొరుకతాయి. ఒకసారి చెబితే... (ఆమాట పూర్తికాకముందే బయటినుంచి చంద్రయ్య,ఖాదరు వస్తారు. వారువచ్చే చప్పుడు విని)

రా : (వారికేసి చూచి) ఏమోయ్ చంద్రయ్యా కాలువ తవ్వడం యెంతవరకయింది?

చం : తెల్లికాలువ మొంగి దగ్గర మొదలుపెట్టి జోడు గుంట్లమట్టుకు తీసుకొచ్చినం.

రా : చూడు; ఆ బలుసు గుదుమద్దగ్గర కొంచెం యిరుగ్గావుంది. కాస్త వెడల్పు తవ్వాలా?

ఖా : క క క క కాస్తకాకపోతే బాగానే తవ్వినం. తూమున నీళ్ళుపెట్టితే గొర్రెను కోసినట్లు పూర కొద్దూ!

రా : మరా ఆ వున్నదికాస్తకూడా తొందరగా తోడి పారెయ్యండి. ఇప్పటికే పొలం తడి ఆరిపోయింది. దిక్కుమాలిన వానలు కురవకపోతే లేదనే యేడుపు, కురిస్తే యీ యేడుపు.

చం : కొంచెమాగి అన్నంతినిపోతే యిద్యాళ పొద్దు కూకకముందే అయిపోద్ది. మాపటికి నీళ్ళ వదుపు కోవచ్చు.

రా : అయితే తొందరగాపోయి ఆ కాస్తపని చెయ్యక రాయబార మొచ్చారెందుకూ?

ఖా : యెరె యెందుకొచ్చినమంటే బువ్వాకు గింజలు లేవు.

చం : యెవళ్ళకూ యింటికి లేవు. ఇయ్యాల తూమెడు వడ్లియ్యండి లెక్కచేసి తక్కినవి రేపిద్దురుగాని.

రా : (మూతి విరుస్తూ) గింజలు గింజలు, నిన్న కాస్త పని చెప్పినమోశేదో యివాళే అప్పుడే గింజలకు తయారు. మొత్తం తీసిన తరువాత లెక్కచేసి వక్కసారే యివ్వలేకపోయ్యామా. యీ లోపల యిల్లు నెత్తినేసుకొని వెళ్ళిపోతామనుకున్నారా ?

చం : పగటికి వుంటే మాపటికి వుండని యీ రోజుల్లో యెట్లనో పూట గడుపుకుంటుంటే రేపటిదాకా యెవరు ఆగుతారు. పనిఅంతా అయ్యేదాకా ఆగటానికి యెవరింట్లో గింజాలుండి సచ్చినయి.

రా : (తాళ్ళు ముడేస్తూ ముఖం ముడుచుకొని) యిచ్చే యిష్టం గింజాలు యివాళకొన్ని, రేపుకొన్ని పదహారుసార్లు కొలవాలి. మాటిమాటికి గుమ్మిలోకి యెక్కడం, దిగడం యిదోపని.

ఖా : మమమమా యింట్లల్లో కూడా మీ యింట్లో వున్నట్టు గింజలుంటే మాటిమాటికి గాక వక్కసారే కొలుసుకునేవాళ్ళం. కాని యెవరియింట్లో చూసినా యీ పూటకు గిద్దెడు గింజలు లేవు. ఏంతిని పని చేస్తాం ?

రామ: యీ పూటమటుకు పట్టుకుందురూ. మాపటి పూట లెక్కచేసి మొత్తం వకసారే యిస్తాను.

చం : అసలు యీపూట పొయ్యిరాజే వుపాయమే లేకుంటే, మాపటిపూటదాకా ఆగమంటా రెందుకూ.

యిగా లేనిడి రోజుల్లో శకనాటివి మరొక నాటికి మళ్ళబడి వుంటున్నాయిగా!

రా: యెల్లాగో యిస్తాంకాని, కట్టలు తెచ్చుకోపోండి. ('నర్సింహో...నర్సింహో' అని లోపలి మనిషిని కేకలేస్తాడు) (లోపలినుంచి 'బర్రెను పాలు పిండుతున్నా' నని వినపడుతుంది)

రా: నేను చేసుకుపోతున్నా గాని, తరువాత వల్లమేకల చంద్రయ్యకు తూర్పు అర్రల చిన్నగుమ్మిలో నుంచి తూమెడు పాలసన్నవడ్లు కొలువు.

('సరేశేరి' అని జవాబు వినపడుతుంది.)

చం: సెంబరు మాన్కాతో యిమ్మని చెప్పండి.

రా: మామాన్కా లేకనా, సెంబరు మానకతో యివ్వడం?

ఖా: మిమిమి మీమాన్కా సెంబరుకు తక్కువుందట. సెంబరు మాన్కాతోనే కొలుసుకుంటాం.

రా: ముప్పైటరవైరోజులు పదిమంది శీతగాండ్లకు శీతాలు కొలిసే మాన్కా సెంబరుకు తక్కువుందా! యెవడైనా అన్నాడా, యివాళ నీవేఅంటున్నావా.

ఖా: నెనెనెనే నొక్కట్లే అనటంయేంటి. వూరంతా అంటుంటే. మీ మాన్కా సెంబరుకు అరగిద్దెడు తక్కువుందట.

రా: (కళ్ళు యింత చేసుకోని) ఆరుగాలం కష్టం శేసే మా శీరిగాళ్ళంతా కిక్కురుమనకుండా పుట్లకొద్ది గాను కొలుసుకపోతుంటే, నీ యిద్దుంగింజల కోసం మాన్కా చిన్నదీ పెద్దదీ అని తగవులాడ వచ్చినావురా?

చం: మీ శీరిగాండ్లుకూడా తక్కువే వుందని గోల పెడుతున్నారు. యిగనుంచి యెవడైనా దానితో గింజలు కొలుసుకోడు చూడండి.

రా: కొలుసుకోక కొట్టుక చస్తారా! పూట తరువాత పూట మాడితే వాళ్లు గాకుంటే వాళ్ళ శేజెమ్మ కొలుసుకుంటుంది. కడుపులో మండితే గుజ్జం వరి గడ్డి మేసిందట.

చం: చచ్చేది బతికేది అసలు యికనుంచి యెవడైనా పిచ్చిమాన్కాలతో గింజలు తీసుకోడు.

రా: గరుజాపట్టినప్పుడు యెవడి యేడుపు వాడేడుస్తాడు కాని, ఆ కాస్త కాలువ తోడి రాండి.

ఖా: అ అ అ అందుకే గింజ లియ్యండి. అన్నం తిని తోడిపారేస్తాం.

రా: యిస్తానంటే మీరే అక్కర్లేనిమాటలు మాట్లాడుతున్నారు కదూ. కొలుసుకపోండి.

చం. కొలుసుకుంటాం కాని, ఆ సెంబరు మాన్కాతో యిమ్మని చెప్పండి.

రా: (వెటకారంగా) సెంబరు, సెంబరు! యేంటా సెంబరు. ఏదో యింట్లోవున్న మాన్కాతో తీసుకపోక, నీకోసం యివాళ కొత్తమాన్కా తెప్పిస్తా పాపం!!

చం: మాకోసమే కాదు. మంది అందరికోసం తెప్పించాలె.

రా: మంది సంగతేదో మంది యేడుస్తారుగాని, నీ మాట చెప్పరాదూ.

చం: చెప్తానే వుంటిగదా. సెంబరు మాన్కాతో తూమెడు వడ్లు కొలిపించండి. అన్నం తినిపోయి ఆ కాస్త కాలువ తోడిపారేస్తాం.

రా: మా మాన్కాతో తీసుకోవన్నమాట! యివాళ నీకు సెంబరు మాన్కాతో కొలిసినట్లే వుంటదా? రేపు అందరు అమాటే అంటే!

చం: అందరూ అడగాలనుకున్నారు. కాబట్టే మేం కూడా అడుగుతున్నాం.

రా: మా మాన్కాతోనైతే తీసుకళ్లు.

ఖా: మిమిమి మీ మాన్కాతో మా కొద్దంటుంటే మళ్ళీ అట్లానే అంటరేం.

రా: వద్దయితే మాట్లాడక పోండి.

చం: పోతాం. పోక యిక్కడుంటే పూటెట్లా గడుద్ది.

రా: నీవు కాకపోతే యింకోడితో తోడిస్తా. మెతుకులు చల్లితే కాకులు కొదువా అంట.

చం: మేం సగం చేసినంక యింకో డెవడు చేస్తాడు?

రా: చేయకపోతే నీవేమి గుత్త కొన్నవా?

చం: అవును. 'సగం' పని వకడు చేస్తే, తక్కిన సగం యింకొకడు చేస్తాడా.

రా: నీ పనివరకు నీకు లెక్క చేసిస్తా. మిగిలినపనికి వాళ్లకిస్తా.

చం: తక్కినపని మేం చేయమంటేనా మంది కివ్వటం. ఎవరొస్తారో రమ్మనండి చూద్దాం.

రా: (కొంచెం కోపంగా) అయితే నీవు చేయవూ. యింకొకణ్ణి చెయ్యనియ్యవూ. ఆ కాలువ అట్లానే

వుండే పొలం యెండి పాడైపోతే యెవడిచ్చు కుంటాడు ?

ఖా. పాపాపా పొలమెందు కెండిపోవాలె. గింజలిస్తే యిప్పుడే పోయి తోడేస్తాం.

రా: గింజలు గింజలని అదే పదం. కొలుసుకపోండి. నేనుమాత్రం నెంబరు మాన్కాతో యివ్వను.

ఖా: రరర రావయ్యా చంద్రయ్య. యివాళ కాకపోతే రేపు నెంబరు మాన్కాలు వచ్చినవాడే కొలుసుకుందాంరా! మన గింజ లెక్కడికిపోతాయి.

చం: పోదాం పద. యీ పూట రేగుకోక్లయినా తప్పుకోద్దాం. (యిద్దరు వెనకకు మళ్ళుతారు.)

రా. పోతేపొయ్యారు. గాని కాలువసంగతేమన్నట్లు?

చం: (వెనకకు మళ్ళి) మరొకళ్ళను పిలిచి తోడించుకుంటామన్నారుగదా. తోడించుకోండి.

రా: నీవు చేయవు. యింకొకనితో చేయించుకోనీయవు. యేంటి యీ గుండగొయ్య వేషాలు. యీ మాట యెవరితోనైనా చెప్పి మెప్పిస్తావూ!

చం: యెకరితోనైనా మెప్పిస్తారాండి. ఒక రెందుకూ. సంఘంపెద్ద సీతారామయ్యగారి దగ్గరికి పోదాం రాండి.

రా: (ఎగతాళిగా) యేమి సంఘమో రంగం. అన్నీ కొంటె వేషాలు. కొత్తవిచిత్రాలు. ఆయనొక్కడే దొరికాడు.

చం: ఆయనొక్కడే కాకుంటే యింకో నలుగుర్ని పిలువండి. యెంతమందినైనా మెప్పిస్తాం.

రా: సరే. ఆయనతోనే చెబుదాం పదండి. నేను పిచ్చయ్యను పిలుచుకొనివస్తాను. కాని, మీరు ఆ సీతారామయ్య వున్నాడేమో చూడండి.

ఖా: అ అ అట్లానే రాండి. మేము సీతారామయ్య గార్ని పిలుచుకొస్తాం.

[తెర

## రెండో రంగం

(పిచ్చయ్య యిల్లు: వరండాలో పిచ్చయ్య పొగచుట్ట తాగుతూ కూర్చుంటాడు. బయటినుంచి గబగబా రామనర్సయ్య వస్తాడు.)

పి: రామనర్సయ్యా, రా; కూచో. (వొకచుట్ట తీసి యిస్తూ) యీ చుట్ట కాల్చిచూడు. మాదాపురం నుంచి మా చిన్నల్లుడు కొత్త పొగాకు పంపిండు. వారితోటగొట్లో పండిందట.

రా: (పిచ్చయ్య పక్కనే కూర్చొని చుట్టఅందుకొని దగ్గరనేవున్న గంపెలోని నిప్పుతో చుట్ట కాల్చి తిప్పి కాలినవైపు పొగ ఊదుతూ) కొత్త సుమారుగానేవుంది.

పి: యేమో పనిగలిగి వస్తివి.

రా: పనేముందిగాని, కూలోళ్ళు మన మాన్కాలతో గింజలు తీసుకోరట. నెంబరు మాన్కాలతో కొలవాలట.

పి: (యెడమచేత్తో చుట్టతీసి) యెట్లెట్లా ?

రా: మా జాలువావిపొలం కాలువ మేటువేస్తే మట్టి తోడమని గుత్తాకిచ్చాను. ఇవాళ గింజలు తీసుకోడానికివచ్చి నెంబరు మాన్కాలతో కావాలని వాదించారు.

పి: మరి నువ్వేమన్నవు?

రా: యివ్వనంటే యివ్వనని గట్టిగా నేచెప్పాను.

పి: తుద కేమన్నట్లు?

రా: సంఘంపెద్ద సీతారామయ్యలేడు, ఆయనదగ్గర మాట్లాడుదాం రమ్మన్నారు.

పి: మీరుకాకుంటే మరొకళ్ళతో చేయిస్తానని చెప్పక పోయినవు.

రా: ఆ మాటకూడా గట్టిగా నేచెప్పాను. ఎవడొస్తాడో రమ్మనండి చూస్తామంటారు.

పి: అయితే వాళ్ళందరిదీ ఒక కట్టన్నమాట. అయినా వాళ్ళను అనవలసినపనేముంది? యెద్దూ యవసాయం వున్న మన రైతులే వాళ్ళకు తిక్క తెలిపితే వాళ్ళు కొండెక్కి కూర్చోరుమరి.

రా: వకవేళ వాళ్ళు నెంబరు మాన్కాల సంగతి అడిగారే అనుకో. పూర్వంనుంచి జరిగినట్లు జరగనియ్యమని చెప్పక వాళ్ళడిగిన దానికల్లా గంగెద్దులాగా తలాడించడానికి యీ సీతారామయ్య కైనా కాస్త ఆలోచన వుండొద్దూ.

పి: యిదంతా ఆయనిచ్చిన అలుసుకాని, రైతయి వుండివాళ్ళకు తోడు మాట్లాడ్డమేంది. మరి ఆయన దగ్గరకు రమ్మంటే నువ్వేమన్నవు ?

రా: సరే అట్లాగే నిన్నుకూడా పిలుచుకొని వస్తానని చెప్పివచ్చాను. యీపాటికి వాళ్ళు రచ్చబండల దగ్గరకుచేరి వుంటారు. మనంవెళ్ళి గట్టిగానే మాట్లాడుదాం.

పి: మాట్లాడక వదలిపెడతామా ? యివాళ మెత్తబడి వప్పుకుంటే రేపు యింకొకటి, యెల్లుండిమరొకటి.

యిట్లా వాళ్ళు యిష్టంవచ్చినట్లు మనను ఆడించరూ. అయినా సీతారామయ్యకు యిదేం దుర్బుద్ధి అంట!

రా: ఆయన్ని సంఘానికి పెద్దను చేశారుగదూ. అందుకే అన్నూ మిన్నూ కానకుండా పోతున్నాడు.

పి: యిదా ఆయన పెత్తనం. యెట్లాగూ తనను పెద్దను చేసిరని వాళ్ళకు కొంటె సలహాలు చెప్పితే రేపు పెత్తన కూర్చోరూ. ముందు మన వ్యవసాయాలు యెట్లా సాగుతయ్.

రా: అందుకే మొదటనే గట్టిగా మాట్లాడితే రెండో సారి యిట్లాంటి కొంటెవేషాలు తలపెట్టకుంటూ వుంటారు. వెళదాం పద.

పి: సరే పద.

(వెళ్తారు) [ తెర

# మూడో రంగం

(స్థలము: విశాలమైన బజారు. చెట్లనీడ. సీతారామయ్య, చంద్రయ్య, ఖాదరు ముగ్గురూ వరుసగా కూర్చొని యుంటారు. ఒక వైపునుంచి రామవర్సయ్య, పిచ్చయ్య వస్తారు. ఇద్దరువచ్చి సీతారామయ్య కెదురుగా కూర్చుంటారు.)

రా: సీతారామయ్యా, యీ మాన్కల సంగతి వూళ్లో అందరికీనా, నా ఒక్కడి నెత్తినే పేలు పడ్డయ్యా!

సీ: ఒకళ్ళెందుకూ, అందరూ సవరించవలసిందే.

పి: (తాపీగా) యేంటయ్యా సవరించేది. యిన్నాళ్ళు నుంచీ మనం కొలుస్తున్నయన్నీ మానికలు కావంటావా?

చం: అన్నీ మాన్కలేకాని సరైన కొత్తకు తక్కువున్నయని, యికనుంచి సక్రమైన మాన్కలతో యివ్వాలని యిప్పుడొచ్చిన తగువు.

పి: యిన్నాళ్ళనుంచీ తీసుకోటంలేదా. యిప్పుడు కొత్తగా యిస్తున్నట్లు మాట్లాడుతావేం.

చం: యిన్నాళ్ళట్టి తక్కువిస్తున్నారు. యికనైనా సరిగ్గా యివ్వాలని.

రా: ఒహోస్. అది నిన్నా మొన్న చేయించిన మాన్కకాదు; వెనకటి మా తాత గంగదేవికుంట కట్టపోయించినప్పుడు చేయించింది. అంటే తొంభై యేండ్లకింద చేయించినమాన్క యివాళ పనికి రాదన్నమాట.

పి: మీ దొక్కటేనా! మాది మాత్తరం, తలి పూర్వం మా పెద్దలు యెంకటేశ్వర్లబావి తవ్వించిన్నాడు చేయించింది. పూర్వం మనూళ్ళె మీది, మాది, కొసులూరి గోపయ్యది యీ మూడే మానికలు, యివాళ యింటికో మానికయింది గాని.

ఖా: అ అ అవును తొంభయ్యేండ్లనుంచి మా సెడు కొలిస్తే అరగిద్దెడు సంపాయిస్తున్నారన్నమాట. యింకెంత కాలమని మానెత్తి కొడతారయ్యా!

రా: మీ కిచ్చే వాటిలో సంపాయించి మేము బంగళాలు, భవంతులు కడుతున్నామన్నమాట! మా అదృష్టమేకొ బాగుండి పంట పండాలె కాని, మాన్కలో మిగిలి వస్తున్నాయి.

చం: మీరు బంగళాలు కట్టినా కట్టకపోయినా మా కిచ్చే గింజలైతే తక్కువిస్తున్నారు గదా?

ఖా: మొ మొ మొ మొన్న మిట్టగూడెంనుంచే వంకాయలు అమ్మొస్తే సవ్వాసేరు రాయి సరైందో కాదోనని కోమటింటికాడ సెంబరుబాటు తెచ్చి జోక్కున్నారే. మాకుమాత్రం సెంబరుమాన్కతో యెందుకియ్యగూడదు?

చం: అదొక్కటేనా. ఆమొన్న అలపర్తినుంచి బట్టలమ్మవస్తే అర్ధగజంపుల్ల మంచిదేనా అని ఒకరు, నా మూరతో కొలిసిస్తవా అని వకరు, తలకో తీరుగా మాట్లాడి సరైనకొలత కొలుసుకున్నారు గదా. కూలిగింజలు మాత్రం సరైన మాన్కతో యెందుకివ్వగూడదూ.

పి: అయితే దేశమంతటా యిట్లాటి మానికలేవున్నయంటావా, మన వూళ్లోనేనా?

చం: మనూళ్లోగాని, మరో వూళ్లోగాని యికనుంచి జీతాలు, కూళ్ళు అన్నీ సెంబరు మాన్కతోనే యియ్యాలి.

రా: (చురచురచూస్తూ) అది కాదు. మేమిచ్చేది కచ్చితంగా మా మాన్కతోనే. యిష్టమైన వాళ్ళు పనిచేసి తీసుకోండి. కష్టమైనవాళ్ళూరుకోండి. మిమ్మల్ని బతిమాలుతామా!

చం. బతిమాలటమెందుకూ. సరైన మానికలో యిస్తేనే యెవరైనా కూలిచేసేది. తక్కువమాన్కతో తీసుకునేవాడెవడో రమ్మనండి రేపటినుంచి.

రా: (తీవ్రంగా) నాకే మునిగిపోయిందేమిటి? ఉపవాస మున్నవాడు ధర చెడగొట్టిండని. కడుపుకాలితే యెవడెందుకు రాడూ.

సీ : అదికాదు సంగతి. కడుపుకాలినవాా డెవడో వొడు కొలుసుకోంగానే వ్యవహారం పరిష్కారం కాదు. జనమందరికీ సమ్మతమయ్యేవిధం చూడాలి.

ఖా : యి యి యిన్నాళ్ళనుంచీ సగం ఆకలితో వుంటున్నాం. కొన్నాళ్ళు పస్తయినా వుండి సెంబరు మాన్కాలు సాధిస్తాం- మాన్కాలు సరిగానిదే యెవడైనా కూలికొస్తాడేమో పిలవండి.

రా : రాకుంటే మా వ్యవసాయాలు మూలబడతాయనా నీవనేది. యీ వూరు కాకుంటే పొరుగూరినుంచి పిలిపిస్తాం.

చం : యేవూరినుంచి పిలిచినా యీ మాన్కాల తగాదా యింతటితో పోయేదిగాదు. తప్పకుంట మీరు సెంబరు మాన్కాలతో యియ్యాలిసిందే.

(నెత్తిన కట్టెలమోపు, భుజాన గొడ్డలి, నోటిలో పండోంపుల్లతో ఆ దారినేవస్తున్న చీకటి ముత్తయ్య అట్లాగే నిలచి)

ము : మాన్కాలసంగతా మాట్లాడేది. అబ్బబ్బ! మరీ అన్యాయం. పొద్దస్తమానం లెక్కలుపోంగా కట్టెలు కొట్టుకొచ్చిఅమ్మితే మూడుపావులాలు, రూపాయి. అవి తీసుకొని బీసుపుల్లమ్మింటికి గింజలకుపోతే ఆమెరూపాయికి అడ్డెడు లెక్కన వత్తిస్తది. ఆమాన్క నాశనంగాను. అడ్డెడువడ్లు తెచ్చిమానోలతో కొలిస్తే అరసోలెడు తక్కువైతది. మరీ మా పేదోళ్ళ నెత్తికొట్టి యెన్ని గుమ్ములు పెడతరయ్యా!

సీ : అందుకే మంచిమాన్కాలు కావాలని మాట్లాడుతున్నాం.

ము : కాకుంటే యింకెన్నాళ్ళు దోసుకుంటరుండీ.

రా : యీయనపాటి ధనవంతుడులేడని నిన్నే కోచుకుంటున్నాం. సువ్వెఅంటే రోకటిపోటున్నట్లు అంతా వంటికాలుమీద లేస్తారే.

పి : అయితే యిప్పుడేమి చేద్దామంటున్నవూ.

చం : మనూళ్ళోవున్న మాన్కాలన్నీటిని సర్కారు సెంబరు మాన్కాతోపాటు సరిచేయించి, యిప్పటి నుంచి వాటితోనే గింజలియ్యాలె.

పి : లేకపోతే.

చం : లేకపోతే పనులుచేయము. పిచ్చి మాన్కాలతో గింజలు కొలుసుకోము.

సీ : తూనికలు, కొలతలు సరిగ్గావుండాలని సర్కారు నిర్ణయం. అట్లా లేనితూకపు యెవరి యిష్టానుసారంవారు తక్కువకొలతలువాడితే ఆ తక్కువ యెంతవరకైనే నిలకడ యేముంది? అందుచేత క్రమమైన కొలతలు, తూకపురాళ్ళు వాడాలి.

రా : కాని అమ్మే కోమట్లకు సెంబరుబాట్లు మాన్కాలు గాని యవసాయదార్లకు మన కెందుకూ. యిన్నాళ్ళనుంచిమమాన్కాలతో చేయిస్తున్నాంగదూ!

సీ : కాని అమ్మేవారికేకాదు, ఇచ్చిపుచ్చుకొనే ప్రతి వ్యవహారం ఒక క్రమపద్ధతిని జరగాలి. రూపాయికి పదహారణాలంటే అందరికీకాని, కొందరికి పదిహేను అణాల ముక్కాని వుండదుకదా?

చం : అంతదూర మెందుకూ, రేపు యీ కాలువ సంగతే చూడండి. నేను తక్కువ గజం బద్దతెస్తే కొలతవేసుకుంటారా?

పి : అయితే కాలువ గింజలవరకు సెంబరు మానికతో యిస్తే సరేనా?

సీ : ఇచట మాట్లాడుకున్నంతమాత్రాన మన మొక్కళ్ళమే సరిచేయాలనికాదు. గ్రామంలోని మాన్కాలన్నీ చేయాలిసిందే.

రామ : అందరూ చేయడానికి యెవరికి గరుజు.

చం : గరుకేంది. మీ రివాళ యియ్యండి. రే పీపాటికి పిచ్చిమాన్కాలన్నీ సరిచేస్తారో లేదో చూడండి.

పి : తప్పదంటావా!

ఖా : యి యి యింకా యెన్నిసార్లు చెప్పమంటారు.

పి : అయితే రామసర్పయ్యా, సెంబరు మానికతోనే కొలిపించు.

రా : నే నొక్కడినేనా!

పి : ఒక దారియేర్పడితే అందరూ నడవక కొందరికి మరోదారి వుంటదా?

ఖా : అ అ అందరు సక్రమంగానే యిస్తారుగాని, లేకుంటే పొద్దెక్కుతుంది.

రా : తట్టలు తెచ్చుకోపోండి,

[చంద్రయ్య, ఖాదరు లేస్తారు.]

[తెర]

# మహాకవిత

'గంగినేని'

కవితా,
ఓ కవితా,
నా చల్లని తల్లీ !
నా జీవిత తపస్సూ !
నా పూర్వ పుణ్యఫలం–
నాకు శాంతి ప్రసాదించు !!

కవితా, ఓ కవితా,
గంగానది సహోదరీ
విశ్వామిత్ర హస్తమా
విరామం ప్రదానం చేయి !

రా తల్లీ, నా కన్న తల్లీ
కాలికింద నేల వుప్పెన తోలుస్తోంది
కాళరాత్రి నీడ కుట్ర పన్నుతోంది
కష్టం కాష్టమై అనుదినం దహిస్తోంది
కన్నీరు వైతరిణై నిత్యం హింసిస్తోంది
ఎన్నాళ్ళో ఇహ బ్రతుకు బండ ఈడ్వలేను
ఇన్నాళ్ళూ నా మార్గం వెలిగించిన తల్లీ
ఈ మధ్య మన మధ్య విస్తరించిన
అగడ్తలు, అగాధాలు, అరణ్యాలు
గడిచి గ్రక్కున కరుణించి కటాక్షించు !

వూపిరి తీసుకోను భయంగా వుంది
వున్న గాలి సమస్తం దగామయంగా వుంది
ఘనీభవించిన వాతావరణం నిండా
భరించరాని దౌష్ట్యం జడలు విప్పింది
సహించరాని పరిసరాలు ఏకంగా
చుట్టూతా దావాగ్ని ముట్టించాయి
ఆశ్రయ మిచ్చిన అర్థరాత్రి కడుపు చించుకొని
అమావాస్య సమక్షంలో నీ కాళ్లు పట్టుకొని

ప్రార్థిస్తున్నా – నను గట్టెక్కించు
కవితా దేవతా !
నైరాశ్యం నిండిన నరాలు
నిస్పృహా పొంగెత్తిన రక్తనాళాలు
శూన్యం దండిగా పేరిన మస్తిష్కం
శోకధూళికింద పడిపోయిన మేను
శాంతికోసం వేనోళ్ళ ఘోషిస్తున్నయి!
ప్రశాంత దేవతా విశ్రాంతి ప్రసాదించు !

బ్రతుకు బాటమీద దారి కాచి
నా సర్వస్వం దోచిం దీ సమాజం !
నా జీవన సంగీతం దొంగిలించింది !
నా స్వచ్ఛంద మనస్సు కిల్బిషం చేసింది !
నా గుండెలో దాచుకున్న దీపం మింగిలింది !
అనంతకాలం అల్లుకున్న ఆశాలత
కాలరాసింది !
అక్కడే మోసం నన్నావేశించింది !
అప్పుడే కుట్ర నన్నాదేశించింది ! !

సరిగా పాతికేళ్లు నిండీ నిండలేదు
అప్పుడే తలెన్ని బొప్పెలు కట్టింది
తవిడిచూస్తే వళ్ళంతా ఎన్ని అనుభవాలగాట్లు
వెనక చూస్తే తునిగిన స్వప్నాలు కొల్లలు
ఎన్ని ఘోరాలు నా కళ్ళముందు జరిగాయి
ఎన్ని మోసాలు అతి నగ్నంగా చూశాను
ఎన్నెన్ని సుడిగుండాలు తిన్నగా దాటాను
ఎంత దుర్మార్గం కూడై, గుడ్డై కూర్చుంది
ఎంత సున్నితమనస్సు ఇగిరి సల్లరాయయింది
ఎంత దారుణం కారణంలేకుండా జరిగింది
ఎంత విషం నవ్వులో పొదగనేర్చాను

ఏం చక్కగా, ఎక్కడా చిక్కకుండా
బ్రతుక నేర్చాను
ఏం చక్కగా తడిగుడ్డకోసం తడుముకోకుండా
ఒకళ్ళ గొంతులు ఒకళ్ళు చల్లగా నులిమితే
చూశాను
ఇది నిజం: మానవుడే మానవుడి పుత్రుడు !

ఇంట్లో కుట్ర, వీధిలో కుట్ర
వంటింట్లో రాజుతున్నది కుట్ర
ఇంటావిడ వంటనిండా కుట్ర
పక్కింటి గోడచాటు పొంచినది కుట్ర
తలుపు కొడుతోన్నది చూడు కుట్ర
వీధి మొగలో ముస్తాబయి నిలుచున్నది కుట్ర
పల్కరించేది కుట్ర, ప్రశ్నించేది కుట్ర
పరామర్శించేది కుట్ర, మైత్రికూడ కుట్ర
ఎదురయిన 'నవ్వు' క్రింద ఎంతో కుట్ర
అబ్బా ! బ్రతుకు నరకం మారుపేరు !

ఎవణ్ణి చూసినా వాడి ముఖం
కాదు కొట్టొచ్చినట్లు కనపడేది
నక్షత్రాలవంటి నేత్రాలు కాదు
ఆకర్షించి క్షణం ఆలోచన పురికొల్పేవి
అక్షయపాత్రవంటి ఫాల భాగం కాదు

వాడి చిత్ర విచిత్ర కలలు పరివ్యక్తం చేసేది
వాడి మెడవిరిగే కాడి, వాడి నెత్తి దించేబరువు
వాడి వెన్ను వంచే దుఃఖసముద్రం
వాడి కాళ్ళ ముందు నోరు తెరచిన దినగండం
వాణ్ణి పెనవేసుకుని అనుక్షణం కాటందే
బ్రతకాలనే, బాగా బ్రతికాలనే కాంక్ష !!
జీవితం తిరగని శాప మయింది
జీవితం తరగని గరళ మయింది
రా తల్లీ, సర్పదష్టుణ్ణి !!
మంత్రించి మానవుణ్ణి చేయి !!!

కవితా, ఓ కవితా, మహాకవితా
నా కెరుకచూపిన మహోదయమా
నా హృదయమా, అవధిలేని ఉదధీ,
నన్ను జాజ్వల్యం చేసే జ్వాలాతోరణమా
నాకు వేయి ప్రళయ రుద్రుల విలయశక్తి
పదివేల ప్రచండ సూర్యుల మహాగ్ని
అక్షరాలా తక్షణం చేతి కందించు !
మరుక్షణం నిమ్నోన్నతాలనిహాంహాతం చేస్తా!
ఓ నా కవితా, నే నెత్తిన పతాకమా !!
ఎప్పుడు తల్లీ, నాకు శాంతి ?
ఎప్పుడు నా కళ్ళకు శాంతి ?
ఎప్పుడు నా వాగ్ఝరి విముక్తి ?

"పాత దురభిప్రాయాల ధూళివిదిలించి, గతమనే మేఘాలనించీ, అనేక సంకీర్ణ సంభ్రమాలనించి, వొంటరిగా, స్వేచ్ఛగా, ఠీవిగా, శిర మెత్తుకొని, బలంగా మానవుడు ముందుకు నడుస్తున్నాడు. మానవులు అసంఖ్యాకులు. వారి మహా ప్రస్థానానికి అంతుఅంటూ లేదు. విశ్రామ మెరుగని మానవుడు సదా ముందుకే మున్ముందుకే, పైపైకే నడుస్తున్నాడు."

— గోర్కీ

# భాషా సమస్య

## డాక్టర్ డి. ఎ. ఎ. ఎస్. నారాయణరావు

ప్రస్తుతం మన దేశాన్ని ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో ఒకటి భాషా సమస్య. దేశము బానిసత్వములో నున్నప్పుడు, ఆంగ్లభాష పరిపాలనకు ఉన్నత విద్యాభ్యాసమునకు ఉపయోగింపబడుతూ వచ్చింది. పరదేశ భాషను ఇలాగ ఇకపైకూడా జాతీయభాషవలె వాడుకోవడము, మన జాతిగౌరవానికి భంగమన్న మాట అటుంచి, ప్రజాస్వామ్య పరిపాలనా సూత్రాలకుకూడ అది విరుద్ధమే. వందలో పదిమందికిగాని అర్థంకాని భాషలో పరిపాలన జరుగుతున్నప్పుడు, సామాన్య ప్రజలు ఆ పరిపాలనలో భాగస్వాములు కాలేరు. 1965వ సంవత్సరమునాటికి ఆంగ్లమును ప్రస్తుత స్థానములోనుండి తప్పించి, కేంద్ర పరిపాలనను హిందీభాష ద్వారా జరపాలని ప్రజాపరిషత్తు నిర్ణయించింది. ఆ సందర్భంలో ప్రాంతీయ, లేక రాష్ట్ర భాషల స్థానమేమిటి, ఉన్నత విద్యను ఏ భాషలో నేర్పాలి మొదలగు సమస్యలు పరిష్కరింపబడాలి. వీని గురించి పరిశీలించి, సలహాల నివ్వడానికిగాను కేంద్రప్రభుత్వం భాషాకమిషనును ఏర్పాటుచేసింది.

మన దేశంలో వివిధ ప్రాంతాలలో చెలామణీలో ఉన్నవి 13 ముఖ్యభాషలు. ఆ భాషలను మాతృభాషలుగామాట్లాడే ప్రజల సంఖ్య 1951వ సంవత్సరపు జనాభా లెక్కలను బట్టి క్రిందివిధంగా ఉంది:

| | |
|---|---|
| హిందీ | 10,87,60,966 |
| ఉర్దూ | 1,35,71,321 |
| హిందూస్థానీ | 81,60,683 |
| పంజాబీ | 8,37,747 |
| అనిర్ణయంగా | 1,86,13,594 |
| పై నాలుగు భాషలూకలిసి | 14,99,44,311 |
| తెలుగు | 3,29,99,916 |
| మరాఠీ | 2,70,49,522 |
| తమిళం | 2,65,46,764 |
| బెంగాలీ | 2,51,21,674 |
| గుజరాతీ | 1,63,10,771 |
| కన్నడం | 1,44,71,764 |
| మళయాళం | 1,33,80,109 |
| ఒరియా | 1,31,53,909 |
| అస్సామీ | 49,88,226 |
| సంస్కృతం | 555 |
| జనాభా | 35,68,79,394 |

పై భాషలలో హిందీ, ఉర్దూ, హిందూస్థానీ, పంజాబీ ఒకదానికొకటి దగ్గర సంబంధము కలిగి ఉన్నాయి. చివరి వరసలోని 1,86,13,594 మంది పంజాబు, పెప్సూ, హిమాచల ప్రదేశ్ నివాసులు. వారిలో చాలమంది మాతృభాష పంజాబీ అయినా, మిగతావారిది నిర్ణయంగా తేలకపోవడం మూలాన, వీరందరి మాతృభాష అనిర్ణయంగా వదలివేయవలసినది. వీరినికూడా కలుపుకుని హిందీ, హిందూస్థానీ, ఉర్దూ, పంజాబీ భాషలు మాట్లాడేవారి మొత్తంసంఖ్య 14,99,44,311 అయింది. భారతదేశం మొత్తంమీద పై నాలుగు భాషలు మాట్లాడేవారి భాగం 42%. జాతీయ భాషలలో హిందీ తరువాత, ఎక్కువ మందికి మాతృభాషగా, తెలుగు రెండవస్థానంలో ఉంది. పై పట్టీలోని జాతీయభాషలలో దేనిక్రిందా జమ చేయబడకుండా మిగిలిన 3,29,11,873 మంది సుమారు 800 డయలెక్టులనో, ఇతర ఆటవిక భాషలనో మాట్లాడుతారు.

తెలుగు, బెంగాలీ, తమిళం మొదలైన భాషలకున్నంత సారస్వతము, సంప్రదాయము హిందీకిలేవు. సుమారు 31% మందికి మాత్రమే మాతృభాష అయిన హిందీని ఏకైక జాతీయభాషగాచేసి, మిగతావారి మీద అన్నివిధాలా రుద్దడం న్యాయమూకాదు. వారు సహించనూ సహించరు. హిందీ మిగతా భాషల స్థానాలను ఏ ప్రాంతీయులకు అన్యాయం జరగకుండా జాగ్రత్తగా నిర్ణయించాలి.

మన మిప్పుడు ఎదుర్కొనుచున్నటువంటి భాషా సమస్యను ఇదివరకు కొన్ని దేశాలు ఎదుర్కొన్నాయి. రష్యాలో రష్యనుభాష ఎక్కువమందికి మాతృభాష. రష్యనులో ఉన్నంత సారస్వతము ఆదేశంలోని మిగతా భాషలలో లేదు. అందులో కొన్ని భాషలకు లిపి అయినా లేదు. కాని దేశం ఐక్యతఅనే పేరుతో రష్యను

భాషను వివిధ ప్రాంతాలవారిపై రుద్దడానికి ప్రయత్నాలు జరగలేదు. కేంద్రపరిపాలన రష్యనులో జరుపబడుచున్నా, ప్రాంతీయ పరిపాలన, అచ్చటి ఉన్నత విద్యలకు ఆ ప్రాంతీయభాషలే ఉపయోగపడుతున్నాయి. లిపిలేని భాషలుకూడా క్రొత్తగా లిపితో వృద్ధిచెందేయి. కెనడాలో ఫ్రెంచి, ఇంగ్లీషు సమాన హోదాలో పరిపాలనకు, ఉన్నతవిద్యకు ఉపయోగింపబడుతున్నాయి. స్విట్జర్లండు దేశంలో జర్మను మాట్లాడేవారు ఎక్కువగను, ఫ్రెంచి, ఆంగ్లము మాట్లాడేవాళ్లు కొంత తక్కువగను ఉన్నారు. అయినా, పరిపాలనకు మూడు భాషలను సమాన హోదాలో ఉపయోగించి, ఉన్నత విద్యను ఆయా ప్రాంతాలలో ఆభాషల్లోన గరపుతున్నారు. ఇలాగే రెండుమూడు భాషలు సమాన హోదాలో ఉన్నాయి కొన్ని చిన్న దేశాల్లో.

మన దేశంలో హిందీకి ఎక్కువ ప్రాధాన్యతనిచ్చి, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ పరిపాలనకు, దేశమంతటా ఉన్నత విద్యకు దానినే ఆధారం చెయ్యడం అసమంజసం, అన్యాయము. అలాగయితే పరప్రభుత్వం ఆంగ్లమునకు ప్రాధాన్యతనిచ్చి, దేశ భాషలకు చేసిన అపచారమే హిందీ మూలంగా కలగగలదు. రాష్ట్ర పరిపాలన హిందీద్వారా జరిగితే, చాల రాష్ట్రాలలో వారికి అది పరభాష కనుక ఆ పరిపాలనలో ప్రజలు తగినపాలు తీసుకోలేరు, అది ప్రజాస్వామ్య సిద్ధాంతాలకి వ్యతిరేకం. వివిధ రాష్ట్రాలమధ్య సంప్రతింపులకు, కేంద్ర పరిపాలనకు హిందీ నుపయోగించినా, రాష్ట్ర పరిపాలన ప్రాంతీయ భాషలోనే జరగాలి. ఆంధ్రా ఎసెంబ్లీ వీలయినంత త్వరలో పరిపాలనకు తెలుగు నుపయోగించాలని ఈ మధ్య నిశ్చయించుకోవడం సంతోషకరమైన విషయం.

విద్యను పరభాషలో గరపినప్పుడు దానిని సుళువుగా జీర్ణం చేసికోలేరు విద్యార్థులు. మన దేశంలో ఉన్నత విద్యాపీఠాల్లో విద్యా ప్రమాణములు ఇతర దేశాలలోకంటె తక్కువగా ఉండడానికిగల కారణాల్లో పరభాష అయిన ఆంగ్లములో విద్యను చేర్పడమన్నది ముఖ్యమైనది. ఇప్పుడాంగ్లమునకు బదులుగా దేశములోని విశ్వవిద్యాలయము లన్నిటిలో హిందీలో విద్యను గరపాలంటే, హిందీపరభాషగాగల ప్రాంతాలలో ఇదివరకటి లోపమలాగే ఉండిపోతుంది. వివిధ ప్రాంతాల ఉన్నత విద్యను విశ్వవిద్యాలయాల్లోకూడా ఆ ప్రాంతీయ భాషల్లోనే గరపాలి. అలాగ జరిగినప్పుడు అధిక సంఖ్యాకులు సుళువుగా ఉన్నతవిద్యను పొందడానికి, విద్యాప్రమాణములను ఎక్కువ చేయడానికి వీలవుతుంది.

విశ్వవిద్యాలయాల్లో ఉన్నత విద్యను ప్రాంతీయ భాషల్లోనే గరపాలని 1948 లో ఏర్పరుపబడ్డ యూనివర్సిటీ కమిషను సలహాఇచ్చింది. హిందీ మాతృభాషగా లేనివారికి విద్యను హిందీలో బోధించడం, ఆంగ్లము నుపయోగించుటవలెనే అస్వాభావికం. అయితే, కేంద్ర పరిపాలన హిందీలోనే జరుగుతుందిగనుక వీలయినంతమంది హిందీ నేర్చుకొని యుండవలెను. అందువలన మాధ్యమిక తరగతులనుండి హిందీని రెండవభాషగా దేశమంతటా అందరూ నేర్చుకోవలెను. హిందీ తప్పనిసరిగా విద్యార్థులంతా చదవవలసినపనిలేదు, దానిని ఇచ్ఛావిషయంగానే వదలివెయ్యాలని కొన్ని ప్రాంతాలవారు అభిప్రాయపడుతున్నారు. కాని హిందీని మాధ్యమిక తరగతులనుండి నిర్బంధముచేయుట అవసరమనిపిస్తుంది. పెక్కుదేశాల్లో విద్యార్థులు తమ స్వంత భాషనుకాక రెండుమూడు భాషలను నిర్బంధంగా నేర్చుకుంటున్నారు. అటువంటి పరిస్థితుల్లో కేంద్ర ప్రభుత్వం పరిపాలన జరుగు భాషను విద్యార్థులంతా రెండవ భాషగా నేర్చుకోవాలని నిర్బంధముండడంలో విపరీతమేమీలేదు. హిందీ ప్రాంతాలవారు ఇతర భారతీయ భాషనేదో ఒక దానిని నేర్చుకొనునట్లు చేయవచ్చును. దానివలన ఆ ప్రాంతాల విద్యను ఇతర ప్రాంతాల విద్యతో సమాన పంక్తిలోకి తెచ్చుటేకాక, ఆ ప్రాంతాలవారు అవసరమైనప్పుడు ఇతర ప్రాంతాలలో ఉద్యోగము చేయుటకు అనుకూల పరిస్థితు లుండును.

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాలకై నడపబడు పరీక్షలు ఏ ఒక భాషావర్గం వారికిగాని పక్షపాతము చూపునవిగా ఉండకూడదు. ఈ పరీక్షలను 1960 నుండి హిందీలో జరుపవలెనా అని ప్రభుత్వం ప్రస్తుతం ఆలోచనలు చేస్తున్నది. కాని, అది హిందీ మాతృభాషగా గలవారికి ఎక్కువ లాభకరముగాను, మిగతా భాషలవారికి నష్టదాయకముగాను ఉంటుంది. ఆ పరీక్షలను గూడ మన దేశంలోని వేరు వేరు ముఖ్య భాషలలోను జరపాలని చాలమంది అభిప్రాయపడుచున్నారు. ఈ మధ్య మద్రాసు విశ్వవిద్యాలయంవారు అదే సూచన చేసేరు.

కేంద్ర పరిపాలన హిందీలో ఉన్నా, ప్రజాసభలో హిందీలోనేగాని ఇతర భాషలలో మాట్లాడకూడదను నిషేధ ముండకూడదు. చాలమంది హిందీలో మాట్లాడినా, కొందరు తమకు మాతృభాషకాని హిందీలో

స్వేచ్ఛగా మాట్లాడలేకపోవచ్చును. అంచేత భారతదేశంలోని ముఖ్యభాషలలో దేనిలోనైనా మాట్లాడడానికి స్వాతంత్ర్య ముండాలి. ఆ ఉపన్యాసాలను హిందీలోకి వెంటనే భాషాంతరీకరించడానికి ఏర్పాట్లు ఉండాలి. ప్రజాసభ సభ్యులు హిందీలో స్వేచ్ఛగా మాట్లాడలేకపోయినా, హిందీ ఉపన్యాసాలను అర్థంచేసికో గలిగి వుండాలి.

విశ్వవిద్యాలయాల్లో ఉన్నత విద్యను ప్రాంతీయ భాషల్లో గరపాలని ఇదివరకు సూచింపబడింది. విజ్ఞాన శాస్త్రేతర విషయాలను అలాగ ప్రాంతీయ భాషల్లో చెప్పడానికి ఇబ్బందులట్టే వుండవు. మన దేశంలోని భాషలు ఎక్కువ సారస్వతమూ, సాంప్రదాయమూ కలిగినవై యుండడంచేత, అర్థిక, రాజకీయశాస్త్రములు, తత్త్వశాస్త్రము మున్నగువాటిని చెప్పడానికి కావలసిన పదజాలము ఈ భాషల్లో వుంది. కాని విజ్ఞానశాస్త్రములను బోధించడానికి ఎన్నో వైజ్ఞానిక శాస్త్రపదాలు కావాలి. ఇలాంటిపదాలు మున్నైలక్షలదాకా ఉన్నాయని అంచనావేయబడింది. వృక్షశాస్త్రంలో పదిలక్షల శాస్త్రీయమైన నామాలున్నాయి. అలాగే రసాయనశాస్త్రంలో కొన్నిలక్షల నామాలున్నాయి. వీటినన్నిటినీ సంస్కృతం సహాయంతో భారతీయ భాషల్లోకి అనువదించాలనుకోవడం ఒక వెర్రిపని. వీటిని భారతీయ భాషల్లోకి యథాతథంగా తెచ్చుకోవడం ఉత్తమం. పాశ్చాత్యదేశాల్లో కూడా ఒక వైజ్ఞానిక పదం ఒక భాషలో ఉద్భవించినపుడు దానినే ఇతర భాషలలోకి తీసికొంటారు. మనము మన భాషల్లో ఇదివరకే ఎక్కువ ఉపయోగంలోవున్న కొన్ని పదాలను తప్పించి, మిగిలినవాటి నన్నిటిని యథాతథంగా తెచ్చుకొని, అభివృద్ధికి దారి తియ్యాలి.

మన దేశంలో ఇంగ్లీషుభాష స్థానమేమిటి, దానిని పూర్తిగా తొలగించాలా, లేక ఏవిధంగా వుంచాలి అని ఆలోచించాలి. ప్రపంచభాషల్లో ఆంగ్లము ప్రముఖ స్థానంలో వుంది. సుమారుగా చైనాభాష 45 కోట్ల మందికి, ఆంగ్లము 25 కోట్లమందికి, రష్యను 13 కోట్లకి, హిందీ 11 కోట్లకి, జర్మను 8 కోట్లకి మాతృభాష అయి ఉన్నాయి. అన్నిటిలోనూ చైనాభాష ఎక్కువమందికి మాతృభాష అయినా అందులో విజ్ఞానశాస్త్ర సారస్వతం చాలా స్వల్పం. తరువాతిదయిన ఆంగ్లములో శాస్త్రీయ సారస్వతము, నూతన నాగరికతకు చెందిన సారస్వతము ఎక్కువగా వున్నాయి. అమెరికా, ఇంగ్లండువంటి దేశాల అభివృద్ధినిబట్టికూడా ఈభాషకు ప్రపంచంలో చాలా ప్రాముఖ్యం వుంది. చారిత్రిక పరిస్థితులవలన ఈ భాషకు భారతదేశంలో ఇదివరకొక ముఖ్యస్థానం వుంది. భారతదేశం శాస్త్రీయంగా వృద్ధిచెందడానికి, ఇతరదేశాల శాస్త్రపరిశోధనల గురించి శాస్త్రజ్ఞులంతా తెలిసికొంటూ ఉండాలి. ప్రపంచ విజ్ఞానమంతా ఆంగ్లములో సులువుగా అందుబాటులో వుంటుంది కనుక, ఆ భాష మనలో చాల మందికి తెలియడ మవసరము. కనుక విద్యాబోధనకు పరిపాలనకు ఆంగ్లము నుపయోగించకపోయినా, ఒక భాషగా విద్యార్థు లందరికీ దానిని బోధ చెయ్యాలి. మాధ్యమిక తరగతులనుండి పట్టభద్రత పొందేవరకు, విద్యార్థులకు హిందీతోపాటు ఆంగ్లమునుకూడా నేర్పాలి. మనదేశ శాస్త్ర పరిశోధకులు తమ పరిశోధనలను ఆంగ్లములో వ్రాసి ఇతరదేశములలో ప్రకటింప గలిగి ఉండాలి. ఉన్నతవిద్యను ప్రాంతీయ భాషల్లో నేర్చుకున్నా, శాస్త్రపరిశోధకులు సాధారణంగా తమ పరిశోధనలను హిందీలోనో, ఆంగ్లములోనో మాత్రమే ప్రకటిస్తూ ఉండాలి. మనదేశంలోని వివిధ భాషల్లో పరిశోధనలను ప్రకటించినట్లయితే, ఇతర దేశాలవారికి వీటిని అర్థంచేసుకోవడం కష్టంగావుండి విస్మరిస్తారు.

భాషా సమస్యను పరిష్కరించడానికి కొందరు చేస్తున్న ఇంకొకసూచన సంస్కృతానికి ప్రాధాన్యత నివ్వడం. సంస్కృతాన్ని జాతీయభాషగాచేసి, విద్యాబోధన దానిలో నేగరపాలని కొందరంటున్నారు. కాని, ఇది చాలా వెర్రిసలహా. మనదేశంలోసంస్కృతం ఉచ్ఛదశలో ఉన్నప్పుడే అది ప్రజాభాష కాలేకపోయింది. ఏ కొద్దిమంది అత్యధిక విద్యావంతులకో తప్పించి, సంబంధము లేనిదిగా నేఉంది. దానిలోనే ఉన్న సంస్కృతి ప్రజలలోకి వ్యాపించలేక పోయింది. ప్రజాసామాన్యము నుండి వేరుగా ఒకవర్గము ఉన్నత స్థానములో కూర్చోడానికే ఆ భాష ఉపయోగపడింది. చారిత్రిక సాంఘిక కారణాలవలన మృతభాష అయిన సంస్కృతాన్ని ఇప్పుడు అందరిమీదా రుద్దుదామనుకోవడం ఒకమనోహర స్వప్నమే. ప్రాచీన ఆర్యుల సంస్కృతిని తెలిసికోడానికి – ఆ సంస్కృతి అంతా ఇప్పుడు ఉపయోగమైనది అయినా, కాకపోయినా – సంస్కృతం అవసరమే. అందులోని ఉత్తమగ్రంథాలు ఇదివరకే చాలవరకు దేశభాషలలోకి అనువదింపబడ్డాయి. మిగతావాటిని కూడ అనువదించవచ్చును. సాంఘిక, భాషాశాస్త్రజ్ఞులు దానిని నేర్చుకోవలసిన అవసరం ఉన్నా, ప్రజాసామాన్యానికి ఆ భాష ఉపయోగకరముకాదు. ఏకైక జాతీయభాషగా చెయ్యక

పోయినా, సంస్కృతాన్ని నిర్బంధంగా అందరికీ బోధ చెయ్యాలని కొందరు ఈ మధ్య అంటున్నారు. ప్రాంతీయభాష, హిందీ, ఆంగ్లము వివిధ శాస్త్ర విషయాలు, విజ్ఞాన సంస్కృతి తెలుసుకో వలసిన అధికభారమును వహించవలసిన విద్యార్థులమీద ఇంకొక ఉపయోగము కాని భాషను నిర్బంధముగా రుద్దడం అనాలోచితం. సంస్కృతము ప్రస్తుతమునకు వలెనే ఇచ్ఛావిషయంగానే ఉండాలికాని, నిర్బంధ భాషగా ఉండకూడదు.

ఆంధ్రదేశములోని విశ్వవిద్యాలయాల్లో ఉన్నత విద్యను తెలుగులో నేర్పుటకుగాను అవసరమైన చర్యలు తీసికొనడం మొదలుపెట్టాలి విశ్వవిద్యాలయాధికారులు. రాష్ట్ర పరిపాలన ఉన్నతవిద్య తెలుగులో జరిగినప్పుడు తెలుగుభాష ఎన్నో నూతన పదాలను తీసుకొంటూ వృద్ధిచెందుతుంది. రాష్ట్ర పరిపాలనకు, ఉన్నత విద్యకు సాధనమయే భాష టైపునకు వీలుగా ఉండాలి. ఈ సందర్భంలో తెలుగు వ్రాతను టైపు కు అనువగునట్లుగా లిపిసంస్కరణ చేయడానికి గల సాధ్యాసాధ్యములను జాగ్రత్తగా పరిశీలించాలి.

స్వాతంత్ర్యములో వచ్చిన అవకాశాలను సద్వినియోగం చేసికొని, మాతృభాషలలో ఉన్నత విద్యను బడయడంతో వచ్చు సుఫలములద్వారా జ్ఞానాన్ని ఎక్కువగా వృద్ధిచేయడానికీ, దేశాన్ని వృద్ధిచెయ్యడానికీ భారతీయులంతా ప్రయత్నించాలి.

---

" వేయి సంవత్సరాల్ వెనకాల కవినోయ్
వేయి సంవత్సరాల్ వెడుతూన కవినోయ్

వేదాల ఋక్కులో పాడాను నేనోయ్
వాల్మీకి గొంతులో ప్రవహించినానోయ్

నన్నయ తిక్కన్న వెన్నెల కవిత్వాన్ని
ఈనాటి పాటలో ఇమిడి పోయానోయ్

దేశాల కవితలో దీపించినానోయ్
ఆశాంతముల వఱకు ఆవరించానోయ్ "

— అడివి బాపిరాజు

# శివధనువు

## రెంటాల గోపాలకృష్ణ

శివధనస్సు ఎత్తబోయి
చిక్కుపడిన రావణుడు!
జీవితాన్ని మార్చబోయి
చెడిపోయిన మానవుడు!

మానవుడా!
శివధనుస్సు నీ జీవితం
సీతలాంటిది నీ ఆశయం
జాగ్రత్తసుమా!
జీవితం బరువైనది
జీవితం బలమైనది
జీవితం చేతికి చిక్కదు
సీత నీకు దక్కదు!

ఎందరో మానవులు
ఈ ధనుస్సుతో తలపడ్డారు
ఎందరో మహామహులు
ఈ తపస్సులో బలిఅయినారు
పరాభవం చెందారు
పరాజయం పొందారు
ఆశలు అందలేదు
ఆకాంక్షలు తీరలేదు
నిప్పులాంటి సీత
నిజంలాంటి సీత
ఎవరినీ వరించలేదు
ఎవరి జన్మ తరించలేదు!
మానవుడా!
జీవితం ఒక చిక్కుముడి
జీవితం ఒక తప్పగడి
ఈ ముడి విప్పలేవు
ఈ గడి తప్పలేవు!
సీత ఒక మహోన్నత శిఖరం
ఈ శిఖరాన్ని చేరలేవు!

మానవుడా!
జీవితం ఒక స్వయంవరం
ఇది నిన్ను వరించదు!
జీవితం సర్పాల సరోవరం
ఈ విషజలంలో ఈదలేవు!
జీవితం ఒక చిత్రశాల
వికృతమై లెక్కించే బొమ్మలతో వేగలేవు!
జీవితం ఒక రక్తమాల
దీన్ని తాకలేవు, ధరించి భరించలేవు!
జీవితం ఎక్కుపెట్టిన విల్లు
క్షణ క్షణం నీ కళ్ళల్లో గుచ్చుతుంది
వాడి అయిన ముల్లు!
జీవితం ఒక చిత్రాంగి
నిన్ను వంచిస్తుంది, చిక్కులు పెడుతుంది!
ఇది క్రిక్కిరిసిన రైలుబండి
చోటు దొరకదు సుమా!
తోసుకుని ఎక్కాలి!
కాదు సుమా పూలపాన్పు!
ఇది గొడ్రాలి తొలి కాన్పు!
కాదు సుమా పూచిన కలువ!
జీవితం ఒక శిలువ!
కాదు సుమా రాజహంస!
జీవితం ఒక చిత్రహింస!

చీకటి ముసిరిన కీకారణ్యం జీవితం
సింహ శరభ శార్దూల మత్తేభ ఖడ్గమృగ
సంయుక్త సంకులం!
గండభేరుండ పక్షుల కలకలం!
ఇక్కడ నీకు తోడు దొరకదు
దోవ దొరకదు, నీడ దొరకదు!
మారు పడిపోతావు!

భయానికి మారుపేరు జీవితం!
స్వార్థానికీ, ద్వేషానికీ
కయ్యానికీ, కల్మషానికీ
ప్రతిబింబం జీవితం!
జీవితం నీ చీకటి నీడ!
ఇది నిన్ను వెంటాడుతుంది
వేధిస్తుంది!
మానవుడా!
ఇది మహాయుద్ధం!
సర్పగండం!
జాగ్రత్త సుమా! ఓటమి తప్పదు!
జీవితంమీద సవాలు చేయకు
జీవితంతో కుస్తీపట్టకు
జీవితాన్ని మార్చలేవు
పాదరసాన్ని
పట్టుకోలేవు జాగ్రత్త!...
మానవుడా!
ఈ ధనుస్సు నీ మేధస్సుకు పరీక్ష
ఈ స్వయంవరం నీ తపస్సుకు పోటీ
నెగ్గలేవు నీవు,
జీవితం దగా,
సీత ఒక మాయ,
సీత నీ భ్రాంతి,
అది ఒక మహాశక్తి!
ఆమెతో సుఖపళ్ళేవు
సమూలంగా దహిస్తుంది!
ఈ విశ్వాలయంలో
జీవితం కాళికాదేవి!
నీ జీవితం నిన్నే బలికోరుతుంది!
నీ జీవితం నిన్నే మోసగిస్తుంది!
జీవితమంటే సంఘం,
సంఘమంటే శత్రువు,
సంఘమంటే వేయి నాలుకల నాగుబాము!
అవిద్యకు, అజ్ఞానానికి మారుపేరు సంఘం!
జీసస్‌ను ఏంచేసింది ఈ సంఘం?
సోక్రటీస్‌ను ఎలాసత్కరించింది ఈసంఘం?
జోన్ ఆఫ్ ఆర్క్? గాంధీ...?
మానవుడా!
నిప్పును కన్నెత్తి చూళ్ళేదు సంఘం!
నిజాన్ని నూటిగా వినలేదు సంఘం!
నిజాన్ని చంపి నిజాన్ని పూజిస్తుంది సంఘం!
న్యాయాన్ని హత్యచేసి న్యాయాన్ని
గౌరవిస్తుంది సంఘం!
దేవుణ్ణి హింసించి
దేవుణ్ణి తలుస్తుంది సంఘం!
మానవుడా!
మనిషి చేసుకున్న మహాపాపం ఇది!
మనిషిఅయిన ప్రతివాడికీ శిక్ష ఇది!
నీ వైరిగాని,
ఎప్పుడూ ఇంతే!
ఇదే జీవితానికి నిర్వచనం!
ఇదే చరిత్ర చెప్పిన సత్యం!
నీ మాట నీవు చెప్పు
కాని వినరు!
నీ యత్నం నీవు చెయ్యి
కాని ప్రయోజనం లేదు!
కనుక మార్గం లేదు
ఈ ధనుస్సుకు నమస్కరించు!
జీవితంముందు నీ శిరస్సు వొంచు!
జీవిత మనే వధ్యశిలపై
నీ శిరస్సు ఉంచు!
నిన్ను నీవు బలిచేసుకో!
జీవితాన్ని జీర్ణించుకో!
ఇదే నీకు ఆనందం!
ఇదే నీ జీవితానికి అర్థం!!!

# “సిద్ధి ర్లోకా దృశ్యా-అనియమా ద్రామ్యం హి”

పండిత అ. నరసింహశర్మ

[ శ్రీ శర్మగారు కొన్ని శబ్దాలు గ్రాంథికవాదులచేత, వ్యావహారికులచేత ఏవిధంగా ప్రయోగింపబడుతూ వచ్చాయో యీ క్రింది వ్యాసంలో పరామర్శించారు. భాషకుగల సహజ ధర్మాలను సూత్రప్రాయంగా తెలియచేసేదే వ్యాకరణమనీ, అది శాసించేదిమాత్రం కాదనీ నిరూపించుటకూ ఈశబ్ద పరామర్శ ఉపయోగపడగలదు. నేడు పాఠశాలల్లోను, కళాశాలల్లోను వ్యావహారిక భాషను ప్రవేశపెట్టే విషయంలో చర్చలు జరుగుతున్నాయి. వ్యావహారిక భాష విషయమై అధికార వర్గాల్లోకూడ గందరగోళ భావాలు ఉన్నట్లు తెలుస్తూంది. వ్యావహారిక భాషఅంటే ఎవరు ఏది చెప్పినా, ఎవరు ఏది వ్రాసినా సరిఅయినదే అని అంగీకరించవలెననియు, అందుచేత దానికి ప్రత్యేకమైన ప్రామాణిక సూత్రాలేమియు లేనట్లు తలచుచున్నట్లున్నది. అది యథార్థము కాదనియు, భాషా వికాసమును అరికట్టని పద్ధతిలో యింతవరకు వున్న వ్యాకరణ సూత్రాలను ఉపయోగించుకుంటూ, అవసరమునుబట్టి క్రొత్త వ్యాకరణ సూత్రాలను వ్రాసుకొనవచ్చునని వీరి అభిప్రాయం. ]

## కొన్ని పదాలు

జలగ : “జలౌ (లూ)కా” నుండి వచ్చిన తద్భవ రూపం అనవచ్చు. “జెలగ” అనే పదమే సాధువని శిష్టుల భావము. కాని శబ్దరత్నాకరంలో “జలగ” అనేపదం ఉంది. “జెలగ” లేదు. “జలగ తిగిచినట్టు గొనగ జనునిల పాముల్” (భా. శా. 2 ఆ. 393 ప) వ్రాసుదొర జలగకూడా రాసేరు. “జలగ శరీరంబు బాదవి చయ్యన నెత్తురు” తి॥ వే. కవులు.

కాలవ : దీనికి ప్రాచీన ప్రయోగం మృగ్యము. మరాటలో “కలవా” అంటారు. కాని దీనికి కాలువ అనేవాడుక బలంగా ఉంది.

దవడ : దౌడ గ్రాంథికం అంటారు. తి॥ వే. కవులు విక్రమాంక దేవచరిత్రలో దవడ అని వాడేరు. దవడ, దవుడ, దౌడ మూడురూపాలు ఉన్నాయి. ఆవులించుఅనే పదం ఆవలించుఅనే వాడుక వచ్చినట్టే దవుడ వాడుక వచ్చింది.

మనమడు : మ న మ డు గ్రాంథికుల పలుకు. “భవ్య గుణమంజి మనమరాలి మానసమున మనమరాలి మనమరాలి వివాహ సంభ్రమము జూడ” (వసుచరిత్ర) మనవడు అనికూడా వ్యవహారం ఉంది.

కంకి : కంకె అని గ్రాంథికా భాసము. వ్యావహారంలో కూడా నేను వినలేదు. కాని కొండ రఘునాథనులు వాడేరు. పల్లి, పల్లె, తొట్టి, తొట్టె, కార్తి, కార్తెవలె తుది ఇకారమునకు ఎకారమును వచ్చుచున్నది.

వరిస, వరిసె, పాలిక, పాలికె, కోరిక, కోరికె ఒకతి, ఒకతె, అని అకారానికి ఎత్వం కనిపిస్తూంది.

చెడిప, చెడిపి, చెడిపె. సంపెంగ, సంపెంగె సంపంగి గాడిద, గాదెద, గాడిదె. సంకెల, సంకిలి, సంకెలె (సంకిలితప్పని గ్రాంథికము, వ్యవహారికముకూడా కాదని గిడుగువారియూహ)

వేళ : వేల, కళ్యాణము, కల్యాణము, ల, ళ, గా కొన్ని పదాలందవుతూంది.

ఎల్లయుండి : ఈ అర్థంలో నవీనులు ప్రతీది అంటారు. ఈ పదానికి కృతక గ్రాంథికాలు పతిది, ప్రతియది అనేవి ఉన్నాయి.

శనగలు : దీనికి సెలగలు, సెనగలు అనేరూపాలు. అచ్చతెలుగులో “శ”లేదని వాదుతారు. శెనిగలు అని హనుమంతరావుగారి సోమశేఖరవిజయంలో ఉంది. చెనిగపంట అని ఇంకో నవీన పత్రిక వ్రాసింది.

శనివారము, శరణు, శాలువు, శింగకవి, పడిశము, శిస్తు మొదలైన పదాలు ప్రవేశించేయిగదా?

సెబాస్‌కి షెభాస్, సెబాస్ అని వాడుక. సెబాస్ మాత్రమే ప్రయోగాలలో ఉంది.

మనిషి: మానపి అనిపూర్వవ్యవహారం. షికారు, సికారు అన్నట్లే ష. స. గా వాడేవారు.

మరుచటి: మరుసటి అని నిఘంటువులో ఉంది, గాని ప్రయోగం కానరాదు.

విసెనకఱ్ఱ: వీజనమునుండి పుట్టినరూపము. విసన కఱ్ఱ ప్రయోగం కానరాదు.

గురివెంద: గురివింద అని వాడుతున్నారు. పల్లి, పల్లె.

గెలువగలను: గెలవగలను, నాలుక నాలక, దొఱుకు దొరుకు, కరువు కరవు, నడుచు నడచు, బోరున, బోరన.

తగుల, తగవు, కానుక, కానక, దిగ్గున, దిగ్గన, మెలుత, మెలత, పగులు, పగలు, ఎగచు, ఎగుచు, ఉ, ఇ, అ, కారమధ్యములను తెలియ నసాధ్యము. నాటి వ్యవహారం శరణము, గొలువు అని కూడా వాడేరు.

కానవడు: వొపడు, అగుపడు, అగపడు నవీన కృతక గ్రాంథికాలు నవీనులచేతులు వాడేరు.

ఇవిగిడుగువారి సూచనల ననుసరించి వ్రాసేను.

| | |
|---|---|
| చేరు | చారు; చారు. |
| జామాత | జామారు(శేమారుకావ్యచిత్రము) |
| దయ్యము | దెయ్యము |
| చలిది | చద్ది; చద్ది |
| కొలది | కాలది కొద్ది |
| వద్ద | ఒద్ద |
| చివ్వ | చప్పు |
| ములుకోల | మునికోల |
| గరిటె | గంటె |
| పంచ | పంచె |
| మిద్ది | మిద్దె |
| మల్లి | మల్లె |
| పుస్తి | పుస్తె |
| బిందె | బింది |
| లంకె | లంకి |

బహువచనమునందు ఎత్వము మారుట

| | | |
|---|---|---|
| చూరె | చూరెలు | చూర్లు (చూరి) |
| గారె | గారెలు | |
| బోదె | బోదెలు | |
| కోర్కె | కోర్కెలు | |

డ, ణలు మారుట

| | |
|---|---|
| నాడెము | నాణెము |
| పుడుకు | పుణుకు |
| వడకు | వణకు |
| అడగు | అణగు |
| ముహూర్తము | మూర్తము |
| సహజము | సాజము |
| సహాయము | సాయము |
| | ఈ తత్సమంబు లందువలె |
| ఒకరాత్రి | ఓరాత్రి |
| ఒకటి | ఓటి |

ఓ రాత్రి కను చెప్పవేయక (కాశీ)

నావుడు సంతోషించిరి సావాసులు (ఉ. హ)

ప. బ. లలు మకారముగ మారుట

సంపెట, సమ్మెట, రెబ్బ, రెమ్మ, గంబము, గుమ్మము, గుబురు, గుమురు, మావిడి, మామిడి, కబిరము, కమిరము, తాబేలు, తామేలు, తంబళి, తమ్మళి, వదనిక, బదనిక.

వర్ధించు, పణుగు, పాదించు, బోర్లించు, చిందించు, వేయించు మొదలగునవి నవీన వ్యవహార సిద్ధములైన ధాతువులు.

అన్య దేశ్యపదముల దీర్ఘములకు హ్రస్వంబురాదు.

పేషా, కుర్చీ, సీసా, బస్తా, బురకా, జిల్లా, గుమస్తా, జెండా, పరగణా, కొరడా, బాకీ, బస్తీ, గస్తి, తగాదా, నాగా, అంగరకా, జుబ్బా, పకోడి, జిలేబీ, తమాషా, హిందూ, ఫాయిదా, జిరాయితీ, దాణా, ముఠా, కాటా, సలహా, అర్జీ, ముద్దాయీ, ఫిర్యాదీ, వాయిదా, వాచీ, పోచీ, పేచీ, చిమ్నీ, కవాచీ, కాఫీ, మాఫీ, మెహర్బానీ, తివాసీచెమ్కీ, నిషా, కుషీ, నగిషీ, దగుల్బాజీ, కుస్తీ, సుస్తీ, మున్షీ, దుబాషీ.

తామర + ఆకు = తామరపాకు }
తమలము + ఆకు = తమలపాకు } ప వచ్చినది

గంగి + ఎద్దు = గంగిరెద్దు
బొమ్మ + ఇల్లు = బొమ్మరిల్లు } రేఫ వచ్చినది
పొద + ఇల్లు = పొదరిల్లు
పాము + అమ్మ = పాపరమ్మ

పగతురు, నృపాలురు మొదలగువానికి సంబోధన బహువచనమునందు ర వచ్చునప్పుడు రుగాగమమంబు రాదు.

పగతులార; నృపాలులార.

# ప్రయోగవిశేషము

1. నీవు రేపు వచ్చితివేని ధన మీయగలను. వచ్చితివి + ఏని. వచ్చితివి భూతకాలక్రియ. కాని రేపటితో అన్వయము. ఏని చేదర్థకమున వచ్చినది. వీడు వచ్చెనేని పని పాడగును.

ఇట్లు భూతకాల క్రియలు ఏనిచేరి చేదర్థకములగుచున్నవి.

నేను రాగలిగితినేని వానిని రక్షించి యుందును.

రాగలను అని భవిష్యదర్థ క్రియపై ఏనిచేదర్థకమును భూతకాలార్థమున చేర్పగా “ఇతిని” అని భూతకాల ప్రత్యయముచేరి ఆ సమయమునకు వచ్చితినా అని యర్థము నిచ్చుచున్నది. ఈ ప్రయోగము తరచుగ కానరాదు.

2. ఆ. ఈ. ఏ. మొదలైనవి వ్యతిరేక క్రియలమీద నుండి సహజ దార్త్వర్థము నిచ్చుచున్నవి.

| | |
|---|---|
| కారే రాజులు. | రాజులు కలిగిరికదా ? |
| నేనురానా | వత్తునా ? |
| వెళ్ళమా | వెళ్లుదుమా |
| తినవా | తిందువా |

3. తుమున్నంతము శాపార్థకము నగును. నీ వాంఛ పాడుగాను, నీ యిల్లు కూలిపోను, నీ కడుపుకాల, నీ దుంపతెగ, నీ యిల్లు బంగారుకాను అని తిట్టలేక తిట్టిన తిట్టు.

4. తద్ధర్మార్థక క్రియలం దనుబంధమైన ఎదకు ఏ వచ్చును.

వచ్చెదరు, వచ్చేరు. చూచెదరు. చూసేరు, మ్రొక్కెదము. మ్రొక్కేము.

వచ్చేరవరైన విన్న [దశా]

వారు వచ్చేరు అని భూతకాలమందును నీ రూపమున్నది. కాని అర్థభేదముచే రూపభేదము.

5. చేయండి చూడండి అని చూడుడు, చేయుడు అనువానికి మారుగా వచ్చినవి. ఇవి పూజ్యార్థమునందు కూడ వాడబడుచున్నవి. అండి పూజ్యార్థకము. ఇది నామవాచకముల తుదిని కానవగును-

శ్రేష్ఠిగారండి, పంతులుగారండి స్త్రీలింగముల తుదిని కూడ వచ్చును. అమ్మగారండి, చెప్పేరండి దీనికి దీర్ఘంబునగు పంతులుగారండీ వినండీ, “విన్నారండీ యీకథను.”

6. ఉండుము మొదలగు పదములతో అనుకరణము చేయునప్పుడు వెనుకనున్న ఉకార మకారమగును.

ఉండమని, వెళ్ళమని, చూడమని.

7. కద అనుప్రయుక్తం బగునపుడు పుగాగమంబును అగు.

తెల్పుగదవే, ప్రోవగదవన్న.

8. తుమున్నర్థకరూపములు నిశ్చయార్థకములైనచో ఏ కారము వచ్చును.

రానే వచ్చెను, పోనేపోవును, చూసే చేసితివి, ఎట్లునా చూచితివని యర్థము.

9. పోనీ పోనిమ్ము అని అర్థము.

ఇది “పోనీ కానీ” పోనీ + కానీ (పోనిమ్ము + కానిమ్ము) “సరేకాని అది అటు లుండనిమ్ము” అను నర్థమున శబ్దపల్లవమువలె వాడబడుచున్నది.

“పోనీ, రానీ, నే నీ పని చేసెదను” పోయినా సరే, వచ్చినాసరే అని యర్థము. తూష్ణీంభావము నిర్లక్ష్యము వీని యర్థములు.

“నీతి నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ”
“ప్రభువు శాపింపనీ నేను వినను”
శాపించినసరే యని యర్థము.

10. పుంలింగ విశేషణము లోకభోమువర్గకాంతంబులు నగు.

లాలసశీలమైన కేసరి.

ఆ ధీరుడు దానమున కల్పవృక్షము. ధైర్యమున హిమవంతము.

అమహద్ బహు వచనమున ఏకవచనము విశేషణమగును.

పావనమైన శిరోజములు.

# సోమరసము - సుందరకాండ

సోమసుందర్

ఏమిటి వీక్షిస్తున్నావు సోమా?
కామనలో జగతీభర జరాగర్భ తిమిరంలో
భ్రమరం వలె పరిభ్రమిస్తా వేలనయా, సోమా?

అసంఖ్యాక ఆలోచన లనవరతం
తరంగితమ్మైన అంతరంగ సాగరమున మునక లిడుచు
నేవో, యేవేవో ఆఖ్యాయిక లుజ్జగించు
ఇంగిలీక కాంతుల సరినొత్తుకున్న
లీలామానుష విగ్రహ సుస్వరూపజాలము
నీ డెందములో కందళించి వలయముగా గమించెనో?

అనవరతం ముసరుకొనే, మూగుకొనే
ఆలోచన లనంత విలయపు గాలి యీత కారణాన
వలతలలో ఆశాలత చిగురించే తలపులతో -
నా తీ హృత్ క్షేత్రంలో పెన్నిధులను పెకలించే వ్రాతలతో -
బ్రతుకు బరువు మరపించే పాగ మేతలతో
తల లోపలి తెన్నులలో అలముకొనే రోతలతో
వలపు కలలు డించిన మది వెతలతో,

నీ చేతన మఖాతమై—
నిర్నిరీక్ష్య శిక్షాస్మృతియై—
వడివడిగా నడిపించే జడివానల నింపుకున్న
సుఖదుఃఖాల్ కడవలతో నింపుకున్న కావడితో;
రాజవీధి వక్షంపై మధురోహాల అహర్నిశలు
కుసుమించే రసరాజ్యపు గవాక్షాల సావడిలో
నీ చూపులు తడబడగా
భయముతోడ పయన మేల?
పరిసరాల తిలకిస్తా నడుస్తా వడెందులకో?
యోచిస్తా కనుకొలకుల తుడుస్తా వడెందులకో?

పరిశీలన లేలనయా? పరిదేవన లేలనయా?
పరితోషము లెల్లెడలను పరికించుట దేనికయా?

ఎందుకు, ఏమిటి, దేనికి, ఎవరి కెవరు
వంటి వెన్నో ప్రశ్నల కుశ్శంకల కంటకాలు
మనసు గ్రుచ్చి బాధించుట లేలనయా సోమా ?

* * *

నే చెబుతున్నాను కదా -
మనవి వినుము మనసా !
మనసారా బ్రతుకు గ్రోలి
జీవనగృహ ప్రాంగణాన వ్రేల్లి తమా తోరణాల
ననుక్షణం పరామర్శ జరిపిస్తూ
జిజ్ఞాసా తరంగాల ద్రచ్చిద్రచ్చి పృచ్ఛిస్తూ -
నడుస్తున్నవాణ్ణి నేను, గడుస్తున్న కాలమేను;

పరిశీలిస్తానుకదా - సుందరతర దివ్య విగ్రహాల సదా !
నర నిర్మిత కుసుమోత్కర నగరోద్యానవనాలను,
ఉద్యానవనాంతరాన పాదపాల ఛాయలలో కూర్కుతు
నిద్రకాని ముద్రలతో, కునికిపాటు జోగులతో,
పాటుల రోకటి పోటులతో నలిగిన
గోరుచుట్టు గుండెలతో —
వేగే, వ్రాగే, సోలే, దైన్యంవంటి జనాళిని,
జనావళికి అందరాని అనాఘ్రాత సుమావళిని;
క్షుత్ భారావనతాత్మల -
లవిత్ర సంహృత గాత్రుల -
ధాత్రీ సుగంధ మూర్తుల -
నకనకలాడే పీఠిహోత్రులను, వీక్షిస్తున్నాను సర్వదా !

కాంక్షిస్తున్నా ననుక్షణము నాలో చెలరేగే,
వలి తోచే, ఎద తొలిచే, ముద మూరించే -
మరీచులను తలపించే, విరించి కనుమూసే
ఊహ లహాల్యల కళ్యాణం చేయాలని
వెత ముడులను విప్పాలని, జడి రొదలను కప్పాలని,
ముచ్చట ముడివేయాలని, సుఖం పూలు ముడవాలని,
కాంక్షిస్తున్నా; నుబుసుపోకకై లోకపు నబబుల
కొలగారం చేస్తున్నాను సర్వదా !

గబగబ చూడ్కులు నిగిడ్చి
దబదబ వేడ్కలను సాచి
వడివడి అడుగులను పంచి
సారించిన కనుచూపుల తక్కెడలకు
అతీతమై గర్వించే, శీవుల మించే
మించుల వెలిగించే, వలపుల సంచులలో బిగియించే
సౌధమ్ముల; కాంచనమయ హర్మ్యాలను;
ధనాలు తులతూగే, నాగరికత దీపించే
కృతకమైన హాసంవలె సంగీతం మార్మ్రోసే
హర్మ్యాలను, అందలి లోలోపలి మర్మాలను
తిలకిస్తున్నా నుబికే గుండెలతో పదేపదే !

జీవిత మొక యాత్రాస్థలమై
భవిష్యత్తు మూల విరాట్టయి
మానవ యత్నాల వివిధ స్వరూపాలు
ఉత్సవ విగ్రహాలవగా
లవలేశం ఆహ్లాదం పొందుతాను
ఎద సందుల వెలిగిస్తా వేవెలుగుల దీపకళిక !
మదిలో, సందడిలో, తొందరలోపలి
చలిగాలుల జడివానల డోల నెన్నో కూరుస్తా
చేరుస్తా నమృతకిరణాల లహరి
మారుస్తా విభ్రాంతం !
ఈ ప్రగాఢ విభావరిని
కూరుస్తా నవోజ్జ్వల విభాతమును !
సుప్రభాత నయనోత్సవ దయాస్విన్న స్వరూపమును !

# ఆధునికసాహిత్యం: ఆత్మాభిమానం

కే. వి. రమణారెడ్డి

'బెంగాలు నేడు ప్రారంభించిన దానిని భారత దేశం రేపు అనుసరిస్తుంది' అని గోపాలకృష్ణ గోఖలే అన్నాడు. అది శేషభారతదేశానికి అన్వయిస్తుందో లేదో గాని, ఆంధ్రదేశానికి మట్టుకు చాలబాగా అన్వయిస్తుంది. రామమోహనరాయ్ బెంగాలులో చేసినట్లు వీరేశలింగంపంతులు తెలుగునాట చేశారు. బ్రహ్మసమాజం యిక్కడకూడ పాదుకొల్పారు! వ్యావహారిక భాషోద్యమ మక్కడ, యిక్కడ దాదాపు ఒకే కాలానికి బయలుదేరినై. గురజాడ అప్పారావుపంతులు గారు బెంగాలీ కవి పండిత బృందానికి లేఖలద్వారాను, వ్యక్తిగతముగాను పరిచయస్థుడు. సాహిత్య రంగమందే కాదు, రాజకీయాలంగుకూడ ఈ సంబంధం వుంది. బెంగాలువిభజన వ్యతిరేకాందోళన తెలుగుసీమనుకూడ ప్రాకింది. ఈ ఉద్యమం రాష్ట్రీయాభిమానముతో బాటు దేశాభిమానాన్నికూడ రేకెత్తించింది. కీర్తిశేషులు ముట్నూరి కృష్ణారావుగారి వెంట బిపిన్ చంద్ర పాల్ గారు దక్షిణాదికి వచ్చారు. అదివరకు ముందునుండి కూడా మండల మహాసభలు జరుగుచుండేవి. కాని మేఘగంభీరనాదంతో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రులలో రాష్ట్రీయాగ్నిని రగుల్కొల్పాడు. అప్పటివరకు మండల మహాసభలలో జమీందారులు ప్రముఖులుగ వుండేవారు. కాని, 1935 తర్వాత రాష్ట్రోద్యమము జాతీయోద్యమమునకు అనుబంధోద్యమమైపోయింది. నాటినుండి రాష్ట్రోద్యమ నాయకులు మధ్యమవర్గము నుండి వచ్చినవారు; మండల మహాసభల పరిమిత లక్ష్యాల నధిగమించి, ప్రభుభక్తి ప్రాతిపదిక నధిగమించి, రాష్ట్రోద్యమము సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ స్వాతంత్ర్యోద్యమాంతర్భాగమయింది.

ఇదే వేళకు జాతీయ జీవితంలో భిన్న దృక్పథాలు కలిగిన రెండు శాఖలు తయారైనవి. స్వామి దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామి ప్రభృతుల ప్రభావ ఫలితంగా, హిందూమత పునరుద్ధరణోద్యమం మొదలయింది. ఈ ఉద్యమానికి జాతీయోద్యమమందు అరవిందఘోష్, బాలగంగాధర తిలక్ తదితరులు ప్రతినిధు లయ్యారు. వీరికి ప్రతిగా మోతీలాల్ నెహ్రూ వంటివారు నిలిచారు. రాజకీయాలలో హింసా పద్ధతి (Terrorism) నవలంబించి అతివాదిగా పేరెన్నికగన్న అరవిందఘోష్ మత విషయాలలో మితవాది. రాజకీయాలలో అర్జీల పద్ధతి నవలంబించి మితవాదిగా పేరుబడిన మోతీలాల్ నెహ్రూ మతవిషయాలలో అతివాది. బ్రిటిషు పరిపాలన ఫలితంగాకలిగిన శుభాలలో ఒకటి మత విశ్వాస యుగాంధకాలం పటాపంచలైపోయి శాస్త్ర విజ్ఞానయుగ భానోదయం జరగడం. కాని, తిరుగ విశ్వాసయుగానికి యీ మత పునరుద్ధరణోద్యమం పాదుచేయాలని యత్నించింది. శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారు "భారతి" రజతోత్సవసంచికలో వ్రాస్తూ ఈ ఉద్యమ స్వభావాన్ని వ్యక్తపరిచారు: "పాత కొత్తల మేలి కలయిక' అని అనడంకన్న" ప్రాతవాటి కన్న నీవు పాడిచే దేముంది? వాటిని మళ్ళీ శుభ్రపరచి సుస్థాపితం చేసి కొమ్మ"ంటుంది. ఈ ఉద్యమం కొత్తసీసాలో పాతసారాయి నిలవచేసికొమ్మంటుంది. గణపతిపూజలు, శివాజీ ఆరాధన, కాళీమహోత్సవాల పేరిట మతరాక్షసికి తిరుగ ప్రాణం పోశారు, ఈఉద్యమ ప్రభావం సాహిత్యరంగంలో, పూర్వవిజ్ఞానసంస్కృతులపై వ్యామోహంగా పరిణమించింది.

తెలుగునాట గిడుగు - గురజాడ - కందుకూరుల ద్వారా పండిత వ్యవస్థ అప్రతిష్ఠపాలై, కావ్యశైలిలో సౌలభ్యం, వచనభాషలో వ్యావహారికం ప్రారంభమైన రోజులు. వీటితోబాటు సంఘదురాచారాలమీదకూడ పిడుగుదాడులు, పాతలోనిరోతను తెగడి కొత్తలోనివింతలను; విజ్ఞానవినోదమార్గాలద్వారా నవలలు, ప్రహసనాలు, నాటకాలు, కావ్యాలద్వారాదేశానికి బోధిస్తున్న రోజులు. ప్రబంధాలనుండి, పదబంధాలనుండి ఆంగ్ల సాహిత్యంపై పుకు కవులుమళ్ళుతున్న రోజులు. మొత్తం మీద యావద్భారతజాతికి పునర్జన్మకలిగి, "ఆత్మవిశ్వాస సూర్యోదయ"మై, "అహంకార దర్శనం" పొందుతున్న రోజులు. "జాతికీ మృతక్షితివంటి నిద్రావస్థ వస్తుంది. అది పోగానే జాతి మేలుకొంటుంది. అంటే తిరిగి పుడుతుంది. అనేక ప్రభావాలవల్ల యీ ప్రబోధం

కలగవచ్చు. ఈ ప్రబోధం వచ్చినతర్వాత బాల్య యౌవనాద్యవస్థలవంటివి జాతి జీవితంలో అన్ని కార్య రంగాలలోనూ గోచరిస్తాయి. కనుక సాహిత్యంలో నున్నూ, యౌవనదశలో ఉన్న వ్యక్తి తనంతవాడు లేన ట్లున్నూ, తనఅనుభవమంతఅమూల్యమైనదిలేనట్లున్నూ, లోకరంగంలో తానే నాయకుడైనట్లున్నూ అనుకుం టాడు. సాక్షిగా, తటస్థుడుగా ఈలోకాన్ని చూడలేడు. దానిలోపడి కష్టసుఖాలను తీవ్రంగా అనుభవించడమే అతనిపని. అతి దెక్కువగా హృదయవాది. అనుభవం వైపు మొగ్గినంత ఆలోచనవైపు మొగ్గడు. ఈ అవ స్థలోఉన్న జాతికూడా తనంత గొప్పదీ, లోపం లేనిదీ లేదనుకుంటుంది. ఈఆత్మపరత, ఈ 'తన' తనం నాటిసాహిత్యంలో బాగా స్ఫురిస్తుంది. ఇక యౌవ నాంగణంలో అడుగుపెట్టిన వ్యక్తిలో అద్భుత పూర్ణమైన ఒక దృష్టికూడా ఉంటుంది. అదివరకు అతి సామాన్యంగా కనబడిన ప్రతివస్తువూ, ప్రతి సంఘ టనా, కొత్త కొత్తగా గొప్ప గొప్పగా గోచరిస్తాయి." (పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం : దేవులపల్లి కృష్ణశాస్త్రి; భారతి; రజతోత్సవసంచిక). ఈ దృష్టి అలవడిన సాహిత్యదశ "వైచిత్రీయుగము", "కాల్పనిక యుగము" (Romantic Age) అనబడుతుంది. జాతి పునరుజ్జీవనంవల్ల సహజంగా సాహిత్యంలో వచ్చిన మార్పు మాత్రమే కాదిది. ఆంగ్లకవిత్వంలోని కాల్పనిక యుగ కవులైన వర్డ్స్‌వర్త్, కీట్సు, బ్రౌనింగు, షెల్లీ, కాలరిడ్జ్ మొదలైనవారి గ్రంథాలు చదివి, తెలుగు కవులు ప్రభావితు లయ్యారనికూడ చెప్పవచ్చును.

ఇదే సమయానికి, బెంగాలుదేశంలో రవీంద్రనాథ ఠాగూరు సుప్రసిద్ధకవిగా నెలకొన్నాడు. మర్మ వాదము (Mysticism), విశాలవాదము (Liberlism), సూఫీయిజమూ, వైష్ణవ మతతత్వము సమన్వయించి సరిక్రొత్త కవితాసంప్రదాయాన్ని స్థాపిస్తున్నాడు.

రాయప్రోలు సుబ్బారావుగారి ప్రథమ కవిత్వ రచనాకాలానికి యీ ఉద్యమాలు చాలమట్టుకు విజృం భించివుండినవి. వీటన్నిటి ప్రభావము ఆయనపైపడింది. రాష్ట్రీయాభిమాన కవిత్వానికి ఆయన జనకుడు. అప్పా రావు పంతులుగారి విజ్ఞాన - విశాలవాదానికి ప్రతిగా ఆయన విశ్వాస సంకుచితవాదానికి నాయకుడు. కాల్పనిక కవిత్వ మార్గదర్శి. రవీంద్రనాథ ఠాగూరుగారిని కొన్ని విషయాలలో తొలు దొలుత అనుసరించినవాడు. "గురజాడ కవి ఆధునిక కవితా ప్రస్థానంలో దేశిమార్గానికి ప్రథమాచార్యు డయితే, రాయప్రోలువారు ఆధునిక కవిత్వంలో మార్గ కవితా ప్రస్థానానికి ఆద్యులైనారు. ఈయన తమ కవితలో ఆంధ్ర కావ్యాలలో అనూచానంగా వస్తున్న కావ్యభాష పరిహరించలేదు" అని పిలకా గణపతి శాస్త్రిగారు వ్రాశారు. (భారతి, డిసెంబరు 52) అప్పారావుగారి వలెనే సుబ్బారావుగారుకూడ రసము గూడుకట్టుకొనిన దేశియ శబ్దాలకి నుడికారాన్ని అతిగి నప్పటికికూడ, అప్పారావుగారి ప్రజా దృక్పథంనుండీ సుబ్బారావుగారు వైదొలగినారు; పండితులను రంజింప జేసి, తన గీతికలలోని క్రొత్తను వారిచేతకూడ ఒప్పింప వలెనని సుబ్బారావుగారు ప్రయత్నించారు. అందు చేతనే, వారి మెప్పుదలకొరకు ఒప్పుదలకొరకు తమ క్రొత్తందనాన్ని పాతదుస్తులలో ముస్తాబు చేశారు. సుబ్బారావుగారి క్రొత్తదనం భాష లోనే క్రొత్తదనమైన భావాలలో, అభిప్రాయా లలో, యిష్టాయిష్టాలలో ఆచార సమర్థన, వెనుక చూపు కాగా, అప్పారావుగారిది భావాలలోనూ, అభిప్రాయాలలోనూ, యిష్టాయిష్టాలలోనూ క్రొత్తదన మయింది. ఒకరిది విశ్వాసదృష్టి, మరొకరిది విజ్ఞానశాస్త్ర దృష్టి. అప్పారావుగారు కోరినది మార్పు. రాయప్రోలు సుబ్బారావుగారు కోరినది అతుకు. అప్పారావుగారు పామరులను మార్చదలచుకొన్నారు. పండితుల నపహ సించారు; దురాచారాలను ఖండించారు; సంస్కరణల నభిమానించారు; విజ్ఞాన పతాకను ఎగురవేశారు. సుబ్బారావుగారు పండితులను మెప్పించదలచు కొన్నారు; పామరులను ఖాతరుచేయరు, ఆచారక్షయా నికి విలపించారు, సంప్రదాయాన్ని అభిమానించారు; విశ్వాసానికి తిరుగ ప్రాణప్రతిష్ఠ చేశారు. అప్పారావు గారు నవయుగ భాస్కరుడు. సుబ్బారావుగారు భూత కాలమందు వెలిగిన సూర్యుని రశ్మిచేత ప్రకాశమందిన చంద్రుడు.

## 2

అసఫ్‌జాహీ నవాబుల హయాములోనూ, బ్రిటిషు కంపెనీరాజ్యములోనూ, అటు తర్వాతనూ ఆంధ్రజాతి తన వ్యక్తిత్వాన్నే మరచిపోయింది. తెలంగాణము, సర్కారాంధ్రదేశము అనే చీలికలే కాక, కోస్తాజిల్లాలు దత్తమండలాలు అనే చీలికలుకూడ అవతరించాయి. చాలకాలంవరకు ఒకరి విషయాలు మరొకరికి తెలియక పోవడమేగాక, పాలకుల దుర్నీతి ఫలితంగా ఒకరిపై వేరొకరికి అక్కసు, అసూయ, చిన్నచూపు, నిర్లక్ష్యమూ ఏర్పడినవి. జాతి అంతరించింది. స్థానిక దృష్టి ప్రబలింది. కాని యీ శతాబ్ది ప్రారంభకాలమందే

అణగారిపోయిన జాతి వ్యక్తిత్వం ఒక్క పెట్టున వికసించింది. బెంగాలునుండి వీచిన వేడిగాడ్పులే కాదు దీనికి కారణం. గత శతాబ్ది చరమపాదంలోనే ఆంధ్ర జాతీయోద్యమం ప్రారంభమయినదని చెప్ప వచ్చును. మండల మహాసభలే బీజాలు కాగా, జాతీయోద్యమం అంకురించింది. రాయప్రోలు సుబ్బారావు గారి రాష్ట్రీయ కవిత్వానికంటే ముందు తెనుగు నాట సమరకవిత్వం లేకపోలేదు. మండల మహాసభలు రాష్ట్రీయ మహాసభగా పరిణమించినట్లే, యీ సమర సాహిత్య లక్షణాలు రాయప్రోలులో సంగమించాయి. జమీందారుల ప్రోత్సాహముతో, పెత్తనంతో నడచిన మండల మహాసభలకు, పెద్దపెద్ద వకీళ్ళ, విద్యావేత్తల, డాక్టర్ల ఆధిపత్యాన జరిగిన రాష్ట్రీయ మహాసభకు వున్న భేదం చాల దొడ్డది. భారత రాజకీయాలలో సంపన్నవర్గప్రాబల్యం అంతరించి, మధ్యమ వర్గ ప్రాబల్యం వుదయించిన సంధ్యాకాల మది. సంపన్న వర్గప్రాబల్యంతోబాటు బ్రిటిషు సామ్రాజ్యాధికారానికి భక్తిప్రపత్తులుకూడ అంతరించినాయి. మధ్యమ వర్గప్రాబల్యంతోబాటు యీ మహాసభలు రాజకీయ సమస్యలనుకూడ తలకెక్కించుకోసాగినాయి. 1894 జూన్ నెలలో కాకినాడలో జరిగిన మొట్టమొదటి గోదావరీ మండల సభలో చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు కొన్ని పద్యాలు వ్రాసిచదివారు. మొదటి పద్యం ఆంగ్లేయ దొరతనమువారి విజయాల నుగ్గడిస్తూ "తుహినాద్రి మొదలు సేతువుదాకరాజ్యంబుజరిపె"నని' "జాతి మతాచార సర్వస్వతంత్రతముల్ నెరపె"నని, "పిండారి దండుల పేరులేకుండఁజేసె"నని పేర్కొని, "యిట్టి యాంగ్లేయ దొరతనం బేలుగాక ధర్మమతితోడ నా చంద్రతారకంబు", అని ముగుస్తుంది. 1896 మే నెలలో గుంటూరులో జరిగిన కృష్ణామండల మహాసభలో పోలవరము జమీందారుగారి ప్రోద్బలముచేత, చిలకమర్తివారు అంతకుముందే చనిపోయిన గ్లాడ్‌స్టన్ గురించి కొన్ని పద్యాలు వ్రాసి చదివినారు. కాని మొదటినుండీకూడ చిలకమర్తికవి ప్రజల దీనావస్థను కూడ చిత్రించ బూనుకొన్నారు. "ప్రభువుల పాల నన్నను లోపముల జూపదగినట్టి నిలువుటద్దంబు"; కాని "ప్రార్థించుటకు మూర్తివంతమౌ వరరాజభక్తి" నాటి జాతీయమహాసభలు, మండలమహాసభలూ - వీటి వైరుధ్యాలను చిలకమర్తి కవితలో చూడవచ్చును. గోదావరీ మండలసభలో ఆయన చదివిన పద్యాలలోని కంటె మేల్బంతియైన పద్య మిది.

"పన్ను గట్టుటయందు ప్రభువులో హానాల
 కేనాటికైనను దృష్టి లేదు
ఉద్యోగములు చేయు నున్నతస్తులకు గార్య
 నిర్వాహమందున నియతి లేదు
బహు పరీక్షల దేరి ప్రఖ్యాతులగు వారకు
 రవ్వంతయేని ధైర్యంబులేదు
మితిలేని తమ చెడ్డ గతి సెల్లఁదగ విన్న
 వింపఁగ రయితుకు విద్య లేదు
 తెలుఁగు తెలియంగ దొరలకుఁ దలివిలేదు
 దీన దశఁబాపగలయట్టి దిక్కులేదు
 కటకటా! యెట్టులున్నదో కాపుల దశ
 సుగుణధనులార జనులార చూడరయ్య!"

కాపువాడు సేద్యనాద్యాలుచేసి పన్నులు, శిస్తులు కట్టి, లంచాలుమేపి, సంసారాలు యీదే చివరకు ఏమి మిగిలిస్తున్నాడు? "గడ్డి మాత్రమే మిగిలించు గాపు వాడు" ఈ పద్యధోరణి నానాటికి ప్రబలమయింది. చిలకమర్తి మరింత తెగువ చూపించసాగినాడు. బిపిన్ చంద్రపాలుగారి రాక ఆయన కాక పుట్టించింది. ఆయన ఉపన్యసించిన తర్వాత (1907) లో చిలకమర్తి చదివిన పద్యం ఆంధ్రదేశమంతా వ్యాపించింది.

"భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియఁగట్టి."

ఆ సంవత్సరంలోనే విశాఖపట్టణములో జరిగిన చెన్నరాష్ట్ర రాజకీయ మహాసభలో లజపతిరాయిని మాండలే నగరములో ఖైదుచేసినందుకు నిరసనగా పంతులుగా రుపన్యసించారు.

"చెరసాలల్ పృథుచంద్రశాలలె యగున్
 చేదోయి గీలించు న
య్యరదండల్ విరిదండ లయ్యెడును
 హేయంబైన చోడంబలే
పరమాన్నంబగు మోటకంబళులు
 దాంబ్సన్ పట్టు సెల్లాలగున్
స్థిరుడై యేనరు డాత్మదేశమును
 భక్తిం గొల్చు నవ్వానికిన్.

"భరతఖండంబె యొక గొప్ప బందెఖాన
అందులోనున్న ఖయిదీలు హిందుజనులు
ఒక్క గదినుండి మార్చి వేరొక్క గదిని
బెట్టుటేగాక చెరయుంచు వేఱ గలదె?"

కాని యీ ధోరణి దేశములోని జమీందారులకు గాని, ప్రభుభక్తి పరాయణులైనవారికిగాని నచ్చలేదు. వీరేశలింగంగారికికూడ నచ్చలేదు. జమీందారులు కొందరు చిలకమర్తివారిని ఏ విధంగా సాధించారో ఆయన స్వీయచరిత్రవల్ల తెలుస్తుంది. బిపినచంద్రపాల్ గారి వుపన్యాసాలు వీరేశలింగముగారి కసలే సరిపడ లేదట. "ఆయన పూర్వకాలపువాడగుటచే నాంగ్లేయ ప్రభుత్వమునకు విరుద్ధమైన మాటలుగాని, చర్యలుగాని వారికిష్టము లేదు" (స్వీయచరిత్ర). కాని చిలకమర్తి వారి పద్యాలు బాగుగా వున్నవని తోచినందుచేత గురజాడ అప్పారావుగారు యింగ్లీషు తర్జుమా చేశారట చిలకమర్తి, కందుకూరిని దాటి రెండడుగులు ముందుకు వేశాడు. ప్రతిమండలమహాసభలోనూ సంఘ సంస్కరణల సభలనేవి అనుబంధంగావుండేవి. వీరేశలింగంగారు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు మొదలైనవారు వీటి పెత్తనం చేసేవారు. సంఘంలోని కుళ్ళు దేశం స్వతంత్రమైన తర్వాతనే పోగలదని, కాబట్టి మొదట రాజకీయోద్యమాలవైపు దృష్టిని కేంద్రీకరించాలని వీరేశలింగంగారు గ్రహించలేకపోయారు. కాని కాలం వీరేశలింగంగారికోసం ఆగలేదు. చిలకమర్తి చేతినుండి రాయప్రోలు యీ సమరకవిత్వ ధ్వజాన్ని అందుకొన్నాడు. అయితే చిలకమర్తివారి కవిత రాష్ట్రీల పొలిమేరలుదాటి యావద్భారతదేశ స్వాతంత్ర్య సౌభాగ్యాలను కలగన్నది. రాయప్రోలువారిది రాష్ట్రానికి అంటిపెట్టుకొనిపోయింది. అందుచేత రాయప్రోలు దృష్టి సంకుచితమవడానికి వీలులేదు. చారిత్రక సంఘటనల ప్రభావంచేత యీ పరిమితి ఏర్పడింది; నిజానికి బెంగాలు విభజనోద్యమం తర్వాత గాంధీగారి సత్యాగ్రహోద్యమాలవరకు యావద్భారతజాతికి చెందిన సంఘటన లంతగా లేవు. ప్రథమ ప్రపంచయుద్ధ మొకటి అడ్డువచ్చింది. సామ్రాజ్యవాదుల కష్టాలను ఆదరువు చేసికొని జాతీయోద్యమాన్ని విజృంభింప చేయగల రాజకీయ చాతుర్యం కలిగిన నాయకులు కొరవడ్డారు. ప్రభుభక్తి కొంతకాలం వ్యాపించింది. ఈ సమయ కాలమందే ఆంధ్ర రాష్ట్రోద్యమం పుట్టి బలపడడం జరిగింది. రాయప్రోలు సుబ్బారావుగారి రాష్ట్రీగానానికి యిదే వసంతర్తువు.

[క్రమానుగతంగా మరికొన్ని వ్యాసాలు]

---

" తేనెసోఁక నోరు తీయన యగురీతి
తోడ నర్థమెల్లఁ దోఁచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యము
మూఁగ చెవిటివారి ముచ్చటగును.

కందువ మాటల సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మతి కానుపించు విబుధుల మదికిన్ "

—మొల్ల

# అడక్కండి బాబూ!

రాం షా

అడగకురా, ప్రియసఖుడా! ఆదర పూర్వక వాక్కుల
    అయ్యో, ఓ రయ్యో, నే చెప్పలేను భయ్యా!
ఇది సృజించె కల్లోలం, నా నిర్మల హృదయంలో
    ఇది విధించె ప్రావాసం, ఇష్టుల ఆప్తులనుండి.
విధి విధాత విష్ఠురముగ విధించెనో నా నుదుటను
    ఈ రహస్య వేదనయే రగుల్కొనెడు నా యెడంద;
తీర మింత కనిపించని సంద్రమురా నా చుట్టూ
    తెడ్డు విరిగి ఒ డ్డైనుగని జీవనౌక, ఆకట్టు.
నేను వినే, నేను కనే, నేను కలియు అన్నింటా
    అన్నింటా ఒకే విసుగు ఒకే కసరు అన్నింటా
ఏ సుందర దృశ్యమైన అందదురా నా ముందర
    ఆలి కంటి మెరుపుల్లో అయిపురాదు ఆనందం
దేని కింత దుఃఖమ్మని అడగకురా ప్రియసఖుడా!
    జాలిపడకు నా తండ్రీ! ఎందు కంత సాహసమ్ము?
గుండె విచ్చి చూడు అదే నరక జ్వాలల రూపం!—
    అయ్యో, ఓ రయ్యో, నే చెప్పలేను భయ్యా!
ఇంటిమీద కోపం, ఇల్లాలిమీద కోపం
    వంటిమీద కోపం, నా బంటుమీదె కోపం
ఎందు కిదని యోచిస్తే కనిపించదు కారణం
    అయ్యో, ఓరయ్యో! నే నవ్వలేను భయ్యా!
రోగాలకి ఇష్టుణ్ణి; రోషాలకి భృత్యుణ్ణి;
    వంట లేదు; పొయ్యిక్రింద మంట లేదు;
పర్సున కానీ లేదు; కలతకు లోపం రాదు;
    చెప్పగ మాటే రాదు; స్నేహితు ఓదార్పు లేదు.
దేని కింత దుఃఖమ్మని అడగకురా ప్రియసఖుడా!
    అయ్యో, ఓరయ్యో, నే చెప్పలేను భయ్యా!
    అయ్యో, ఓ రయ్యా. నే చెప్పలేను భయ్యా!
        నే చెప్పలేను భయ్యా!





# నా అభిమానాధునిక ఆంధ్ర కవి

# శ్రీ శ్రీ


## తెన్నేటి పూర్ణచంద్రరావు


( ఉస్మానియా ఆర్ట్సు కళాశాల తెలుగు సంఘం నిర్వహించి 'సింపోజియం' సందర్భంగా చదివిన వ్యాసం. )

'కుక్క-పిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా - రొట్టెముక్కా, అరటితొక్కా, బల్లచెక్కా, తలుపుగొళ్లెం, హారతిపళ్లెం, గుర్రపుకళ్లెం' వీటిమీదనా కవిత్వం రాయటం అని ప్రశ్నిస్తారు కొంతమంది. వారి వుద్దేశం కవిత్వమంటే సుందరమైన వస్తువుల్ని గురించి సుందరంగా చెప్పటం. ఈ విమర్శకులు,

రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు
యద్వాప్యవస్తు కవిభావక భావ్యమానం
త న్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే–అంటే

"కాదేదీ కవితకనర్హం-ఔనౌను శిల్ప మనర్ఘం
ఉండాలోయ్ కవితావేశం-కానీవోయ్ రస నిర్దేశం
దొరకదటోయ్ శోభాలేశం..."

అనే మాటల్ని ఎందుకు మర్చిపోతున్నారో ఆశ్చర్యం. కళకూ, సౌందర్యానికీ ముడిపెట్టటానికి వీల్లేదు. కళకు సౌందర్యమే ప్రధానమనటం సముచితం గాదు. హెర్బర్ట్‌రీడ్ ఈ సందర్భంగా అన్న మాటలివి :

"...For Art is not necessarily beauty: that cannot be said too often or too blatantly, whether we look at the problem historically (considering what art has been in past ages) or Sociologsically (considering what art is actually in its prsent day manifestations all over the world) we find that art often has been, or often is a thing of no beauty..." (from 'The meaning of Art' by Herbert Read.)

అందువల్ల కవితకు సౌందర్యం ప్రధానమని వాదించే వారు కేవలం ఆధునికులను దుయ్యబట్టాలని చూచే వారని అనుమానించవలసివస్తుంది.

ఇరవయ్యో శతాబ్దంలో వైజ్ఞానికంగా మహావిప్లవం చెలరేగింది. ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం, మార్క్స్ గతితార్కిక భౌతికవాదం, డార్విన్ పరిణామవాదం, ఫ్రాయిడ్ సైకో-ఎనాలిసిస్, పాత సిద్ధాంతాలను ఊడ్చిపెట్టాయి. ఆధునికుల ఆలోచనావిధానాన్ని అర్థం చేసుకోవాలంటే పై సిద్ధాంతాల స్వరూపం కొంతైనా తెలియాలి. అందులోనూ, ఆధునిక యుగసారాన్ని జీర్ణించుకొన్న శ్రీ శ్రీ రచనల్ని అర్థంచేసుకోవటానికి, ఆనందించటానికి అలాంటి పరిజ్ఞానం తప్పనిసరిగా ఉండితీరాలి. శ్రీ శ్రీ కవిత అందుకనే.

"కదిలేదీ కదిలించేదీ - మారేదీ మార్పించేదీ- పాడేదీ పాడించేదీ - పెనునిద్దుర వదిలించేదీ - మునుముందుకు సాగించేదీ - పరిపూర్ణపు బ్రతు కిచ్చేదీ."

ఆధునిక వైజ్ఞానిక సిద్ధాంతాలు నూతనమైన విలువల్ని ప్రతిపాదించాయి; నవ్య దృక్పథాన్ని పరిపోషించాయి. నవీన జీవనమార్గాన్ని ప్రతిబింబించాయి. నాగలింగాను శాసనం, పెద్దబాలశిక్ష, శుకుడు బోధించిన భూగోళం, యజుర్వేదంలోని రసాయనశాస్త్రం వీట్లను నమ్ముకొన్న వాళ్ళు ఒక్కనాటికి శ్రీ శ్రీని అర్థం చేసుకోలేరు. శ్రీ శ్రీని పరిశీలించడానికే వ్యుత్పత్తి కావాలి. పాత సామాగ్రి, కొలతబద్దలు మారాలి.

ముందుగా శ్రీ శ్రీ రచనలమీద కొందరు చేస్తున్న విమర్శనలను పరిశీలించి, పిదప శ్రీ శ్రీ రచనావైశిష్ట్యం గురించి చెప్తాను.

మొట్టమొదటి విమర్శ అతని రచన అయోమయం (Unintellegeble) గా ఉంటుందనేది. ఆవశ్యకమైన సామగ్రి లేకుండా పరిశీలిస్తే ఏ రచనగానీ అయోమయంగానే ఉంటుంది. మాటవరసకి, 'జీవితపు సన్నని సందుల్లోకి ఆకర్షణ' అంటాడు. జీవితానికి సన్నని

సందులేమిటి? ఇక్కడ జీవితం అనేది వ్యక్తి మానసిక జీవితంపైకి హేతుబద్ధంగా కనిపిస్తున్న మనస్సుకాక, ప్రతివానికీ అంతరాత్మ (unconscious) అనేది ఉంది. పైకి కనుపించేది కప్పుమాత్రమే. అంతరాత్మలోని ప్రచండ వేగానికి తట్టుకోలేక ఈకప్పు బీటలువారుతుంది. తత్ఫలితమే తబ్బిబ్బుమాటలు (Errors in Speech) పొరపాటుపనులు మొదలైన విధంగా కనిపిస్తుంది. ఈ బీటలే సన్నని సందులు. పైకి కనిపించే కప్పు (cover) మీద కాక, నిజమైన పరిశీలకుడికి ఆ కప్పు సందుల్లోనించి తన్నుకువస్తున్న అంతరాత్మ ప్రవాహంమీదకే ఆకర్షణ ఉంటుంది. సైకో ఎనాలిసిస్ తెలుస్తేకాని పైవాక్యం బోధపడదు. అలాగే "నాజనని గర్భంలో ఆకారంలేకుండా నిద్రిస్తున్న నా అహంకారానికి..." అంటాడు. ఇదీ అంతే. సైకో ఎనాలిసిస్ లోని (Ego) ఈగో, (Libido) లిబిడోలను గురించి తెలియందీ భావం స్ఫురించదు. ఎక్స్ప్లాయిటేషన్ (Exploitation) అన్న అర్థశాస్త్ర పదానికి అతను వాడే 'దోపిడి' అనే పదం 'అదనపు విలువ సిద్ధాంతం' తెలిస్తేనే ఆనందం కలిగించేది. 'పరస్పరం సంఘర్షించిన శక్తులలో, చరిత్రపుట్టెను' - ఇది థీసిస్, యాంటిథీసిస్, సింథసిస్ ల వ్యాపారాన్ని మనస్సున పట్టించుకొంటేనే తెలుస్తుంది. "మా దృష్టిది వర్తుల మార్గం, సంధ్యా జీవులం, సందేహభావులం; ప్రశ్నలే. ప్రశ్నలే. జవాబులు తృప్తి పరచవు". ఈ వాక్యాలు సాపేక్ష సిద్ధాంతపు తాత్వికార్థం (Philosophical Implication) మీద ఆధారపడివున్నాయి. సాపేక్ష సిద్ధాంతంగురించి కనీసపు భావంగాని లేకుంటే అర్థంకావు. "వింధ్యాచలం, సంధ్యాచలం, మహానగా లెగురుతున్నాయి" ఈ వాక్యంలోని పోగను ఆధునిక వైజ్ఞానిక విజ్ఞానాన్ని గుర్తించందే బోధపడదు. శ్రీశ్రీని అర్థం చేసుకోనేందుకు కావలసిన సామగ్రి వేరు. గతితార్కిక భౌతికవాదమంటే తెలియనివారికి

'పాపపంకంనుండి పద్మాలు పుట్టించి'

అంటే అయోమయంకాక ఆనందం ఎలా కలుగుతుంది? 'నీలాసుందరీ పరిణయా'దులు చదివిన మన తత్వంతోనే మహాప్రస్థానం చదివితే అర్థంకానిమాట నిజం. దానికి బాధ్యుడు శ్రీశ్రీ కాడు.

రెండోరకమైన విమర్శ: శ్రీశ్రీ హింసా ప్రతిపాదన చేస్తాడని. ఈ మాటలో అవంత నిజం లేదు. అతడు కోరేది దుష్టశిక్షణను. కోట్లకొలది ప్రజలను పేదరికంపాలు చేస్తున్న వ్యవస్థను మార్చటానికి ఇష్టం లేక అడ్డుపడేవాళ్ళకు శిక్షను కోరుతున్నాడు. అతను కోరేదీ,

'స్వాతంత్ర్యం సమభావం సౌభ్రాత్రం సౌహార్దం
పునాదులై ఇళ్ళు లేచి జనావళికి శుభం పూచి
శాంతి శాంతి కాంతి శాంతి జగమంతా జయించాలి'

అని మాత్రమే.

మూడో విమర్శ: శ్రీశ్రీ రచనల్లో ఆవేశం తప్ప ఆలోచన లేదని. కవితకు ఉద్వేగమేగదా మూలం. పూర్వకవుల్లో ఈ ఆవేశం దేనికి కన్పించదు అంటే, వారికి ఆనాటి వ్యవస్థ బాగున్నది. వారికి ఆనాడు సంఘంలో మార్పులు అక్కర్లేదు. కాని ఈనాటి సంఘ నిర్మాణాన్ని దుష్టంగా గుర్తించి సంఘాన్ని నవ్యసూత్రాలపై పునర్నిర్మించాలని తహతహలాడే వానికి ఆవేశం ఉండదా? అలనాడు వాల్మీకి, బోయవానిమీద కోపించలేదా పక్షిమీద కనికరంవల్ల? అలాగే శ్రీశ్రీ పేదలమీది కరుణచేత వారికి బాధలు కలిగించటానికి కారణమైనవారిమీద కోపగిస్తున్నాడు. 'చిరకాలం జరిగిన మోసం - బలవంతుల దౌర్జన్యాలూ ధనవంతుల పన్నాగాలూ, ఇంకానా ఇకపై సాగవు' అని విజృంభిస్తున్నాడు.

'సఖులవలన పరిచ్యుతులు జనులవలన తిరస్కృతులు సంఘానికి బహిష్కృతులు - జితాసువులు, చ్యుతాశయులు హ్రృతాశయులు హతాశులై' విలపిస్తాంటే చూచి ఆవేశపడటం లోపమా? గుణమా? - "వినాశాయ చ దుష్కృతాం" అని చెప్పిన కృష్ణుని మన తత్వం అట్టిదేగదా!

నాలుగోవిమర్శ: శ్రీశ్రీ రచనలు భారతీయ సంస్కృతికి విరుద్ధాలని. అసలు సంస్కృతి అంటే ఏమిటి? అందులో భారతీయ సంస్కృతి స్వరూపం ఎలాంటిది అనేవి వివాదాంశాలు. పోనీ కాదనుకొన్నా, 'లోకాస్సమస్తా సుఖినోభవంతు' అనేది భారతీయ సంస్కృతి అయ్యేపక్షంలో అతను వ్యతిరేకి కాడు. అతడు పీడకులకే వ్యతిరేకి. వారి సంస్కృతే 'భారతీయసంస్కృతి' అయితే అతను దానికీ వ్యతిరేకియే కావచ్చు. కాని భారతీయాత్మను ఆకళింపు చేసుకొన్న ఆధునిక కవి శ్రీశ్రీ ఒక్కడేనన్నా తప్పులేదు. స్విన్ బరన్ వ్రాసిన A Match (ఏ మాచ్)గీతానికి శ్రీశ్రీ చేసిన అనుసరణ చూస్తే ఈవిషయం బోధపడుతుంది. అంతేకాదు. భారతీయసంస్కృతి వంటబట్టినవాడు గనుకనే "యమునిమహిషపు లోహఘంటలు - మబ్బుచాటున ఖణేల్

మన్నాయి" అనగలిగినాడు. కవిత తనకు 'నిర్వికల్ప సమాధిలో నాప్రాణం నిర్వాణం పొందించిం' దన్నాడు. 'నా నుడి నీ గుడిగా నా గీతం నైవే ద్యంగా హృద్యంగా అర్పిస్తా'నన్నాడు కవితకు. 'మానవకోటి సామ్రాజ్య దూతలు, కళా యజ్ఞాశ్వముల్ సాగిరి' అంటాడు. భారతీయ సంప్రదాయానికి దూరం కాని రచన కాదా ఇది? ఏం జరుగుతున్నా సరే సహించి 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అని కూర్చొ టుమా మన సంస్కృతి. ఆలాగైతే 'పరిత్రాణాయ సాధూనాం......సంభవామి యుగేయుగే' అనేది కూడా భారతీయ సంస్కృతి కాదేమో!

అయిదోరకమైన విమర్శ: అతను కేవలం స్వప్నాలు ప్రదర్శిస్తాడని. నిజమే. ఈనాటి ప్రతి ఒక్క మహా విషయమూ ఒకప్పుడు స్వప్నమే కదా! ప్రజా స్వామ్యం, అటంబాంబు, ఆకాశయానం - ఇవన్నీ మొన్నటిస్వప్నాలు. ప్రపంచ శాంతి, సమత - నేటి స్వప్నాలు. కాని శ్రీశ్రీ హెచ్చరిస్తున్నాడు: 'యీ స్వప్నం నిజమవుతుంది. ఈ స్వర్గం రుజువవుతుంది' కేవలం స్వప్నమని త్రోసిపారవేయటం అవివేకం. దాని మంచిచెడ్డల్ని విచారించాలి. అతని ఆదర్శం గొప్పది అయితే ఆ స్వప్నాన్ని నిజం చెయ్యటానికే ప్రయత్నించాలి.

ఆరోరకమైన విమర్శ: శ్రీశ్రీకి భాష, ఛందస్సు, వ్యాకరణం, అలంకారం - వీటిమీద గౌరవంలేదని! దీనికి సమాధానం ఒక గ్రంథం వ్రాయవచ్చును. అతని కవిత శిల్ప (Craft) ప్రధానం కాదు. పూర్వకవిత కేవల శిల్పం (పద, అర్థశిల్పాలు) కనుకనే ఛందో వ్యాకరణాదులే కవిత్వం! 'ఇంద్రోపల కోచి జూచి తలయూచి యులూచి రసోచితంబుగన్' అనేది ఆనాడు కవిత్వమే. కాని నేటి కవితలో శిల్పమే కవిత అనవీలు లేదు. ఇక భాష విషయానికొస్తే రస దృష్టిలో భాష అప్రధానం. ఏ అలంకారికుడూ ఫలాని భాషలోనే రసనిర్దేశం జరగాలి అని శాసించ లేదు. కల్లుంటే మాసీ, వాక్కుంటే వ్రాసీ, ఏ భాష లోనైనా రసోత్పత్తి కలిగించవచ్చును. కాని శ్రీశ్రీకి గల భాషా పాటవాన్ని ఈ శబ్దాలలో పరికించండి:

"శ్లథ శైశిర పలాశ రీతులు - మనస్వినీవాలి - మిహిరవాజిరతతి - మఖవధనుర్ద్యుతి - నానాగానామాన స్వానావళితం - రస విస్ఫుమర కుసుమపరాగం - హిమానీ నిబిడ హేమంతములు - వాసంత సమీరం - నటుధూర్జటి నిటాలాక్షి - హింసనచణ ధ్వంసరచన-" ఇలాంటి వింకెన్నో.

ఛందస్సుకు ముఖ్యమైన లయను శ్రీశ్రీ రచనల్లో చూచండి:

'స్వర్గ విలయ హేమంత వసంత - ధ్వాంత కాంతి విక్రాంతి వేళలో'

'కురుక్షేత్రమున క్రుద్ధ వృకోదరు - గదాఘాతమున గజగజలాడగ'

'ప్రదీప్త కీలా ప్రవాళ మాలా ప్రపంచవేలా ప్రసారములలో'

'గగనమంతా నిండి పొగలాగు క్రమ్మి
బహుళపంచమి జ్యోత్స్న భయపెట్టు నన్ను'

ఏడో విమర్శ: శ్రీ శ్రీ సామ్యవాద ప్రచారం చేస్తాడనేది. దీనికి ఒక్కటే సమాధానం. ఈనాటి విజ్ఞానం రవంత ఆకళింపు చేసుకొన్నవాడు సామ్యవాది కాక తప్పదు. ఎప్పుడో పన్నెండో శతాబ్దంలో బతుకుతున్న వాళ్ళు, ఈవ్యవస్థ మారితే తమ గౌరవా నికి, జీవనానికి హానికలుగుతుందనుకునేవారూ సామ్య వాదం (Socialism) అంటే మొహంమాడ్చుకుంటారు. జార్జిబెర్నార్డుషా మహాకవి సామ్యవాది. ఆస్కార్ వైల్డు సామ్యవాద అభిప్రాయాలు వెలిబుచ్చాడు. ఫలానా పార్టీ ప్రచారం చెయ్యటం తగిందనికాదు నా అభి ప్రాయం. ఒకసిద్ధాంతాన్ని, ఒక దృక్పథాన్ని, ఒకరక మైన జీవితపువిలువల్ని కలిగి ఉండటంలో విడ్డూరమేమీ లేదు. ఆమాటకొస్తే రాయలవారిఆముక్తమాల్యద వైష్ణవ మత ప్రచారం కోసమే కదా? పుట్టింది. నన్నయ భారతం ముప్పాతిక వైదిక మత ప్రచారమే కదా? ప్రబంధ కవులంతా రాజరికాన్ని వర్గవ్యవస్థను సమర్థించినవారేగదా? వారి జీవనదృక్పథాన్ని గురించి రచించే హక్కు వారికి ఉన్నప్పుడు ఆధునికుల కెందు కాహక్కు లేదో ఈ విమర్శకులు చెప్పగలరా? ఆనాడు వారు తమకు నచ్చిన సిద్ధాంతాలను చక్కగా ప్రచారం చేసుకున్నారు. శివకవుల గ్రంథాలన్నీ ప్రచార గ్రంథాలే నన్నమాట ఎవరు కాదనగలరు? ఒక ఆదర్శాన్ని (Ideal) జీవన దృక్ప థాన్ని రచనలో ప్రతిబింబింప చేయకుండా రచన చేయటం ఏలాసంభవం అని ప్రశ్నిస్తున్నాను. ఒక్కొ యుగంలో ఒక్కొవిధమైన ఆదర్శం ప్రబలి, ఆనాటి వారు ఆ ఆదర్శాన్ని ప్రతిబింబింపచేస్తూ రచనలుసాగిం చారు. ఈనాటి ఆదర్శం సామ్యవాదం (Socialism). ఈనాటి కవి ఆఆదర్శాన్ని ప్రతిబింబింపచేస్తున్నాడు.

ఈనాటి కవి, ఈనాటి విమర్శకుడు, ఈనాటి విజ్ఞాని సౌమ్య సామ్యవాది గావచ్చును, ప్రజాస్వామ్యసామ్యవాదిగావచ్చును, తీవ్రసామ్యవాదిగావచ్చును, గాని - సామ్యవాది కాక తప్పదు. ఈ విషయంలో మొన్న మొన్న కాంగ్రెస్ పార్టీ సామ్యవాద తరహా సమాజాన్ని (Socialistic pattern of Society)ని ఆదర్శంగా పెట్టుకోటం గమనింపదగ్గది. ఈనాడు సామ్యవాదం ఒక్కటే అభ్యుదయవాదం.

శ్రీ శ్రీ రచనల శైలి మొదలైన విశేషాలను గురించి చెప్పవలెనంటే చాలా గ్రంథం అవుతుంది. కేవలం ఉదాహరణలు చూపడంతో నే చాలా సమయం పడుతుంది. శ్రీ శ్రీ ఉద్దండ శైలి చూడండి.

"జాతి జాతి నిర్ఘాతపాత సంఘాత హేతువై -
కాలకేతువై."
"కదంత్రొక్కుతూ పదంపాడుతూ హృదంతరాళం -
గర్జిస్తూ."
"అరణ్యమున హరీంద్ర గర్జన, పయోధర ప్రచండ -
ఘోషం."
"ఖడ్గమృగోదగ్ర విరావం- ఝంఝానిల షడ్జధ్వానం"

ఏ మిల్టన్ రచనలోనో, ఏ శ్రీనాథుని రచనలోనో కాని ఈలాటి శైలి మనకు గోచరించదు. అతని సుకుమార పదబంధం ఉదహరిస్తాను.

"నా విసరిన రస విస్ఫుమర కుసుమ పరాగం"
"నే నేయే విచిత్ర శ్యమంత రోచిర్నివహం చూచానా?"
"నను కరగించిన, కవనఘృణీ, రమణీ, కవితా, -
ఓ కవితా."
"నీ మోవికి కావిని నేనై; నా భావికి దేవివినీవై."

ఉపమానం శ్రీశ్రీరచనల్లో శక్తివంతంగా ఉంటుంది. కన్నులముందు కనిపిస్తాయి భావాలు, అతని ఉపమాన బలంచేత, వినండి :

"అతని దీపం ఆ గదిలో మూల నక్కి మూలుగుతున్నది
ప్రమిదలో చమురు త్రాగుతూ పలుదిక్కులు -
చూస్తున్నది
చీకటి బోనులో సింహములా నిలుచున్నది
కత్తిగంటుమీది నెత్తుటి బొట్టులాగున్నది"
"ఆకాశపు టెడారిలో కాళ్లుతెగిన ఒంటరి ఒంటెలా
గుంది జాబిల్లి"

"నేనుసైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను"
శ్రీశ్రీవర్ణనాశక్తి నిరుపమానమైనది. చిత్రణ(Imajery) శ్రీశ్రీ రచనల్లో అత్యున్నతస్థాయి నందుకొన్నది.

వర్ణనాబలంచేత సన్నివేశాన్ని ఎలా కళ్ళకు కట్టిస్తాడో గమనించండి !

"కాలువ నీళులలో జారిపడి - కదలగనైనా జాలని త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, ప్రేలాపన"...
"కడుపు దహించుకపోయే పడుపుకత్తె రాక్షస రతిలో అర్ధనిమీలిత నేత్రాల భయంకర బాధలపాటలపల్లవి"
"ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం"
"ఉన్మాదిమన స్సినీవాలీలో ఘూకంకేకా భేకంబాకా".

ఇంక శ్రీశ్రీ భావుకతనుగూర్చి చెప్పాలంటే 'జగన్నాథ రథచక్రాలు' ఉదహరిస్తే సరిపోతుంది. 'పతితులార, భ్రష్టులార, బాధాసర్పదష్టులార' అని కవి పతితుల్ని భావనాపథంలోచూస్తూ, వారితో అంటున్నట్లుంటుంది. తాను అనుభవించిన అనుభూతులు గనుకనే పఠితల హృదయాలను కదిలింపజేస్తది, లోకం కోసం, పతితులకోసం అతనుపడే వేదన,బాధ, పాఠకునికి అప్రయత్నంగా కన్నీరు తెప్పిస్తుంది. ఇంకో ఉదాహరణ శ్రీశ్రీ రచించిన 'అద్వైతం'. అద్వైతం గీతంక్రింద 'స్విన్‌బర్న్ రచించిన A Match (ఏమాచ్)కి కృతజ్ఞతతో' అనివ్రాశాడు. కాని, పరిశీలిస్తే స్విన్‌బర్న్ గీతం శ్రీ శ్రీ గీతంముందు వెలాతెలాపోతున్నట్లుంటుంది. అతని రచనామార్గాన్ని కొంచెంమాత్రమే శ్రీశ్రీ అనుసరించి చాలాభాగం సొంత పోకడలే పోయినాడు. మచ్చుకి స్విన్‌బర్న్ గీతంలోని ఈ క్రింది భాగం గమనించండి :

"If you were April's Lady
And I were Lord in May
We'd throw with leaves for hours
And draw for days with flowers
Till day like night were shady
And night were bright like day,
If you were April's Lady
And I were Lord in May."

మొదటి రెండు పాదాలనూ ఛాయామాత్రంగా శ్రీశ్రీ,

'వాసంత సమీరం నీవై - హేమంత తుషారం నేనై' అని అనుసరించాడు. కాని తరువాత శ్రీ శ్రీ భావన 'స్విన్‌బర్న్' భావాన్ని పరింతలుగా అధిగమించి ఎలా ప్రవహించిందో చూడండి :

"నీ ఎగసిన జీవ విహంగం నా పగిలిన మరణ మృదంగం చిగురించిన తోటలలోనో, చితులుంచిన చోటులలోనో విలయములై చలించినపుడే వలయములై జ్వలించినపుడే కాలానికి కళ్ళెం వేస్తాం - ప్రేమానికి గాళ్ళెం తీస్తాం!"

భాషాపాటవంలో, భావనా చిత్రణంలో శ్రీశ్రీ ఔన్నత్యం సుస్పష్టం. ఇదివరలో చెప్పినట్లు శ్రీశ్రీ ఏ మిల్టన్‌తోనో, ఏ శ్రీనాథుడితోనో పోల్చవలసిన రచన. 'A Grand idea can be expanded only in a grand style' అన్న వాక్యాన్ని శ్రీ శ్రీ అక్షరాలా ఆచరణలో పెట్టాడు. కేవలం దిఙ్మాత్రంగా ఉదాహరణలు చూపాను. విస్తర భీతివల్ల ఇంతటితో ముగిస్తాను. ఇంకా శ్రీశ్రీ ఆదర్శాన్ని గూర్చి, అతడు దర్శించిన నవసమాజాన్ని గూర్చి చెప్పవలసింది బోలెడంత వుంది.

ఒక్క విషయం చెప్పి ముగిస్తాను. శ్రీశ్రీ ఆంధ్ర దేశంలోనే కాదు; భారతదేశంలోనే అగ్రస్థానానికి చెందిన కవులు కొద్దిమందిలో ఒకడు. అతడు బహుధా వ్యుత్పన్నుడు. ప్రతిభాశాలి. ఆధునిక యుగలక్షణాలను జీర్ణించుకొని, శక్తివంతమైన రచనచేసిన మహాకవి. మహాప్రస్థానం ఆధునికులకు అమరకావ్యంగా నిల్చిపోతుంది. చలం అన్నట్లు "కొద్దిరోజుల్లో నేడు విర్రవీగే కవులు ప్రతి ఒక్కరూ శ్రీశ్రీ నీడక్రింద నించుని తమ ఉనికిని సమర్థించుకోవలసిన గతి వస్తుంది." శ్రీశ్రీ ఫలానా పార్టీవాడు; అందుకని అతని కవిత నాకు నచ్చదు అనటం పరమ సంకుచితదృష్టి. మిల్టన్ రాజకీయాల్లో పనిచేశాడు. జాన్సన్ రాజకీయాల్లో పాల్గొన్నాడు. షా ఫేబియన్ సోషలిస్టు, బైరన్ రాజకీయాలకు అతీతుడు కాదు. అంతమాత్రాన వారి రచనలు అనుపాదేయాలు కాలేదు. ప్రతి కవికీ ఒక దృక్పథం ఉంటుంది. కొన్ని విలువ లుంటాయి. అయితే ఆ దృక్పథం, ఆ విలువలు ఈనాటివా, కావా అనేది ప్రశ్న.

'పిల్ల వసుచరిత్ర'ల్లాగా 'పిల్ల మహాప్రస్థానాలు' బయలుదేరుతున్నవి. తాము చెప్పదల్చుకొన్న దేమీ లేక పోయినా, కేవలం 'గారడీల'తో రచనలు చేస్తున్నారు కొందరు ఆధునికులు. శ్రీశ్రీలాగా వ్యుత్పన్నుడు కానిదే అలా వ్రాయటం కలలోమాట. పేదవాని కన్నీళ్ల మీద రాస్తే చాలదు. అది సామ్యవాదం కాదు. తాను అనుభవించాలి; ఆ అనుభవాన్ని ఇతరులకు అందించాలి. ప్రపంచగతిని అర్థం చేసుకొని, ఆధునిక విజ్ఞానాన్ని పుక్కిటబట్టి, జీవితదృక్పథాన్ని నిర్ణయించుకొని, క్రొత్త విలువల్ని గురించిన నిర్దిష్టమైన దృష్టిని ఏర్పరచుకొని కవిత్వం వ్రాస్తే అప్పుడు శ్రీ శ్రీ 'వలె' వ్రాయటం సాధ్యమేమో! శ్రీశ్రీని అనుసరించదలిచే ప్రతివారూ ఈ విషయం గుర్తించాలి. శ్రీశ్రీ నియమాలు ఉల్లంఘించాడు, మనమూ ఉల్లంఘిద్దామనుకొంటే 'నవాబుదీ బోడి తలే, నాదీ బోడితలే'నని సంతోషించిన వితంతువులాగా హాస్యాస్పదం కావటమే ఫలమవుతుంది. నియమాలు దాటిపోగలిగిన వెల్లువ మనలో కలగాలి. ఆ వెల్లువ లేందే ప్రవాహం మళ్ళీ వెనక్కి - ప్రణయ కవిత్వం లోకీ, ఋతువర్ణనలలోకీ - మళ్ళుతుంది. శ్రీశ్రీ కవిత్వాత్మని గ్రహించాలి. శ్రీశ్రీమార్గం బహు క్లిష్టమైంది. నిజం చెప్పవలసివస్తే శ్రీశ్రీమార్గాన్ని అనుసరించి కృతకృత్యుడైన కవిఒక్కడూ ఇంతవరకూ లేడు!

---

" ప్రజల ఆలోచనల్నీ, అనుభూతినీ, సంకల్పాల్నీ
ఐక్యపరచేదే కళ. "

— లెనిన్.

# తొమ్మిది

"కె. ఎ."

నీతిని సజీవంగా పట్టిచ్చినవారికి పెద్ద బహుమానం ప్రకటించారు
హేతువు జైలు జీవితానికి భయపడి యెక్కడో చాటున తల దాచుకుంది.
సంఘాన్ని సాధించే ఆశయంకార్ల మీద, అవినీతి హాయిగా షికార్లు చెయ్యొచ్చు
మార్పును ప్రతిఘటించటానికి, హేతువు అడ్డమైన వాదనల గడ్డి మెయ్యొచ్చు.

విచ్చలవిడిగా తిరిగే ఆబోతు యేచేలో మేసినా యేమనం మనం
పల్లెల బ్రతుకు నేడు, క్రూరమృగాల కోకిల కూజితాలకు గగుర్పొడిచిన వనం
పోలీసువాణ్ణి తప్పించుకొని ఒక వీధినుండి యింకోవీధికి పోవడమే ఘనం
యిదే రేడియోగారు చెప్పినట్లు, నవాబుగారు తెప్పించి నాటిన నందనం.

పుట్టింటికి పోయిన పెళ్ళాన్ని మళ్లీ కళ్లారా చూసిందాక నమ్మకం లేదు
పండక్కి అత్తవారింటికి వచ్చిన కొత్తపెండ్లికొడుకు, అక్కణ్ణే వీల్నామా రాస్తే మంచిది.
ప్రతి ఊరికి ఉత్తరాన ఒక శ్మశానం ఉంది, అక్కడికి పొయ్యేవాళ్ళు తక్కువ.
పోలీసు ఠాణాకు ఫర్లాంగుదూరంలో చెరువంత గొయ్యుంది; దానిమీద అందరికీ మక్కువ!
చావులు యెక్కువైన తిరణాలను వర్ణిస్తూ, ఒకప్పుడు మరణాల అన్నాను.
తెలంగాణాను వర్ణించటానికి తెలుగులో మాటలు చాలవు; అది 'హెల్' అనుకుందాం
సంప్రదాయవాదులు క్షమించండి, దాన్ని హెలంగాణా అంటున్నాను.

జరిగిన సమస్త సంఘటనలను స్థలాభావం చెప్పనియ్యదు.
అన్నిటికి మిన్నగా ప్రాతినిధ్యం వహించిన ఒక చిన్నకథ చెప్పుకుందాం.
నిరంతరంగా జరిగిన దురంతాల ప్రతినిధిని కథగా పిలవడం తప్పు
ప్రతిమాటనూ తప్పుపట్టటం దేనికిలే, అయినా చూదాం చెప్పు.

ఆ పల్లెలో – పేరు మన కెందుకు? ఏఊరైనా కావచ్చు
పోలీసు వాళ్లు దిగిన రోజున గ్రామ జనాభా రెండునుండి ఆరు వందలకు పెరిగింది.
నాలుగు గవుళ్ళల్లో నాలుగు స్టేషన్లు పెట్టారు
శాంతిభద్రతలు గ్రామంనుండి పారిపోకుండా కాపలా!
రోజులు గడిచాయి నెలలుగా, నెలలు గడిచాయి యేళ్ళుగా
పగలు గడిచింది మృత్యువు కోరల నెత్తురులాగా; రాత్రి గడిచింది కర్ఫ్యూకు ప్రియమైన
నిశ్శబ్ద కాంతను చెరచిన తుపాకుల రణగుణధ్వనితో సుఖంగా పట్టని నిద్రలాగా.

రాత్రి 12 గంటలయింది; పట్టని నిద్రను పట్టుకునే ప్రయత్నంలో
ప్రతివాడు కండ్లు మూసుకునే వేళ; నేను కవిత్వం రాసుకునే వేళ.
దూరాన చాకలి వీధిలో తుపాకులు గాలిలో పేలిన మ్రోత
ఒక గుడిసె కప్పు కొప్పులో సంఘం సూర్యుడి కిరణాలు ప్రసరిస్తున్నట్లు వినికిడి.

పదహారేండ్ల పట్టుచీరె పమిటచెంగుమీద ప్రశ్నల దారాలు లాగుతున్నాడు పోలీసు అధికారి
పమిటచెంగు వదలమని కసరి గద్దించే యువతిని లాలనగా అదిలించే అధికారి
పెదవులమీద చిరునవ్వు లెందుకో! నడుం బెల్టులో చురకత్తి యెందుకో?
నిజం చెప్పితే హింసించ నంటాడు అధికారి – సత్యాహింసల దత్త పుత్రుడు

నీవు నిన్న అడివికి వెళ్ళావని ఋజువు దొరికింది – పోలేదు నేను
వాగొడ్డున జొన్నచేలోకి నిన్ను పిలిచినవా డెవడు?— యివ్వాళె రేవుకు పోలేదు నేను
అధికారి కనుసైగ చేసింది ఆ యువతి తప్ప యెవరూ గుర్తించలేదు
పోలీసులు కొట్టడం మొదలెట్టారు; దేహాన్ని తాళ్ళతో కట్టడం మొదలెట్టారు.
కర్ఫ్యూ అక్కడికి యెవర్నీ రానివ్వదు; అయినా ఆక్రందనల ఆహ్వానాన్ని
హృదయాలు త్రోసెయ్యలేవు
కొద్దికొద్దిగా ప్రజలు చేరారు; బొమ్మల్లా నుంచున్నారు.
నీ నెత్తిమీద ఒక బియ్యంమూట అడివిలోకి చేరింది:-యింట్లో యీ పూటకూడ బియ్యంలేవు
దానికి ఋజువు నీ చెదరిన పాపిట, చిక్కువడిన ముంగురులు – నూనె లేక తల దువ్వలేదు.
అధికారి కనుసైగ చేసింది ఆ యువతికూడ గమనించడం లేదు
పోలీసులు బూట్లతో మొట్టడం మొదలెట్టారు; కాళ్ళమీద లాఠీలతో కొట్టడం మొదలెట్టారు.
ఆక్రందనల ఆహ్వానాన్ని తిరస్కరించలేని గుండెలు యెన్నో నిద్రనుండి లేచాయి
ప్రజలు పెద్ద పెట్టున అక్కడికి చేరారు; బొమ్మల్లా నుంచున్నారు.

చీకట్లో మీకండ్లు చూట్టంలేదా అన్నాడు అందులో ఒక వికర్ణుడు
తరువాత కాలంలో ఉరిశిక్షపడ్డ ఒకా నొక బాలనాయకుడు.
అతణ్ణి పోలీసులు అదిలించారు; అధికారి అందరివంక చూసి అరిచాడు
వెళ్ళిపోండి వెళ్ళిపోండి, అయిదు నిముషాల్లో క్లియర్
తుపాకులు కాలుస్తాం వెళ్ళిపోండి, అయిదు నిముషాల్లో క్లియర్
దేశముఖుల దొరవారు కబురుచేస్తే పోని దెవడు?— ఆయనది మరుద్దేశం
అబ్బో! మహాపతివ్రత అవతరించింది, అయిదు నిముషాల్లో క్లియర్.

పాపాన్ని కండ్లతో చూడలేనివాళ్ళు ప్రాణాలతో సహా వెళిపోయారు
పాపాన్ని చూడదలచుకున్నవాళ్ళు పన్నెండుమంది చచ్చి చూడలేకపోయారు
చావక చూస్తూ నుంచున్న కొద్దిమంది ఏమీ మాట్లాడలేక పోయారు

పోలీసులు గుడిశెలోకి దూరారు; గుడిశెముందు అధికారి యువతిని చెరిచాడు
యెవరూ అక్కడ ఉండకూడదని అరిచాడు; పదహారేండ్ల మానవతి శీలాన్ని కరిచాడు.

ఆ అమ్మాయి అవమానంతో గుడిశెలోకి పోయింది
ఆ అమ్మాయి ఉదయం 6 గంటలకు చచ్చిపోయింది !
ఈ దురంతాలను యెవరూ మీకు చెప్పరు
ఋజువుల పీటముడిని యెవరూ ఎప్పుడూ విప్పరు.

తగాదా జరిగినంతసేపు మన పోలీసులు ఆ వైపుకు పోనక్లే
జీవితం విలువలు మారినచోటికి పత్రికా ప్రతినిధులు పోరు
ఒకవేళ వచ్చినవారైనా గ్రామాల జోలికి పోరు
ఒకవేళ పోయినా నిజంగా విన్నదీ కన్నదీ నిర్భయంగా రాయలేరు.

# ప ది

పోలీసులు అఘాయిత్యాలకు దాసులు; దురాలోచనా సముద్రతీరవాసులు
అధికారుల దౌర్జన్యాలకారులమీద ప్రతి సాయంత్రం బీచికి షికారుపోతారు.
మనుషుల ప్రాణాలమీద యిప్పుడు వారికి పూర్తిగా అధికారం ఉంది; కారణం లేనిచోట
గ్రామసీమలు సంఘంతో షరీకు అంటేచాలు; రాసినబిల్లు ప్యాసవుతుంది.
ప్రతినెలా జీతం వస్తుంది; ప్రమోషన్ వస్తుంది; ఏ యింట్లో దేవులాడినా
నిషిద్ధ సారస్వతంపెట్టించొచ్చు; పట్టించొచ్చు; యజమానిని కొట్టించొచ్చు.

కోటిజనుల కడుపులో ఆకలిమంటలు చాచిన నాలికలకు
వాటిమీద దౌర్జన్యాల నేతిబానలు కుమ్మరించిన యేలికలకు
యేమూలచూసినా చుక్కెదురు; రాజులు రంగప్పలమీద అనుగ్రహంగా ఉండే మోజు
సంఘంలో మరగ్గాసిన చర్చలనుండి తెలివి మూత తెరవగానే ఆవిరిగా లేచిపోయింది.
ఇప్పుడు రాజులు, నవాబులు, అడుగునుండి పాచిపట్టిన గాబులు
ప్రజల దూరపు చూపులకు ఆగరు, అందులో నీళ్లు పశువులుతప్ప యెవరూ తాగరు.

ఒకవేళ ఊళ్ళన్నీ నిప్పుపెట్టినా బహుశా ఉద్యమాలు కాలవు
కోటిగొంతులకు గురిపెట్టడానికి బహుశా ఆయుధాలుచాలవు
కోటిగొంతులకు ఉరిపెట్టడానికి బహుశా ఉచ్చుతాళ్ళు చాలవు.
కోటి కోరలుచాచిన ఆకాశ చీకటిరాకాసి బ్రతుక్కు వెలుగివ్వలేదు
కోటిచారల దౌర్జన్యం పెద్దపులి బ్రతుకును యెంతోకాలం భయపెట్టలేదు.
అయినా ఆయుధం ప్రయత్నం మానదు; ఉరితాళ్ళ యెదురీత కానదు
కోరల కోర్కెలు మానవు, పులిచారల నేరాలు శాంతిని కోరవు.

జరిగిన సమస్త సంఘటనలను విస్తరభీతి రాయనివ్వదు
ఉదాహరణకు ఒక మెతుకుతో ఉడుకు కనుక్కోవచ్చు అన్నంలో
ఈ కథ—క్షమించాలి, దురంతం జరగడానికి కారణం, తిరగేసి తోడుక్కున్న ఆలోచనలచొక్కా—
దేశముఖుల దొరవారు అధికారం మంత్రిగారితో, ఆలోచించారు చూడండి, ఎంచక్కా—!

ఆ పల్లెలో – పేరు మన కెందుకు? – ఏ ఊరైనా కావచ్చు
నేలగోజులనుండి సూర్యుడు ప్రతి ఉదయం పొడుస్తున్నట్టె
ప్రతిరాత్రి దాక్కుంటున్నట్టె, ప్రజలకు కనపడుతున్నట్టె
ప్రజల్లాగా రాత్రికూడా సూర్యుణ్ణి కనికరించి దాచేస్తున్నది
అధికారం మెదడు గదుల్లో బంధించినా, చీకటికి సిగ్గురాలేదు.

ఆ పల్లెలో – పేరు మన కెందుకు? – ఏ ఊరైనా కావచ్చు
ప్రతివాడిమీద సూర్యుడి వెలుగులు ప్రసరిస్తున్నాయట
ప్రతివాడికి రాత్రి, యుద్ధం ప్లానులు రాసిస్తుందట
రాత్రిలాగా ప్రజలుకూడా సంఘంతో నిత్యం సహకరిస్తున్నారు
అధికారం యెక్కినపల్లకీ మోయించినా, ఋషులకు సిగ్గురాలేదు.

గ్రామంలో మంటపెడితే అడివి సూర్యుడు యెలుగుబంటిలా పారిపోవచ్చు
సంఘంతో సహకరించే చీకటి కాలిపోవచ్చు; గ్రామంరోడ్లు వెడల్పుగావచ్చు
కొత్త మేడలు లేవొచ్చు, కొత్తజనాభాను తేవొచ్చు, అధికారం హాయిగా నిద్రపోవచ్చు
అధికారం ఆలోచన అంగీకరించిన దేశముఖ్ సూచన ఆ రాత్రి అమల్లోకి తేవొచ్చు.

రాత్రి 12 గంటలయింది, పట్టని నిద్రను పట్టుకునే ప్రయత్నంలో
ప్రతివాడు కండ్లు మూసుకునేవేళ – నేను కవిత్వం రాసుకునేవేళ.
దూరాన పూరిగుడిశెలు కాలిపోతున్నై; గ్రామం నాలుగుదిక్కుల మంటలు
దేశముఖు దొరవారు విడిచిన నిట్టూర్పు గాలికి పండగ్గా ఉంది.
సంఘంతో పరీక్షై ఆకాశంలో గాలి స్తంభించింది; అయినా అగ్ని ఆరే సూచనలేదు
అక్కడికి ఫైరింజన్లు రావు; యిసుకగోతాలు లేవు.
గ్రామాన్ని పూర్ణవలయంగా చుట్టేసిన పోలీసులు కాపలా కాస్తున్నారు
మానవుడి తీరని కోరికలు, తారకలు, దౌర్జన్యాన్ని వేయికండ్లతో చూస్తున్నై
గ్రామంచుట్టూ పెద్ద బండిగానంత సున్నా; అధికారానికి తుదివిజయం సున్నా!
ఎంతమంది యేరీతిగా అనుకున్నా, దౌర్జన్యానికి పరిమితులు ఎన్నిఉన్నా
గ్రామంలో యే యిల్లు మిగల్లేదు, పోలీసుల గుండెలు పగల్లేదు.

నిద్రించే నిండుచూలాలు చూసే సరికి, గదితలుపు బైట గడివేసి ఉంది
ఉయ్యాల్లో పసిపాప లేచేసరికి, మంటలు తాళ్ళను కొరికేశాయి

గాట్లో మండుతున్న నేలమీద యెద్దు కాలుపడి కాలింది
యెంతకూ తెగని పలుపును యెలాగో లాగేసుకుని పాడిబర్రె బజారున పడింది.
బైటికి పరిగెత్తిపోయిన యువకులను కర్ఫ్యూ కాల్చేసింది
బైటికి పరిగెత్తలేని వృద్ధుల్ని బలహీనత కాల్చేసింది.
పెట్టే, బేడా సర్దుకొని బైటేసుకుని, బీర్వాలో తాళంచెవికోసం పోయిన
సాహసికుడు, సగంకాలిన దేహంతోనైనా రాలేక నేలకొరిగాడు.
చనిపోయిన ప్రక్కయింటి వాళ్ళను నిద్రలేపే హడావిడిలో ముసలమ్మ మూర్ఛపోయింది.
నట్టనడి రాత్రిలో సంఘం సూర్యణ్ణి పట్టుకొను ప్లాను వేసిన పోలీసులకు
యింతకూ దర్శనం దొరకలేదు; ఎలాగో తప్పుకున్నాడు కాబోలు!
ఆరాత్రి పోలీసుస్టేషన్ని కాల్చిన దోపిడి ముఠాల నాయకుల్ని
ఉదయం పత్రికలు మొదటి పేజీలో ప్రముఖంగా నిరసించాయి.
ఎన్నికలకు ముందుగా తయారవుతున్న ఒకానొక నాయకుడు
తక్షణం ఒక పత్రికా ప్రకటన దేశంమీద విసిరేశాడు.

దేశముఖు దొరవారు బస్తీకి మకాం యెత్తేశారు
ఉండటానికి యిల్లులేని ప్రజలంతా అడివిలో చెట్లకింద మకాం చేశారు.

దూరాన కాలనికాలం గడియారంలో కోడి మూడై కూసింది
కాలుతున్న చెట్ల కొమ్మలు అసమ్మతి ప్రదర్శనాలు చేశాయి.
గుడిశెల గుండెలమీద మంటలు - యింకా రెండు గంటలు!
ప్రభాతం బంగాళాఖాతం వెండికొండమీద పుడమితల్లి ప్రసవిస్తుంది
ప్రభాతం పసిడివెలుగు సరికొత్త సమాజా శిశువునుచూసి మురుస్తుంది.
భూమిమ్మీద హిమకణం ధరించిన ప్రతి గడ్డిపోచా వెలుగు కిరణాలుపడి మెరుస్తుంది
ఇంకా రెండుగంటలు—ప్రభాతం!

నిలువనీడలేని మర్రిచెట్టు మోడులు నేడు జనం
కాలి పొడుగ్గా సాగిన ఉక్కు ఊచనాడులు నేడు జనం
క్రమక్రమంగా పెరిగిన సాయంత్రం నీడలు నేడు జనం.

"తెలంగాణా కావ్యం"నుండి

# ఆంధ్ర సంస్కృతి - దాని విశిష్టత

యేటుకూరి బలరామమూర్తి

ఒకజాతి పరిణామంలో అంతర్గర్భితమై ఉండే సామాన్య లక్షణం సంస్కృతి. ఆర్థిక రాజకీయ సాంఘిక వ్యవస్థలలో జరిగే మార్పులు, ఆచారాలు, కట్టుబాట్లు, సాహిత్యం, మనస్తత్వం - ఇవన్నీ కలిసి, కాలక్రమేణ ఒక్కొక్క జాతికి ఒక్కొక్క విశిష్టతను కలిగిస్తాయి. ఆ విశిష్టతే ఆ జాతి సంస్కృతి. భారతీయ సంస్కృతి అనే జీవనదిలో వివిధ రాష్ట్రీయ సంస్కృతులు ఉపనదుల లాంటివి. ఆంధ్ర సంస్కృతి విశిష్టతను శ్లాఘిస్తున్నామంటే. ఇతర భారతీయ జాతుల సంస్కృతులపై చిన్నచూపు చూస్తున్నామని అర్థంకాదు. ఆంధ్రసంస్కృతికి ఇతర ఉపజాతుల సంస్కృతులకు గల పరస్పరసంబంధాన్ని ఇచ్చి పుచ్చుకోవటాన్ని, మనం గుర్తిస్తున్నాము, గౌరవిస్తున్నాం. ఏకత్వంలోగల అనేకత్వాన్ని సామాన్యతలోగల ప్రత్యేకతను అర్థంచేసుకోవాలి. ఆంధ్ర సంస్కృతి విశిష్టతను గమనించినపుడే సమగ్ర భారతీయ సంస్కృతికి మనమెంతగా దోహదం చేశామో ఇకముందు చేయగలమో గ్రహించగలము. ఇతర సంస్కృతుల నుండి మనం ఏమంచిని స్వీకరిస్తూ వచ్చామో ఇక ముందుకూడా ఏది స్వీకరించవలెనో తెలుసుకోగలము.

## బౌద్ధ యుగం

క్రీ.పూ. 300 నుండి క్రీ.శ. 250 వరకు ఆంధ్రులు శాతవాహన యుగంలో జీవించారు. ఇది బౌద్ధయుగం. ఆంధ్రదేశంలో హిందూ బౌద్ధమతాలు ఆనాడు ఒకదాని ప్రక్కన మరొకటి వర్థిల్లాయి. శాతవాహన రాజులు ఒకచేత్తో బౌద్ధభిక్షువులకు మరొకచేత్తో వైదిక కర్మలకు ప్రోత్సాహమిచ్చారు. ఈ కాలంలోనే, అమరావతి, నాగార్జునకొండ, ఘంటసాల, వేంగి, కొండాపురం, ఫణిగిరి, పైఠాన్ మొదలైన నగరాలు, ఆంధ్ర సంస్కృతీ కేంద్రాలుగా విలసిల్లాయి. మత సామరస్యం, ఆంధ్ర జాతికి ఉగ్గుబాలతో అలవాటైంది. కులభేదాలు నామమాత్రంగా ఉండేవి.

బౌద్ధుల సాహచర్య ఫలితంగా, కర్మకాండ పూరితమైన హిందూ మతంలో ప్రేమ, కరుణ, భూతదయ, సమానత్వ భావాలు ప్రవేశించాయి. హిందూమత సాహచర్య ఫలితంగా, బౌద్ధ తాత్విక సిద్ధాంతాలు మార్పుచెందాయి. బౌద్ధమతం మూల స్వరూపాన్ని కోల్పోయి, హిందూమతంలో ఒక అంతర్భాగంగా రూపొందింది. బౌద్ధమతం నశించింది. కాని బౌద్ధ సంస్కృతీ చిహ్నమైన విశ్వమానవ సౌభ్రాతృత్వభావం హిందూ సంస్కృతిలో అంతర్భాగమైంది.

## శిల్ప చిత్ర కళలు

ఈ కాలంలో ఆంధ్రశిల్ప, చిత్రకళలు అత్యున్నత స్థాయినందుకున్నాయి. అమరావతి బౌద్ధస్తూపం. దక్షిణ భారతంలోని అతిప్రాచీనబౌద్ధస్తూపాలలో యిదిఒకటి. ఇది అశోకునికి ముందే క్రీ. పూ 300 ప్రాంతంలో నిర్మించబడి క్రమంగా పెంపు చేయబడినది. ఆంధ్ర శిల్పుల నైపుణ్యమంతా అమరావతిలో ప్రదర్శితమైనది. కొన్ని అంగుళాల స్థలంలో, అతిలలితమైన, సుకుమారమైన హావభావములను ప్రదర్శించే, స్త్రీ పురుష విగ్రహాలు, ఆంధ్రశిల్పుల హస్త కౌశల్యానికి తార్కాణములు. అమరావతి శిల్పకళ, నాగార్జునకొండకు, ఆంధ్రలోని ఇతర బౌద్ధస్తూపాలకు మాత్రమేగాక, అజంతా ఎల్లోరాలోని శిల్ప, చిత్రకళలకు కూడ మాతృక. బౌద్ధ శిల్పకళలో రెండు శాఖలుండేవి. ఒకటిగాంధారశిల్పం. రెండవది ఆంధ్రశిల్పం. గాంధారశిల్పం, పశ్చిమోత్తర రాష్ట్రాలలో గ్రీకు శిల్పులచే ప్రారంభించ బడినది. అందులో విస్తృతి హెచ్చు. కాని కౌశల్యం తక్కువ. పెషావరు, కాశ్మీర్ లలోను, ఆఫ్ఘనిస్థాన్ కొండలలో గల బ్రహ్మాండమైన బుద్ధుని విగ్రహాలు నిలువెత్తు బొమ్మలు - గాంధార శిల్పానికి చిహ్నాలు. ఆ విగ్రహాలఎత్తు పొడుగులను చూచి మనం దిగ్భ్రాంతుల మౌతాము. కాని ముఖ భంగిమలలో ఒక దానికొకటి నమూనాయేతప్ప వానిలో వైవిధ్యం తక్కువ.

ఆంధ్ర శిల్పం ఇందుకు విరుద్ధం. కొన్ని అంగుళాల లేక కొన్ని అడుగుల రాతిముక్క ఆంధ్రశిల్పికి చాలు. ఆ కాస్త స్థలంలోనే, బొమ్మనుచెక్కి, వివిధ ముఖభంగిమలను అచ్చుగుద్దినట్లు ఆంధ్రశిల్పి చూప

గలదు. అమరావతి నాగార్జునకొండ శిల్పాలే ఇందుకు తార్కాణం.

మరొక విశిష్టతకూడా ఉంది. గాంధార శిల్పంలో సూచనలేదు. ప్రతిదీ విడమర్చి చెప్పడమే వారిపద్ధతి. లుంబినీవనంలో మాయాదేవి బుద్ధుని ప్రసవించినట్టు గాంధారశిల్పి చెక్కాడు. మాయాదేవి ఊరువుల మధ్య నుండిశిశువుకొండరు బైటికిలాగుతున్నట్లుచూపించాడు. అందులో సహజత్వం ఉండవచ్చు. కాని సౌకుమార్యం సూచన, సంస్కారం లేవు. ఆంధ్రశిల్పి ఇదే దృశ్యాన్ని మరొకవిధంగా చెక్కాడు. మాయాదేవి ప్రసవవేదన పడుతూ, ఒక చెట్టుపై వెనుకకు తిరిగి వంగి వుంటుంది. ఆపక్కనే దేవతలు ఒక వస్త్రాన్ని చేతులలో ధరించి ఉంటారు. అంతే. శిశురూపంలో బుద్ధుని బొమ్మలేదు. అది ప్రేక్షకుడు ఊహించుకోవాలి. ఊహించుకోగలడు. ఆంధ్రశిల్పి సంస్కారానికి నిదర్శనం. పై చిత్రం నాగార్జునకొండ శిల్పసముదాయంలో ఒకటి. అజంతా చిత్రాలు అమరావతికి అనుకరణ. ఎల్లోరా శిల్పాలు గాంధార శిల్పానికి అనుకరణ.

## సాహిత్యం

బౌద్ధయుగంలో ఆంధ్రభాషలో సాహిత్యంలేదు. ఉన్న సాహిత్యమంతా ప్రాకృతంలోనే ఉంది. బృహత్కథ, శాలివాహన గాథాసప్తశతినాటి సాహిత్య సృష్టికి తలమానికములు. బృహత్కథ భారతీయ సాహిత్యానికి పెన్నిధి. నశించగా మిగిలిన ఈబృహత్కథలో 18 అధ్యాయాలూ, కొన్ని వందల కథలూ ఉన్నవి. రాజుల కథలు, ప్రజల గాథలు, వ్యాపారస్తుల కష్టాలు, స్త్రీల సమస్యలు, మూఢ నమ్మకాలు, ఆచారాలు, నాటి సామాజిక జీవితమంతా కథ రూపంలో ఈ గ్రంథంలో ప్రతిబింబిస్తుంది.

సాహిత్య విలువల దృష్ట్యా ఇంతకంటె ఉన్నతమైనది గాథాసప్తశతి. 300 పైచిలుకు కవుల పేర్లు, వారి రచనలు ఇందులో ఉన్నాయి. వీరిలో 20 మందివరకూ స్త్రీలు. ఒక్కొక్క కవి, కవయిత్రి ఒక్కొక్క 'గాథ' చెప్పారు. ఈ గ్రంథమంతా జానపద శృంగారమయం. లాలిత్యా, సౌకుమార్యంతో కూడిన శృంగారమే ఈ గాథలలో ప్రధానాంశం. నాటి ప్రజల సంస్కృతికి, ఈగ్రంథం చక్కని నిదర్శనం. ప్రాకృత గ్రంథమైనా యిందులోకి కొన్ని తెలుగుమాటలు అత్త, పత్తి మొదలైనవి ప్రవేశించాయి.

## తాత్త్విక రంగం

అఖిల భారత ఖ్యాతి మాత్రమేగాక, ఖండాంతర ఖ్యాతిగాంచిన అనేక బౌద్ధ తాత్త్వికులు నాడు ఆంధ్రంలో జీవించారు. ఆచార్యనాగార్జునుడు, దిఙ్నాగుడు వీరిలో ప్రముఖులు. నాగార్జునుని మాధ్యమిక వాదకారిక, ప్రజ్ఞాపారమిత బౌద్ధసాహిత్యంలో విశేష ఖ్యాతిని పొందాయి. దిఙ్నాగుని లంకావతారసూత్రం విజ్ఞానవాద బౌద్ధానికి సిద్ధాంతగ్రంథం. వీరిద్దరు కాక భావవివేకుడు, బుద్ధపాలితుడు - తదితరులూ నాడు జీవించారు. నాగార్జునుడు క్రీ. శ. 150-200 మధ్య నాగార్జునకొండవద్ద, దిఙ్నాగుడు క్రీ. శ. 400-500 మధ్య వేంగిలోను జీవించారు.

నాగార్జుడు తాత్వికుడు మాత్రమేకాదు. వైద్య రసాయన శాస్త్రాలలో అఖండుడు. క్రీ. శ. 700లో జగ్గయ్యపేటవద్ద జీవించిన సిద్ధనాగార్జునుడు, రసవాదానికి మూల పురుషుడు.

## వివిధ తెగల సమ్మేళనం

బౌద్ధయుగంలో ఇంతకంటే ప్రధానమైన సాంఘిక పరిణామాలు జరిగాయి. ఆంధ్రులు ఉత్తరాది నుండి దిగివచ్చిన ఆర్యశాఖ. అంతకుముందే ఆంధ్రదేశంలో నాగ, యక్ష, తెనుగు ప్రజలు జీవిస్తున్నారు. ఆంధ్రులలో ఆనాటికే వర్ణవ్యవస్థ బలహీనంగా అయినప్పటికీ ఉన్నది. నాగ, యక్ష, తెనుగు ప్రజలలో వ్యవస్థలేదు. ఆంధ్రులు వైదికమతానుయాయులు. నాగ, యక్ష తెగలు భారతదేశంలో అందరికంటే ముందు బౌద్ధ మతాన్ని స్వీకరించిన ప్రాచీన తెగలు. తెనుగు ప్రజలు ద్రావిడ నాగరికతా చిహ్నమైన ఆదిశైవమతస్థులు. వేర్వేరు మతాలు, ఆచారాలు, కట్టుబొట్లుగల ఈ తెగలన్నీ బౌద్ధయుగంలో కలసిపోయినవి. అంతర్వర్ణ వివాహాలు సర్వసామాన్యమైనవి. బౌద్ధసంస్కృతి బోధించిన సమానత్వ బోధలు ఈ పరిణామానికి మరింత దోహదం చేశాయి. శాతవాహన యుగం అంతమయ్యే సమయానికి తెగలు తమ మూలస్వరూపాలను పోగొట్టుకొని, ఒకేఆంధ్ర జాతి రూపొందసాగినది.

ఏఏ దేశాలనుండి ఎవరెవరు వచ్చినప్పటికీ వారి నందరినీ తనలో యిముడ్చుకొని, వారిని తనవారిని చేసుకొని, భేదభావంలేక, హెచ్చు తగ్గులులేక స్వీకరించటం భారత జాతిలోనే గల విశిష్టత. ఇది ఆంధ్రజాతి పరిణామంలో మరింత స్పష్టంగా ద్యోతక మౌతున్నది.

ఆంధ్రభాష పరిణామం సైతం పై విషయాన్నే స్పష్టంచేస్తున్నది. తెనుగుభాష అతిప్రాచీనమైనది. ద్రావిడభాషా కుటుంబమునకు చెందింది. ఆంధ్రుల భాష దేశి. ఇది బ్రాహ్మీ కుటుంబమునకు చెందినది. బ్రాహ్మీ, ద్రావిడభాషా కూటములకు సామ్యము హెచ్చు. కనుకనే కాలక్రమేణ, తెనుగు, దేశిమిళిత మైనది. తద్భవ, తత్సమ పదములను సంస్కృతం నుండి తెలుగుభాష స్వీకరించింది. అన్యభాషా సంపర్కము ఏమాత్రమూ పనికిరాదన్న ధోరణి మొదటినుండీ మనకు లేదు. ఈ విషయంలో తెనుగు, తమిళము కంటె భిన్నము. ఒక్కొక్కప్పుడు సంస్కృతిపాలు హెచ్చి వికారాన్ని కలుగజేసినా, తెనుగు భాషమూల స్వరూపము చెక్కుచెదరక దినదినాభివృద్ధి పొందుతున్నది.

బౌద్ధయుగంలో వర్తక వాణిజ్యాలు మహోజ్జ్వలంగా వృద్ధిచెందాయి. తెలుగు నావికులు సుమారు ప్రాంతాలకు పయనించారు. గ్రీకు, రోమన్ నావికులు తెలుగు గడ్డతో వ్యాపారం చేశారు. సింహళం, మలయా, ఇండోనేషియా, బర్మా, ఇండోచైనాలకు భారత సంస్కృతిని చేరవేసినవారిలో ఆంధ్రులు ప్రథమగణ్యులంటే అతిశయోక్తిలేదు. విశ్వమానవ సౌభ్రాతృత్వంనాటి ఆంధ్రుల విదేశాంగనీతికి మూలం. ఆంధ్రులు ఏదేశానికీ విజేతలుగా వెళ్ళలేదు. కనుకనే ఇతరదేశస్థులు వారిని చిరకాలానికి వచ్చిన బంధువులను ఆహ్వానించినట్లు ఆహ్వానించారు. విదేశస్థు లనేకులు తెలుగుగడ్డపై స్థిరపడ్డారు. శక,పహ్లవ, హూణ ప్రజలు కొందరు ఆంధ్రులలో కలిసిపోయారు.

బౌద్ధయుగం అంతరించింది. మత సామరస్య ధోరణిలో నడచిన ఆంధ్ర సంస్కృతిలో అంతర్వైరుధ్యాలు పొడసూపినవి. బానిసవిధానం అంతమై అర్ధబానిసవిధానమైన స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థ స్థిరపడ్డది. బౌద్ధమతంయొక్క చారిత్రక ప్రయోజనం అంతరించింది. అందులో శిథిల, శీర్ణ లక్షణాలు ప్రవేశించాయి. బౌద్ధమతాన్ని అణచివేసి కులవ్యవస్థను కఠినతరంచేసిన పల్లవ, విష్ణుకుండిన, వాకాటకరాజులు ఆంధ్రును పాలించసాగారు.

## హిందూ యుగం

ఇది మత విద్వేష యుగం. బౌద్ధ ఆరామాలు ధ్వంసమైనవి. వానిస్థానంలో శైవవైష్ణవ దేవాలయాలు వెలసినవి. బౌద్ధభిక్షువులు నిలవ నీడలేక, విదేశాలకు బయలు దేరారు. బ్రాహ్మణులకు సంస్కృతభాషకు ఆదరాభిమానాలు హెచ్చాయి. వైదిక కర్మకాండకు ప్రోత్సాహం పెరిగింది.

ఈ ఘర్షణలో తెలుగు భాషకొంత పైకివచ్చింది జనాశ్రయఛందోవిచ్ఛిత్తి అను కావ్యం విష్ణుకుండిన మాధవవర్మ కాలంనాటిది. (క్రీ. శ. 500) నాటికే తెలుగులో కంద, గీత, సీస పద్యాల రచన ఉన్నట్లు పైగ్రంథం తెలియజేస్తున్నది.

నిష్ఠితకర్మకాండ ప్రబలమైంది. పూర్వ మీమాంసా భాష్యకారులైన, కుమారిలభట్టు, ప్రభాకర పండితుడు ఇద్దరూ ఆంధ్రులు. (క్రీ. పూ. 600-700) ఆంధ్రలోని అగ్రహారాలలో యజ్ఞ యాగాదుల మోజు హెచ్చింది. ప్రజాసామాన్యం వైదిక కర్మకాండలను ఏవగించుకున్నారు. ప్రజలలో జైనమతం వ్యాపించింది. వైదిక - జైన మతాలమధ్య ఘర్షణ కాకతీయ యుగం వరకూ సాగింది.

మత విద్వేష ప్రధానమైన వీరశైవ మతం కన్నడ దేశంలో పుట్టింది. ఉప్పెన వలె ఆంధ్ర దేశాన్ని ఆవరించింది. (క్రీ. శ. 1100 – 1200) జైనులు హత్య చేయబడ్డారు. జైన దేవాలయాలు ధ్వంసమయినాయి. జైనులను రాజద్రోహులుగా జమ కట్టారు. కాని ఈ జైన శైవ ద్వేషం కన్నడదేశంలో అంతటి తీవ్రరూపాన్ని ఆంధ్రలో ధరించలేదు. జైన శైవ కలహాల ఫలితంగా పశ్చిమ చాళుక్యుల రాజధాని కళ్యాణి సర్వనాశనమైంది. ఆ ఉరవడి, తీవ్రత ఆంధ్రలోకి వచ్చేప్పటికి కొంత తగ్గింది.

దక్షిణ దేశంలో భక్తి ప్రధానమైన వైష్ణవంపుట్టి ఆంధ్రలో అడుగుపెట్టింది. పల్నాటి బ్రహ్మనాయుడు వీరవైష్ణవానికి ప్రారంభం చేశాడు. ఆంధ్రులు, పరమ శివునివలె, వీరశైవంలోని ద్వేషతీవ్రతను, వైష్ణవంలోని భక్తి తన్మయత్వాన్ని, రెంటిని, కంఠం వరకూ మాత్రమే పోనిచ్చారు. జీర్ణకోశంలోకి ఈ రెండు తీవ్రధోరణులు ప్రవేశించలేదు. బౌద్ధ సంస్కృతీ చిహ్నమైన సామరస్య సహనధోరణులు ఆనాటికీ అంతర్గర్భితంగా ఆంధ్రజాతి రక్తనాళాలలో ప్రవహిస్తూనే ఉన్నవి.

ఇతర ప్రాంతాలనుంచి, రాష్ట్రాలనుంచి, తెగలు, వంశాలు, ప్రజలువచ్చి ఆంధ్రలో స్థిరనివాసం ఏర్పరచుకోవటం ఈ యుగంలోనూ సాగింది. పశ్చిమరాష్ట్రాల నుండి చాళుక్యులు వచ్చి, తూర్పు చాళుక్యులైనారు. ఆంధ్రదేశాన్నే తమజన్మభూమిగాభావించి కీర్తించారు.

"జన్మభూమిః చాళుక్యానాం దేశో వేంగీతి విశ్రుతః" దేశాభిమానానికి బీజాలు ఏర్పడ్డాయి. ఆంధ్రులు ఉత్తర హిందూస్థానంనుంచి దిగి వస్తూ మైకాలలో కొంతకాలం నిలచి ఆపైన ఆంధ్రలోకి అడుగు పెట్టటంతో మహారాష్ట్ర ఆచారాలు అనేకం ఆంధ్రలో ప్రవేశించాయి. తూర్పు చాళుక్యుల రాకతో, కన్నడ మహారాష్ట్ర సాంప్రదాయాలు, ఆచారాలు మరికొన్ని వచ్చాయి. వీటన్నిటినీ ఆంధ్రజాతి జీర్ణం చేసుకున్నది. ఇందువల్ల మనకు నష్టం కలగకపోగా లాభమే కలిగింది.

ఇదేవిధంగా చోళులు అను మరొక ప్రజా సందోహము ఆంధ్రలోకి అడుగు పెట్టారు. వీరిపూర్వపురుషుడు కావేరినదికి ఆనకట్టకట్టిన ప్రజారంజకుడైన కరికాల చోళరాజు (క్రీ. శ. 300-400) తెలుగు చోళులు తమిళ సరిహద్దులనుండి ఏనాడో రాయలసీమలోకి ప్రవేశించారు. రాయలసీమ, నెల్లూరు జిల్లాలలో వారు చాలకాలం పరిపాలించారు. వీరితో తమిళ నాగరికతా చిహ్నాలు అప్పటి అద్వైతమతం ఆంధ్రలో ప్రవేశించాయి. తెలుగు చోళులు సార్థక నామధేయులు. వీరికి తెలుగుభాషాభిమానం హెచ్చు. మొట్టమొదటి తెలుగు శాసనం రేనాటిచోళుల పరిపాలనలో కడపజిల్లాలో క్రీ. శ. 500 లు ప్రారంభంలోనే వెలిసింది. వీరు రాయలసీమనుండి మెల్లగా పైకెగబాకి, కృష్ణనుదాటి నల్లగొండ, మహబూబ్‌నగర్ జిల్లాలకు వ్యాపించారు. అప్పటినుండి తిరిగి కృష్ణా-గుంటూరుజిల్లాలలోకిఅడుగుపెట్టి వెలనాటి చోళులను పేరుతో కొంతకాలం పరిపాలించారు. అప్పటి వారిప్పటికి, ఇప్పటి వారప్పటికి, తరలిపోవటం వల్లనే సర్కారు రాయలసీమ తెలంగాణా ప్రాంతాలు ఒకదానితో మరొకటి పెనవేసుకు పోయినవి. తమిళ సంస్కృతిలోని మంచిని చోళులు, కన్నడ మహారాష్ట్ర సంస్కృతిలోని నిగ్గును చాళుక్యులు తెచ్చి ఆంధ్ర సంస్కృతిని పరిపుష్టిచేశారు. ఈ పునాదిపై కాకతీయ రాజ్యం ఆవిర్భవించింది.

## నన్నయ, తిక్కనల సాహిత్యసృష్టి

కొన్ని ప్రాంతాలలో మతకర్తలు సంస్కృతీ పరిణామంపై గొప్ప ప్రభావాన్ని కలిగించారు. ఆంధ్రలో, బౌద్ధయుగం తర్వాత, అఖిలభారత ఖ్యాతి గాంచిన మతకర్త లెవ్వరూ పుట్టలేదు. త్రిమత స్థాపకులు, కన్నడ, కేరళ, తమిళ దేశాలలో ఉద్భవించారు. ఆంధ్ర సంస్కృతిపై మతకర్తల ప్రభావంకంటే, సాహితీపరుల ప్రభావం హెచ్చు. నన్నయ, తిక్కన లట్టివారు. ఇది ఆంధ్రజాతి విశిష్ట లక్షణాలలో మరొకటి.

ఆంధ్ర మహాభారతం, వందలాది తెలుగు కావ్యాలకు, గ్రంథాలకు ప్రారంభమైంది. శైవ వైష్ణవ ద్వేషాలను నిరసించి, మత సామరస్యధోరణిని కలిగించింది. మత విభేదాలకంటె, మానవ ప్రవృత్తి పరిశీలన ప్రధానమని చాటిచెప్పింది. ఇతరత్రా అత్యంత ప్రతిభావంతులైనవారు, ధర్మపరులైనవారు సైతం, అతి తీవ్రమైన రాజ్యలోభానికి దాసులైనపుడు, ఎలా సర్వనాశనం జరిగేదీ వివరించింది. సమగ్రజీవితంలో, మతం, నీతి, అధికారం, ధర్మం, అన్నీ వేర్వేరు విభాగాలనీ, ఏ ఒక్క విభాగానికో విశేష ప్రాధాన్యమివ్వరాదని భారతగాథ బోధచేసింది. బౌద్ధయుగానంతరం తలఎత్తిన మత విద్వేష పిశాచాన్ని పరిహరించి, తిరిగి ఆంధ్రజాతికి నూతన పద్ధతిలో సమ్యక్ దృష్టిని నిగ్రహాన్ని, స్థిమితత్వాన్ని కలిగించింది.

ఈ పునాది 500 సంవత్సరాల పాటు కొనసాగింది. ఈ పునాదిపైననే కాకతీయరాజ్యం, రెడ్డిరాజులు, విజయనగర సామ్రాజ్యం నిలవగలిగినవి. ఆంధ్రజాతి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను పీల్చింది. ఈ కాలంలో యుద్ధాలు లేకపోలేదు. జననష్టం జరగక పోలేదు. కాని అవి ఏవీకూడా, సంస్కృతీ పరిణామాన్ని, సాహిత్యసృష్టిని, కళావిర్భవాన్ని ఆటంకపరచలేదు. కాకతీయ కళావైభవానికి, ఓరుగల్లు, పానుగల్లు రామప్పగుళ్లు చిహ్నాలుకాగా, రెడ్డిరాజుల సాహిత్యాదరణకు శ్రీనాథుడు, తార్కాణం. వీరందరినీ మించిన బమ్మెర పోతన, తన భాగవతంద్వారా ఆంధ్ర ప్రజలలో భాషాభిరుచిని, భక్తిభావాన్ని కలిగించాడు.

ఇదే కాలంలో వ్యాప్తిచెందిన వీరశైవ వాఙ్మయం, ప్రజలకు సన్నిహితంగాఉండే అనేక సాహిత్య రూపాలను స్వీకరించింది. కాని సంకుచిత మతాభిమానం, పరమత ద్వేషం - వీరశైవ వాఙ్మయానికి ప్రాతిపదిక కావటంవల్ల, భారత, భాగవతాది గ్రంథాలు ఆంధ్ర సాహిత్యంలో పొందిన స్థానాన్ని అది పొందలేక పోయింది. మానవత్వం, కరుణ, సహనం, వాస్తవికత - సాహిత్యానికి శాశ్వతత్వం ఇవ్వగలవు. మతద్వేషం, అసహనము, అట్టి శాశ్వతత్వాన్ని కలిగించలేవు.

విజయనగర సామ్రాజ్యంలో ఆంధ్ర సాహితీ సంస్కృతులు పొందిన ఆదరణ విషయం వేరే చెప్పనక్కరలేదు! దేశభాషలందు తెలుగులెస్స - అన్న

నాటి భాషాభిమానము తెలుగుదేశపు సరిహద్దులను దాటి తంజావూరు, మధుర ఆ స్థానాలలో మరొక శతాబ్దం వరకు (క్రీ. శ. 1700 వరకు) సాహిత్య సృష్టికి కారణమైంది. వచన కావ్యాలు, నాటకాలు, యక్షగానాలు - మొదలైన సాహిత్య రూపాలన్నీ తంజావూరు ఆ స్థానంలో వృద్ధిచెందాయి. ఆంధ్రదేశం మహమ్మదీయుల పరిపాలనలో ఉండగా, అన్యరాష్ట్రాలలో తెలుగుభాషా సంస్కృతులు వికసించాయి.

ఈ యుగంలో మరొక పరిణామం కూడా ప్రారంభమైంది. ఇతరరాష్ట్రాలనుంచి అధికసంఖ్యలో జనంవచ్చి స్థిరపడటం కాకతీయ యుగానికి ముందే ఆగిపోయింది. పల్లవ, చోళ, చాళుక్య, కాకతీయాది వంశనామాలు నశించి, రెడ్డి, వెలమ, కమ్మ, కాపు ఇత్యాది కులాలు, జనులలో అధికసంఖ్యాకులైన కర్షకులలో తల ఎత్తాయి. అంతకు పూర్వమే ఉన్న, బ్రాహ్మణ, వైశ్య కులాలతో పాటు ఇవికూడా కలిసి, కులవిభేద సమస్యను సృష్టించింది. నాటినుండి మతవిభేదాలకు కులవిభేదాలు తోడైనవి. ఇవి రెండూ విచ్ఛిన్నకర ధోరణులు. కాకతీయ రాజులు బలంగా ఉన్నంతవరకూ వీటిని అదుపులో పెట్టగలిగారు. కాని చివరకు ఈ విభేదాలు మితిమీరి, కాకతీయ రాజ్య పతనానికే కారణమైనాయి. విజయనగరరాజులు అపార సైనికబలగంతో నిరంతర యుద్ధాలు చేస్తూ సామ్రాజ్యాన్ని రక్షించుకున్నంతకాలం ఈ అంతర్గత వైరుధ్యాలు, నివురుగప్పిన నిప్పువలెఉండి విజయనగర పతనానంతరం తిరిగి తల ఎత్తినవి.

## మహమ్మదీయ బ్రిటిషు యుగాలు

మహమ్మదీయ యుగంలో ఆంధ్రలో సంస్కృతీ సాహిత్యాలు పూర్తిగా మందగించినవనుకోవటం పొరపాటు. హిందూ మహమ్మదీయ విభేదాలతో నిమిత్తం లేక, రాజులను కీర్తించటమే తమ పనిగా భావించినవారు, మహమ్మదీయ రాజులకు అంకితంగా కావ్యాలు వ్రాశారు. కందుకూరి రుద్రకవి, తన నిరంకుశోపాఖ్యాన కావ్యాన్ని గోల్కొండ నవాబులలో ఒకరైన ఇబ్రహీం కుతుబ్ షాహాకు అంకితం ఇచ్చాడు. అతని అడుగుజాడలలో పలువురు తెలంగాణా ఆంధ్ర కవులు ముస్లిం నవాబుల ఆదరణపొందారు; గోల్కొండ ముస్లింనవాబులు మతసామరస్యధోరణిని ప్రదర్శించారు.

గోల్కొండ రాజ్యం ఔరంగజేబు దండయాత్రతో 1686 లో అంతమైంది. ఆంధ్రదేశం తురుష్క ముష్కర సైనికుల దారి దోపిడీలకు గురిఅయింది. ఈ కాలంలో ప్రజల కడగండ్లుచూసి హృదయాలు ద్రవించి శతకాలు వ్రాసిన కవులు అనేకులుద్భవించారు. శతకవాఙ్మయమంతా ఈకాలంలోనే ఉద్భవించింది. భళ్ళా పేరయ్య రచించిన భద్రగిరిశతకం, గోగులపాటి కూర్మనాథుని సింహాద్రి నారసింహశతకం ప్రజల బాధలను వర్ణించి, దుఃఖోపశమనం కల్గించిన శతకాలలో ముఖ్యమైనవి.

మత, కులవిభేదాలతో, మూఢనమ్మకాలతో, పారతంత్ర్యంలో పడి కృశించిపోతున్న ఆంధ్రజాతిని, వీపుతట్టి విమర్శించి, తిట్టి హేళనచేసి, నీతిబోధచేసి, బుజ్జగించి పునరుజ్జీవనానికి మార్గం చూపెట్టిన మహాపురుషులు ఇద్దరు. 18 వ శతాబ్దంలో వేమన, 20 వ శతాబ్ది ప్రారంభంలో వీరేశలింగం పంతులుగారు, పాతకొత్తల మేలు కలయిక వారిలక్ష్యం. ఆంధ్రజాతికి నేటికీ అదే లక్ష్యం.

చారిత్రక పరిణామ ఫలితంగా ఆంధ్రజాతికి కొన్ని విశిష్టలక్షణాలు అబ్బినవి. భారతదేశంలోని మిగతా జాతులతో పోల్చినపుడు మనకు మతావేశాలు, మూఢనమ్మకాలు చాలా తక్కువ. ఇది ఒక శుభలక్షణం. ఇది బౌద్ధ సంస్కృతి మనకు పెట్టిన భిక్ష.

ఇతరులలోని మంచిని స్వీకరించటానికి మనముసర్వదా సిద్ధం. ఈ విషయంలో, రాష్ట్రీయ, ప్రాంతీయ సంకుచిత తత్వాలుకూడా మనకు అంతగాలేవు. ఆంధ్రలో నేటికీ అవశ్య ప్రచారంలోఉన్న బెంగాలీ, హిందీ సారస్వతమే ఇందుకు చిహ్నం. ఇది మరొక శుభలక్షణం.

ఈ స్వీకృతి ధోరణితో పాటు, స్వయం వ్యక్తిత్వం కూడా అవసరం. ఆంధ్ర సంస్కృతిలో, స్వీకృతి ధోరణి ఉన్నంతగా స్వయం వ్యక్తిత్వ ధోరణి లేదేమో అనిపిస్తుంది. బౌద్ధయుగం పిదప, మన సాహితీ సంస్కృతులకు, అఖిలభారత రంగంలో లభించవలసిన స్థానం లభించలేదు. నేటికీ లభించడంలేదు. ప్రతిభాలోపం ఇందుకు కారణం కాదనుకుంటాను. విజయనగర, గోల్కొండ రాజ్యాల పతనానంతరం నేటివరకు, ఆంధ్రజాతి పరరాష్ట్రాలలో భాగంగా ముక్కచెక్కలై ఉండిపోయింది. ప్రత్యేకరాష్ట్రం మొన్న మొన్ననే వచ్చింది. ఈ రాజకీయ పరాధీనత, ఆంధ్రసంస్కృతిలో ఒక ఆత్మ బలహీనతను, నీరసత్వాన్ని కలిగించి, జాతిని కుంగదీసి, స్వయంవ్యక్తిత్వ ప్రతిభను అణచింది. ముక్కోటి ఆంధ్రులు ఒక్కటై విశాలాంధ్ర ఏర్పడిన నాడే, ఆంధ్ర సంస్కృతి భారతీయ సంస్కృతిలో అగ్రస్థానం పొందగలదు.

# ఆవాహన

పురిపండా అప్పలస్వామి

నాలో
చీకటి లోయల
చింత తొర్ర ఘూకాలను
రేకెత్తించే
కాకెత్తించే
ఎర్రని ఫల్లని పాటలతో
పచ్చని వెచ్చని గీతలతో
వచ్చావా !
రా !
రా, మరి !

నేనూ
చీకటి కొండల విహారినే
ఆకటి భూముల కళాసినే.

స్వర్గం
నరకం
సమస్త లోకం
ఉప్ఫనిపించే
రాకాసినే.

బూర్జువాల మనీపర్సు
పురోహితుల పోత్తర్లూ
గుడి దేవుడూ
మడి విస్తరీ
గుడిసేటూ
మడి బట్టలూ
నాకూ ఉపభోగ్యాలే.

శశి
గవళ్ళ పిల్లయి
అందిచ్చే సారా వెన్నెల
నిశి
నీగ్రో వెలయాలయి
తాగించే మత్తు ముంత-
ఈ చీకటి
మన కోసం.

ఈ ఘూకం
మన శోకం.
మరడాం పారీ
మంగలి బుల్లీ
రామ సీతా
శశీ
రమణా
స్వర్ణా
అన్నపూర్ణా
కామమ్మా
రాముడూ
యూదుల పిల్లా
విశాఖ గోపికా
నీళా
సుబనీ
హీరా
అదీ ఇదీ
ఇదీ అదీ
అవునోయి,
నా కామ్రేడ్లే.

ముంజె పదును
మొండి గోడ

పాడు నూయి
పేద గుడిసె
నాకూ ఆరాధ్యాలే.

నిజమే నిజమే విను
నా గుండెల్లోనూ
తడి పిండాలే.

కిసాను సోములూ
హుసేను సాయిబూ
అవునోయి
నా క్రామేడ్లే.

నాకూ తెలుసు
చీకట్లే మన లోకాలనీ
గాయాలే మన గానాలనీ.
నరకమే మన
స్వర్గమ్మనీ
అందుకనే
అందుకనే
నీ పాటలు
నా పేటల్లో
ఈటెలతో
కోటలు కడుతున్నాయి
మాటలతో
బాటలు వేస్తున్నాయి.
రా!
రా, మరి!



" ఈ కృతకభాషావాదులు పూర్వాచారపరులకన్న అంధులు. వాళ్ళకి ఏదిమాచినా శత్రుత్వమే. పూర్వాచారాల్లో నిలిచిపోతుంపినవి చాలా వున్నాయి. కాని ఈ కృతకభావలో ఉండిపోవలసింది ఏదీ లేదు. వీరికి తమకన్న పాతవీ పనికిరావు; తమకన్న కొత్తవీ పనికిరావు. "

— చలం



దారిపక్క చక్కిరాల అవ్వ

అభ్యుదయ '56

# గిత్తలబేరం

## సుంకర సత్యనారాయణ

1955 నవంబరులో మదరాసులో జరిగిన ఆంధ్ర విద్యార్థి విజ్ఞాన వారోత్సవాల్లో ఈ నాటిక ప్రథమ బహుమతి పొందింది. దీన్ని మదరాసు న్యాయకళాశాల విద్యార్థులు ప్రదర్శించారు.

### ఇందులో

| | |
|---|---|
| కేశవయ్య | 42 ఏళ్లు |
| వీరయ్య | 45 ,, |
| జగన్నాధం | 25 ,, |
| మాధవరావు | 20 ,, |
| భద్రయ్య | 45 ,, |
| దళారి దాసయ్య | 35 ,, |

ఆ వూరు చాలా పెద్దది. చిన్న బస్తీలా వుంటుంది. ఊరి మధ్యభాగంలో కిళ్లీకొట్టు ఒకటి వుంది. కొట్టుముందు పొడుగాటి రెుత్తయిన బల్ల. దానిమీద రంగులు కలిపిన నీళ్ళతో నింపిన సీసాలు వరుసగా పెట్టివున్నాయి. ప్రక్కగా చిన్న నీళ్ళ తొట్లో సోడా సీసాలు. ఎదురుగా తమల పాకుల పళ్ళెం. పళ్ళెంచుట్టూ సుగంధ ద్రవ్యాల చిన్న చిన్న సీసాలూ భరిణలూనూ. అరటి గెలా, వక్క పొట్లాల దండలూ వ్రేలాడు తున్నాయి. కొట్టుదగ్గరకు వచ్చిన వాళ్లు కూర్చోడానికి రెండు కుర్చీలూ, ఒక బెంచీబల్ల కూడా వుంది. తెర లేచింది.

మాధవరావు కొట్లో కూర్చొని ఏదో పుస్తకం తిరగవేస్తూ కూనిరాగాలు తీస్తున్నాడు. వయసు యిరవై. నూ నూగు మీసాలు. చిన్న క్రాపు. ఫుల్ షర్టు. పైజామా.

ఇంతలో మాధవరావు తండ్రి కేశవయ్య వచ్చాడు. వయసు 42. ధోవతి. బనియన్. భుజాన తుండు. సంస్కారంలేని క్రాపు. బొద్దుగావున్నాడు.]

కేశవయ్య : అరే, మాధవా !

మాధవరావు : ఆఁ, [పుస్తకంమూస్తూ, తండ్రివైపు చూస్తాడు.

కేశ : ఎవరో యిద్దరు భోజనానికి వస్తారని చెప్పారటగా, మీ అమ్మతో . ఎవర్రావాళ్ళు ?

మాధ : ఆఁ. ఎవరో బాటసార్లు.

కేశ : బాటసార్లూ !

మాధ : అవును నాన్నా ! దాదాపు ఒంటిగంట కావచ్చింది. అందులో వేసవికాలం. మనవూళ్లో చూస్తామా, హోటల్ లేదు. పాపం వాళ్ళుగతి ఏం కావాలి. అందుకని...

కేశ : అందుకని నీ యింటికి భోజనానికి పిలిచావ్ ! తను దూర సంతలేదు మెడకో డోలట.

మాధ : అదికాదు నాన్నా !

కేశ : ఏదికాదు. అసలు నీకేమన్నా మెదడుందా? ఎక్కడ తెచ్చిపెడతావురా, భోజనాలు. దారేపోయే వాళ్లందర్నీ పిలిచి ?

మాధ : అందర్నీ యెందుకు పిలుస్తాను.

కేశ : కాకపోతే యేమిటిదంతా. ఇంకా నేనెవరో చుట్టాలనుకున్నా.

మాధ : చుట్టాల్ని ఒకరు పిలవడం యెందుకు? వాళ్ళే వస్తారు, ఇంట్లో తిని యింటివాసాలు లెక్కపెట్టడానికి.

కేశ : ఊఁ, వీళ్లు మెచ్చి మేకతోలు కప్పుతారు.

మాధ : అదేమోకాని, వంకలు పెట్టరు. మర్యాద తక్కువైందని గొణగరు. ఊరూరా చాటరు. ఉన్న దేదో వేళకు పెట్టినందుకు కనీసం సంతోషిస్తారు.

కేశ : చాలు. అంతట ఆపు నీ వుపన్యాసం. వింటే యెవరైనా నవ్వుతారు.

మాధ : సరే, మీకు అంత కష్టంగావుంటే వాళ్లను వెళ్ళిపొమ్మంటాను [బయటికి బయలుదేరాడు].

కేశ : ఒరేయ్, [మాధవరావు ఆగుతాడు] ఆ తెలివి మొదటేవుండాలి. ముందు ఆశపెట్టి తర్వాత లేదనడమా! ఇట్లాంటి తెలివితక్కువ పనులెన్నడూ చెయ్యకు. ఇంతకీ వాళ్ళెక్కడ ?

మాధ : చెరువులో స్నానం చేస్తున్నారు.

కేశ : అటునుంచి అటే మనయింటికి పోయారా !

మాధ : లేదు. ఇక్కడికే రమ్మన్నాను.—(వీధిలోకి చూస్తూ) అరుగో, వస్తున్నారు. [వారిని ఆహ్వానించుతూ] రండి. దయచేయండి. (తండ్రిని చూపుతూ) వీరు మా నాన్న గారు.

[వీరయ్యా, జగన్నాథం లోనికి ప్రవేశించారు. వీరయ్య వయస్సు 45. చామనచాయ. గడ్డంమాసింది. బుర్రమీసాలు. నెరసీ నెరియని తల. ధోవతి; ఆఘారం. ఉత్తరీయం. చేతిలో కర్ర. కాళ్ళకు చెప్పులు. చంకలో బొక్కశా.

జగన్నాథం వయస్సు 25. క్రాపు. చిన్న మీసం. ధోవతి ధరించాడు. హాఫ్‌షర్టు. భుజాన టవల్. కాళ్ళకు చెప్పులు.]

జగన్నాథం : }
వీరయ్య : } నమస్కారమండి.

కేశ : నమస్కారం. నమస్కారం.

వీర : తమ నామధేయం.

కేశ : కేశవయ్య అంటారు లెండి. [కుమారునితో] ఒరే, అబ్బాయ్! [బెంచీ చూపుతూ] బల్ల తుడవరా, కూర్చుంటారు.

జగ : ఫర్వాలేదులెండి.

[మాధవరావు గోనెపట్టాతో బల్లతుడవగా వారు కూర్చుంటారు. వీరయ్య బొక్కశా బల్లమీద పెట్టాడు]

కేశ : అబ్బాయ్ మాధవా! నువ్వింటికెళ్ళి......

మాధ : సరె నాన్నా! అదంతా నేను చూస్తానుగా. [బయలుదేరాడు]

వీర : [యువకుడు వెళుతున్నవైపు చూస్తూ] నాయనా!

[మాధవరావు ఆగి వీరయ్యవైపు చూస్తాడు] ప్రత్యేకంగా మమ్మల్ని గురించి నువ్వు......

కేశ : దానిదేంటిలెండి. [మాధవరావు నవ్వుతూ వెళ్లాడు]

వీర : తమకు పిల్లలెంతమందండి, కేశవయ్యగారూ?

కేశ : వీడొక్కడే నండి.

వీర : పనికిరాని చెత్త నూరుమంది వుండేందుకు ? ఇట్లాంటి పుత్రరత్నం ఒక్కడున్నా చాలు. ఎంత నిదానం. ఎంత వినయం. ఎంత విధేయత. ఎంత భూతదయ! (జగన్నాథం వైపుతిరిగి) ఏంరా జగన్నాథం.

జగ : చెప్పాలా! ఎంత జాలిహృదయం కానిది, దారేపొయ్యేవాళ్ళను భోజనానికి పిలుస్తాడూ!

కేశ : అది మొదటినుంచి మా కొంపలో ప్రతివాడికి ఉన్న అలవాటే లెండి.

వీర : తెలుస్తానే వుందిగా. చెట్టునుబట్టే కాయ. ఏమంటారు ?

కేశ : [నవ్వుతూ] ఏదోలెండి. ఆఁ ... ఇంతకూ తమ పేరేమిటో తెలవిచ్చారుగారు.

జగ : వీరిపేరు వీరయ్యగారు, నాపేరు జగన్నాథం.

వీర : ఆఁ మరచాను, తమ యింటిపేరు ?

కేశ : వియ్యాలవారు.

వీర : (నవ్వి) అట్లాగా, అయితే మీకు మాకు బావా బావమరదులవరస. మా యింటిపేరు కయ్యాలవారులెండి.

కేశ : ఏవిఁటీ! చెప్పారుగాదు. కయ్యాల కనకయ్యగారు స్వయంగా మా మేనమామ. ఆయనగారి కుమార్తెను మా యింట్లోనే యిచ్చింది.

వీర: ఏమి చేవిఁటి! [జగన్నాథంవైపు తిరిగి అతనితో] ఓహోహోహో, కనకయ్యగారిని నువ్వెరగవు గాని జగన్నాథం, నాపైన నాచెయ్యెత్తు మనిషి. ఆయన పేరు చెప్పితే, యీ చుట్టుపట్ల పదీ పన్నెండూళ్లలో పసిపిల్ల పాలుతాగేది కాదు. ఆయన మీసం ఏం మీసం! నిమ్మకాయ నిలిపితే అట్లా నిలబడాలిసిందే. ఇట్లా వంగేదా!

జగ : (ఆశ్చర్యంగా) అమ్మబాబోయ్!

వీర : అంతేకాదు. ఆయనుండగా, పొరుగూరివాడు ఆ వూరి నడిబజార్న చెప్పులు తొడుక్కుని, గొడుగువేసుకుని నడవడానికి వీలుందా ? వచ్చినట్లు వూరి యివతల గొడుగు చంకలోపెట్టి, చెప్పులు చేత పుచ్చుకుని మళ్ళీ వూరిఅవతల తొడుక్కోవలసిందే.

జగ ; ఆఁ

వీర : ఆఁ ఏవిఁట్రా ఆఁ. కలెక్టరంతటివాడు వూరి బయట గుర్రాన్ని దిగి వూళ్లో అడుగుపెట్టేవాడు.

కేశ : ఏమైతే ఏం లాభంలెండీ. ఆయనతోనే అదంతా పోయింది. ఆయన్ని అట్లా తీసుకెళ్ళారు.

ఇట్లా అప్పులవాళ్ళొచ్చి వున్నదంతా కట్టుకుపోయారు. ఆయనదేకాదు. మా ఆస్తిపోయిందికూడా అప్పుడే.

జగ : అదేమిటి! మీరెందుకుపోవాలి?

కేశ : వేరేఏంలేదు. మా నాయన కనకయ్యగారి మాట కాదనలేక అడ్డంవుండి అప్పు యిప్పించాడూ...

వీర : సరి సరి అర్థమైందిలెండి. చెప్పనక్కర్లా. అయినా పెద్దవఆస్తి దానిదేమిటి. యివ్వాళపోతే రేపు వస్తుంది. నిజంగా కనకయ్యగారి కుమార్తె మీకు భార్యకావడం...

కేశ : అబ్బెబ్బే. నాకు కాదండి ఆమె నిచ్చింది. మా పెదతండ్రికొడుక్కి.

వీర : మీక్కాదూ?

జగ : ఎవరికైతేనేం వారి కుటుంబంలో నేగా యిచ్చింది.

వీర : అంతేమరి.

కేశ : అదేకో అయింది పోయింది. దానికేంగాని యింతకీ తమరు వచ్చిన పని?

జగ : ఆఁ మరేంలేదు. గిత్త బేరానికిలెండి.

వీర : మావాడిదగ్గిర ఛేస్తైన గిత్త ఒకటుంది. దాని జతకి యింకొకటి కావాలిసి.

జగ : నాకేకాదు; మా బావకే కావాలి ఒక గిత్త.

వీర : (మందలింపుగా) జగన్నాథం — కేశవయ్యగారూ! మనవూళ్లో మంచి కుర్రవాళ్ళు—అంటే ఈ సంవత్సరం పెళ్ళి కావలసినవాళ్ళు — ఉన్నారా?

కేశ : కుర్రవాళ్ళకేం, కావలసినంతమంది.

(దళారి దానయ్య వస్తాడు. వయస్సు 35. గిరజాలు, కోరమీసం చేతిలో సన్నటి కర్ర. హాఫ్‌షర్టు, టర్కీటవల్. సైకిల్ కట్టుకట్టాడు.)

దళారి : సోడాకొట్టు మావా!

కేశ : (సోడాకొట్టి అరనికి యిస్తూ) ఆరే బాబూ! కొడ్లబేరం నీకు బాగా తెలుసు. (జగన్నాథాన్ని చూపుతూ) ఈ అబ్బాయికి ఒక గిత్త కావాలంట్రా.

దళారి : గిత్తలకేం కరవు. (జగన్నాథంతో) ఏ మాత్రం ధర పెడతావయ్యా?

జగ : అసలు వస్తువు నచ్చాలిగాని ధరదేమిటి.

వీర : అందేంమాట. పిండి కొద్దీ రొట్టె. ఏమంటారు కేశవయ్యగారూ?

కేశ : కాదుమరి. దాన్నిబట్టేయే వైనా.

వీర : అదేమరి. మీరు చెప్పిన వాళ్లకేట్లు యెట్లా వున్నై?

కేశ : కుర్రవాళ్లసంగతా. మీరు ధరాయించాలిగాని యూఖై వేలనుంచి పదివేలదాకా పలుకుతున్నారు. అంతకులోపైతే యీవూళ్లో మాట్లాడగూడదు. అసలు మీకు యేరకంకావాలో.

దళా : (సోడాకాయ కిందపెట్టి జగన్నాథంతో) ధరమాట సరేగాని నీక్కావాల్సిన సైజేమిటో చెప్పు ముందు.

జగ : నాకా...

వీర : ఆరే, వుండరా.

జగ : ఉండుబావా! నీబేరం ఇప్పుడు తెగేదా చచ్చేదా. నీకూతురుకి మగడు యీ యేడు కాకపోతే ముందుకు దొరుకుతాడు. ఇబ్బందిలేదు. నాకు నాలుగు రోజుల్లో గిత్త దొరక్కపోయిందంటే యింకేమైనా వుందా! వ్యవసాయం నాశనమైపోదూ! (దళారితో) ఇదుగోనయ్యో! ఖచ్చితంగా మూడు మూళ్లుండాలి గిత్త.

(మాధవరావు వచ్చాడు)

దళా : అయితే వుందిలే ఒకటిక్కడ.

జగ : ఎత్తువుండగానే సరికాదు గిత్తపుటుక?

దళా : పుటుకా! చేసిన నంది. చూచినా అట్టా వుండాలి.

జగ : అయితే పద. (వీరయ్యతో) రా బావా!

వీర : నీవుపోయి చూచి రారా. నచ్చితే తరవాత మాట్లాడదాం.

జగ : ఒంటరిగా పోనా. మాధవరావును తీసుకెళతా.

కేశ. వీడా! గిత్తల బేరానికి! ఊడలేసుకున్న దూడను కట్టివెయ్యడం చేతగాదుగాని.

జగ : ఏదో జతగా పోయి వస్తాం. రావోయ్ మాధవరావ్.

కేశ : సరె. పోరా. (మాధవరావు రెండడుగులు వేస్తాడు.) అబ్బాయ్ దూరంగావుండి చూడు, గిత్త కాలికిందకు వెళ్ళకు, తన్నేను.

జగ : (నవ్వుతూ) గుడ్డిదైతే బెదరి తన్నుతుందిగాని మంచి గిత్తలు తిన్నవులెండి.

దళా : గుడ్డిదీకాదు వడ్డిదీకాదు. నడవండయ్యా!

(జగన్నాథం, మాధవరావు నవ్వుతూ బయలుదేరి దళారిని అనుసరించారు.)

కేశ : ఇదుగో, వీరయ్యగారూ! మావాళ్ళ కుర్రవాడొకడున్నాడు చూస్తారా? ఎఫ్. ఏ. చదువుకున్నాడు.

వీర : కట్నం ఎంతలో వుంది?

కేశ : ఇరవై వేలకు పైమాట. అంతకు తక్కువైతే ఆ గడప తొక్కనక్కర్లా.

వీర : అంతదూరం మనం తూగలేం లెండి. పదివేలు. తప్పితే పన్నెండు. ఆపైన లాభంలేదు.

కేశ : పది పన్నెండులోనా. (ఆలోచించి) ఆం. ఉన్నాడొకడు. మంచిదే సంబంధం. కుదిరితే.

వీర : ఆస్తి ఏమైనా...

కేశ : ఆం సుక్షేత్రంలాంటి యెకరంన్నర మాగాణి వుంది. ఈ సంవత్సరం ఆంధ్రా మెట్రిక్ కు కూర్చున్నాడు. పాసయ్యాడో లేదో మరి. అవుతాడు లెండి.

వీర : కుర్రవాడెట్లా వుంటాడు? మన అమ్మాయి వుంది చూచారూ, (లేచి నిలబడి) నన్ను చూస్తున్నారుగా. ఒడ్డూ పొడుగూ కాస్త కూస్తకే మొచ్చె. నా అంత జమానూ అనుకోండి.

కేశ : (చప్పరించి) అయితే వాడు లాభంలేదు లెండి.

కేశ : అది సరేగాని, మీ అమ్మాయికి డొక్కశుద్ధి యేమైనా వుందా?

వీర : అదేమిటండోయ్. యస్. యస్. యల్. సి. చదువుతూ పరీక్షకు మూడు నెలలు ముందు రజస్వలైంది......

కేశ : అయితే, చదువు మాన్పించారా, కొంపతీసి!

వీర : ఏం చేస్తాం చెప్పండి. మనకొంపల్లో రజస్వలైనాక ఆడపిల్లను బడికి పంపడమంటే, వూరికే నిప్పంటుకోదూ!

కేశ : అరరెరె. ఆ మూడు మాసాలు కూడా అది ఆరక్కుండా వున్నట్లయితే...

వీర : ఫస్టున పాసయ్యేదనుకోండి.

కేశ : అట్లాంటప్పుడు మీరు ధైర్యంచేసి చదివించినా పోయేది.

వీర : చదివించేవాళ్లే, లాభం! ఎంత చదివించినా యిచ్చే కట్నం యివ్వకతప్పదు. పైన బాగా చదువుకున్న పిల్లకి మొగుడు దొరకడం మరీ కష్టంగా వుంది. ఏమంటారు?

కేశ : అది నిజమే ననుకోండి కాని...

వీర : ఈ వూళ్లో యిక లాభంలేదంటారా?

కేశ : మీరు చెప్పిన లెఖ్ఖప్రకారం, యేటవతల తాటాకులపాలెంలో ఒక మంచి సంబంధం వుందండి.

వీర : (ఆలోచించి) ఏది, సుబ్బయ్యగారి కొడుకు సంగతా?

కేశ : ఆం ఆం కుర్రవాడు దిట్టంగా వుంటాడే గిత్తలాగా.

వీర : ఉన్నాడు ఉండడానికి, ముక్కూ మొఖం లేకుండా. మా అమ్మాయి యెంత ఎరుపో వాడంత నలుపు. మాలకాకి వన్నె.

కేశ : ఆస్టే చూస్తే యీ చుట్టుపట్ల వూళ్ళన్నీ తిరిగేసి నట్లుంది.

వీర : అహా. వెనక ఆడపిల్లకి మొగుడు దొరికేసరికి యేడు చెప్పుల జోళ్లు తెగేవట. ఇప్పటికి నావి యేడు వందలు ఖర్చయినై. ఇంకా యెన్ని వందలు కావాలో మరి.

కేశ : ఆ కాలమే మారిపోయింది లెండి.

వీర : కాలం కాదు మారింది. బుద్ధులు. మొన్న మల్లారం వెళ్ళితే అక్కడా ఒక సంబంధం తగిలింది.

కేశ : ఆం. ఆం.

వీర : వాళ్ళ 'కోవ' అంత మంచిది కాదు లెండి. దరిద్రపు కోవ. ఆడవాళ్ళు పొలం వెళతారు.

కేశ : ఆం! ఇక మీరు యివన్నీ పెట్టుకుంటే అమ్మాయి పెళ్ళిచేసినట్టే. వాళ్ళపని వాళ్ళుచేసుకున్నా తప్పేనా? మన పిల్లలు వెళ్ళటంలా నాటకాలకీ, సినీమాలకీ, బజారుకీ, బట్టలకొట్లకీ.

వీర : చివరకి తలవంచి దానికీ లోబడ్డా. కాని వాళ్ళు యిరవై వేలు అడిగారు.

కేశ : ఈ రోజుల్లో ఒక మనిషి హోదాను నిర్ణయించేది డబ్బుగాని కోవగాదు. అవునా?

వీర : కాదనడానికి ఎవడితరం!

కేశ : అందువల్ల మీ గొంతెమ్మ కోరికలన్నీ తీరాలంటే కష్టం బావగారూ! అయినా మా వూళ్లో యింకో బేరంవుంది. కుదిరితే అది కనకరాలి మీకు.

వీర : అది యెట్లాంటిది?

కేశ : కుర్రవాడి తండ్రి చాలా పలుకుబడిగల మనిషి. మా వూరి పంచాయతీబోర్డు ప్రసిడెంటు. ఆయన బల్లయెక్కి వుపన్యాసం మొదలుపెట్టాడంటే బల్ల పగిలిపోవలసిందే. అట్లాంటి మనిషి, ఆస్తి సంగతి వేరే చెప్పనక్కర్లేదుగా.

వీర : మరీ, అంత గొప్పవాళ్లయితే మనకు అందుతారా అబ్బా.

కేశ : నిజానికి అంతేగాని ఒక్క విషయం వుంది. ఆయన కట్నాలు తీసుకోవటం తప్పని వాదిస్తావుంటాడు మరి.

వీర : (ప్రాణం లేచివచ్చి) అయితే కేశవయ్యగారు! తప్పకుండా యీ సంబంధం ఆలోచించండి. మీ మేలు మరచిపోను.

(జగన్నాథం వచ్చాడు)

కేశ : కనుక్కుందాం.

జగ : ఏమిటండోయ్ కనుక్కునేది ?

వీర : ఇక్కడో మంచి సంబంధంవుందిరా. మన పోడాకు తగింది.

జగ : పోడాలసంగతి తరవాత. అసలు పిల్లవాడెట్లాంటివాడో.

కేశ : కుర్రవాడికేం. ఉంటాడుగాని సుమారుగా, ఒక కన్ను కొద్దిగా మెల్ల.

జగ : అయ్యిందీ! విన్నావా బావా ?

వీర : దానిదేమిటిలే. తతిమ్మా విషయాలన్నీ చాల బాగున్నై. మీకెందుకు మీరు కనుక్కోండి కేశవయ్యగారూ !

జగ : (వ్యంగ్యంగా) సరె, కనుక్కోండి.

కేశ : ఇంతకీ, నీగిత్తబేరం యేమైంది ?

జగ : కుదిరింది.

వీర : ధరెంత ?

జగ : ధర పరి అటో యిటో; వాగిత్తజతకి సరిగ్గా సరిపోతుందనుకున్నాను. కొన్నాను. రెండూ అన్నదమ్ముల్లా వుంటాయి.

వీర : అంతమంచి గిత్తె యింత తొందర్లో యెట్లా దొరికిందిరా ?

జగ : పశువుగదూ! ఉన్నవాడి దొడ్లో పుట్టినా, లేనివాడి దొడ్లో పుట్టినా దానికి ఒకటే విలువ.

కేశ : అంటే ?

జగ : అంటే - రెండుకాళ్ళ జంతువుబేరం వేరుగా. అది పుట్టిన దొడ్డిని పట్టి దాని విలువ వుంటుంది.

వీర : (కోపంగా) నోటికి వచ్చినట్లు మాట్లాడకు. దానికీ దీనికీ సంబంధం యేమిటంట.

జగ : అవున్లే దానికి నాలుగుకాళ్లుంటాయి. దీనికి రెండే. దాన్ని బేరం చేసేటప్పుడు అసలు వస్తువు మంచిదో కాదో చూచుకుంటాం. కాని దీని సంగతి వేరు. వస్తువు మంచిది కానీ కాకపోనీ, మనకు పనికి రానీ రాకపోనీ, దానివెనుకవున్న హంగామానుబట్టి బేరంచెయ్యాలి. కాదే బావా !

వీర : (విసుగ్గా) వింటున్నారుగా కేశవయ్యగారు మావాడి మాటలు!

కేశ : ఏదో కుర్రతనం.

జగ : అంతేలెండి. బలేపని.

వీర : కాకపోతేనీకేంతెలుసురా, సంసారంఅన్నాక వుండే కష్టసుఖాలు. నిన్నగాక మొన్న కళ్లుతెరిచావ్. కేశవయ్యగారూ ? మీరు మాట్లాడండి.

కేశ : తొందర పడకండి.

[భద్రయ్య ప్రవేశించాడు. సన్నగా దువ్విన తల. చిన్నబొజ్జ. ఖద్దరుపంచ. లాల్చీ, బిళ్ళమడత విప్పని వుత్తరీయం. చేతిలో పొన్నుకర్ర. కాళ్ళకు కాన్పూరు చెప్పులు.]

భద్ర : (వస్తూనే) కేశవయ్యా.

కేశ : (అటుచూచి) ఓహో భద్రయ్యగారా దయ చెయ్యండి దయచేయండి. (కుర్చీ చూపెడుతూ) మీకు నిండా నూరేళ్ళాయుస్సు. మీమాటే అనుకుంటున్నాం.

భద్ర ; (కూర్చుంటూ) అట్లాగా వీరెవరు ?

కేశ : వీరి...(జగన్నాథంవంక చూస్తాడు)

జగ : శనివారక్పేట.

కేశ : మీతో సంబంధం అందుకోవాలని వచ్చారు.

భద్ర : అలాగా అయితే వీళ్ని మన యింటికి తీసుకరాక ఇక్కడ వుంచావెందుకు ? (వీరయ్యతో) వెళదాం పదండి.

వీర : చిత్తం చిత్తం వెళ్ళొచ్చులెండి.

భద్ర : అదేం మాట, లేవండీ ముందు. కేశవయ్యా ఒక అరకట్ట ఆకులు ఇలాతే. వక్కలుకూడా.

కేశ : అట్లాగే. (ఆకులూ వక్కలూ కడుతూ వుంటాడు)

భద్ర : కేశవయ్య మా విషయమంతా తమతో చెప్పేవుంటాడు.

జగ : తమర్ని గురించి చెప్పాలటలెండి (కిందకీ పైకీ చూచి) కనపడటంల్లా !

వీర : ఏమిటి కనపడేది నీ మొహం.

జగ : అపారమస్తకం గొప్పతనం పుట్టిపడుతూ వుంటే. ఏమిటి బావా ! అట్లా అంటావ్ ?

భద్ర : (నవ్వి) మొత్తానికి కుర్రవాడు అసాధ్యుడే.

వీర : వాడిమొహం వాడిమాటలకేంగాని తమకు సంతానం ఎంతమంది !

కేశ : ఇద్దరు. కొడుకూ కూతురూనూ.

జగ : అదృష్టవంతులకు యెప్పుడూ అంతే. న్యాయంగా వంశాన్ని వృద్ధించడానికి కుమారుడు ఒకడు చాలుననుకోండి.

భద్ర : కుమార్తె ఎందుకంటావ్..నీభావం అర్థమైందిగాని నాకా బాధలేదు.

జగ : ఎందువల్లనంటారు.

భద్ర : అంటే మీకు నా విషయం సరిగ్గా తెలియదన్నమాట. నేను యీ కట్నాలు యిచ్చే ఆచారానికి వ్యతిరేకిని.

జగ : తీసుకునే ఆచారానికో.

భద్ర : రెండిటికీ వ్యతిరేకినే. బద్ధవ్యతిరేకిని. దీని మీద పత్రికల్లో ఘాటైన వ్యాసాలుకూడా రాశాను.

కేశ : [ఆకులపొట్లం భద్రయ్యకు అందించుతూ] నేనా మాటముందే చెప్పాను లెండి.

వీర : [భద్రయ్యతో] అబ్బాయి వయస్సు ఎంతండి ?

భద్ర : ఆఁ ఎంత. ఇరవై రెండో సంవత్సరం. అమ్మాయికి పదిహేడో సంవత్సరం. కాని చూడ డానికి పదునాలుగేళ్ళ పిల్లలా వుంటుంది. మన కేశవయ్యకు తెలుసుగా.

కేశ : ఏది, అమ్మాయిసంగతా. ఇప్పుడుగాదు. ఇంకా పదియేళ్ళ తరవాత చూచినా, ఆ పిల్ల అట్లాగే వుంటుంది.

భద్ర : [నవ్వుతూ వీరయ్యతో] సరె, ఇదంతా యెందుకు మీరేచూస్తారుగా. పదండి వెళదాం ఇంటికి.

కేశ : అదేం, భద్రయ్యగారూ! వీరికి కావలసింది అమ్మాయి కాదు. వీరి అమ్మాయిని తమ అబ్బాయికి ఇవ్వటానికి వచ్చారు.

వీర : [గుటకలు మింగుతూ] అవునండి.

భద్ర : [తెల్లబోయి] అబ్బాయి విషయం అయితే కొంచెం ఆలోచించాలి లెండి.

వీర : తమరు వరకట్నం పుచ్చుకోక పోయినా, మేము యివ్వ తలచుకున్నదేదో అమ్మాయికి యిచ్చు కుంటాం. మరో విధంగా అనుకోకండి.

కేశ : బాగానేవుంది. మీరు యెట్లాగూ పదివేలు వరకట్నం యివ్వదలచారు. అదే యిప్పుడు అమ్మాయికి పసుపూ కుంకుమ కింద యిస్తారు. తప్పేముంది.

భద్ర : అదికాదయ్యా !...

జగ : [వ్యంగ్య ధోరణిలో] పల్లకిలో అల్లుడికి కట్నం చదివించకుండా ఆమొత్తం తమ చేతిలోపొయ్యమన్నా అభ్యంతరంలేదు. (వీరయ్య వైపు తిరిగి) ఏం, బావా ?

వీర : వారి చిత్తం యెట్లావుంటే అట్లా.

భద్ర : ఈ భద్రయ్య అలాంటి దొంగకూళ్ళు కుడిచే బాపతు కాదండోయ్.

కేశ : ఇందులో దొంగకూడు యేముంది లెండి.

భద్ర : కాకపోతే యేమిటిది?

జగ : ఇదొక నవీన పద్ధతి. దీనిని కట్నం అనడానికీ వీల్లేదు, లంచం అనడానికీ వీల్లేదు.

కేశ : చఛా, లంచమని యెట్లా అంటాం.

భద్ర : అదికాదు కేశవయ్యా! మనం యెట్లాగూ కట్నం తీసుకోం. అలాంటప్పుడు పొరుగూరు పిల్ల యెందుకు? ఊళ్ళో బోలెడంతమంది పిల్లలుండగా, సరే వస్తా.

[భద్రయ్య కదిలాడు]

కేశ : భద్రయ్యగారూ!

భద్ర : [ఆగి కేశవయ్యను చూచి చేబు తడుము కుంటూ] అరకపట్న యింటిదగ్గర మరచిపోయానే.

కేశ : సరె. వెళ్ళిరండి. [అతడు వెళ్ళిపోయాడు]

[వీరయ్య ప్రతిమలాగు నిలచి భద్రయ్య వైపు నిలచి చూస్తూ వుంటాడు]

జగ : కేశవయ్యగారు సోడా ఒకటి కొట్టండి.

[కేశవయ్య సోడాకొట్టి జగన్నాధానికి అందించాడు. మాధవరావు వచ్చాడు. జగన్నాధం వీరయ్యవద్దకు నడచి సోడా ఆయనకు అందించాడు. వీరయ్య అట్లాగే సోడా తాగాడు]

మాధ : భద్రయ్యగారు మనకొట్టుదగ్గరకు వచ్చాడా?

కేశ : అవును. ఏం?

మాధ : ఎందుకోగాని నన్ను చూచి అదోవిధంగా నవ్వాడు.

కేశ : ఏం నవ్వితే.

మాధ : ఆ నవ్వుకు ఏదో అర్థముంది.

జగ : పెద్దవాళ్ళు అర్థంలేకుండా నవ్వుతారామరి. ఒకవేళ వాళ్ల అమ్మాయిని నీకు యివ్వదలచి నవ్వాడేమో.

కేశ : ఆయన కూతుర్ని మాబోటివాళ్ళ కిస్తాడా ?

మాధ : ఇస్తే చేసుకునే దెవడు. నాకన్నా సంవత్సరం పెద్దది.

వీర : (ఆశ్చర్యంగా) నీకంటేనా ! ఇంతకీ నీ వయస్సెంత ?

మాధ : ఇరవై.

జగ : మరి వాళ్ళఅమ్మాయికి పదిహేడేళ్ళనటగా.

మాధ : అది వాళ్ళ అబ్బాయి వయస్సు. మీకు తిరగేసి చెప్పివుంటాడు.

వీర : ఏమండి కేశవయ్యగారు ! మీరైనా చెప్ప లేదేం ?

కేశ : మీరా అమ్మాయిని చేసుకునే వాళ్ళా పోదా. ఏదో ఆయన ఇష్టంవచ్చినట్లు చెప్పుకున్నాడు. పోనిద్దురూ.

జగ : ఇరవైయేళ్ళు వచ్చినా, పద్నాలుగేళ్ల పిల్లలా వుంటుందట. అంత అందమైనపిల్లా ఏమిటి ?

కేశ : ఏదో వుంటుంది.

మాధ : ఆఁ, వుంటుంది. భూమికి బెత్తెడు ఎత్తున. పొట్టి తింగణా.

కేశ : ఆ పిల్ల యెట్లావుంటే నీ కెందుకురా.

జగ : అవును. ఎదటివాళ్ళ గొడవ ఎందుకు, మనది మనం సరిగ్గా చూచుకుంటే చాలు.

వీర : నాయనా ! మాధవరావ్ ! నీవు ఏం చదువు కున్నావ్ ?

మాధ : బి. ఏ.

కేశ : ఫస్టున పాసయ్యాడు.

వీర : మరి ఈ సంవత్సరం పెళ్ళిచెయ్యరు ?

జగ : దొరకాలిగా. చదువుకున్నవాడికి చదువు కున్న పెళ్ళాం కావాలని వుంటుంది. లేనివాళ్ళు తమ మగపిల్లలకే చదువు చెప్పించలేకుండా వున్నారు. ఇక ఆడపిల్లల కేం చెప్పిస్తారు. ఉన్నవాళ్ళ పిల్లల్ని ఇట్లాంటి వాళ్ళకివ్వరు.

వీర : బంగారంలాంటి పిల్లవాడు. ఇతనికి పిల్ల నివ్వ డాని కేం. ఎవడు బడితేవాడే యిస్తాడు.

జగ : ఆఁ. ఇస్తారు. అందాకా యెందుకు నీవి స్తావా ?

కేశ : వాడికి యెవ్వరూ యివ్వనక్కరలేదు. మేన మామ కూతురేవుంది.

జగ : చదువుకుందా ?

కేశ : ఏదో ఆడపాడడపా చదువుకుంది. ఈ చైత్ర మాసంలో లగ్గం పెట్టుకోవా లనుకుంటున్నాం.

మాధ : నాన్నా ! పెద్దమనుషుల దగ్గర ఇలాంటి మాటలు చెప్పడం మంచిదిగాదు. నీకు అనేకసార్లు చెప్పాను నేనా పిల్లను చేసుకోనని.

కేశ : చెపుతావురా నీకేం. చెపుతావు. చేసుకో నంటే తప్పుతుందా ? మేనమామ కూతురూ, ఇదివరకే మాటయిచ్చాను.

మాధ : నన్నడిగి మాట యిచ్చారా ; ఆ తప్పు మీది.

కేశ : ఏమిటోయ్ నిన్నడిగేది ?

మాధ : నన్ను అడగకుండా ఇంకెవ్వరికైనా యిచ్చుకుంటే నా అభ్యంతరమేమీ లేదు.

కేశ : కట్టిపెట్టరా నీ చదువుకున్న మాటలు. ఇదిగో వీరయ్యగారూ ! మీరు చెప్పండి న్యాయం. వీడు పుట్టేటప్పటికే ఆవిడపోయింది. తర్వాత యీ దుకాణం పెట్టి ఎట్లాగో బతుకుతూ ఒక్కణ్ణి అడగకుండా, యాచించకుండా వీణ్ణి చదివించాను. మొన్న బి. ఎ. చదవటానికి డబ్బులేకపోతే వీడి మామ రెండువే లిచ్చాడు. ఎందుకిచ్చాడంటారూ ?

వీర . ఆయన కూతుర్ని చేసుకుంటాడనే యిచ్చి వుంటాడు లెండి.

కేశ : అవునుగదా ! అన్నీ తెలిసి వీడిప్పుడిట్లా మాట్లాడుతాడు. ఏం చెప్పాలిక.

మాధ : అప్పిస్తే తీసుకుంటాడు. అంతేగాని పిల్లని చేసుకోవాలని ఎక్కడుంది ?

కేశ : అదంతా గాదురా, నేను చెప్పినట్టు మావా పిల్లని చేసుకుంటావా ? లేదా ?

మాధ : ఆ గుడ్డి పిల్లనా ?

జగ : గుడ్డి దేమిటీ !

మాధ : ఒక కన్ను లేదు లెండి !

కేశ : ఏమోయ్ లేకపోతే ! ఇబ్బందా ? పిల్లలు పుట్టరా ?

జగ : పిల్లలకేం. రెండుకళ్ళూ లేకపోయినా పుడ తారు.

కేశ . (జగన్నాథంతో) అది కాదబ్బాయ్. అవతల మేనమామ - అటు తల్లి చెప్పుతావుంది. ఇటు నేను జెప్పుతున్నా. ఇంతమందిమాట కాదని వీడెక్కడికి పోతాడో చూస్తా.

మాధ : నాకు కాదుగదా, కడకు నా శవానికికూడా ఆ పిల్లను పెళ్ళి చెయ్యలేరు.

వీర : కేశవయ్యగారూ ! అబ్బాయికి అంత యిష్టం లేనప్పుడు............

జగ : అతనికి ఇష్టంవచ్చిన పిల్లను చేసుకోనివ్వటం మంచిది.

కేశ : ఎక్కడో ఒక కులంచెడ్డది ఉంటే దాని చెల్లెల్ని వీడు ప్రేమించాడంట. దాన్ని నేను చేసుకో నియ్యనా ?

వీర : అంటే............

మాధ : మరేంలేదండీ. నేను ప్రేమించిన అమ్మాయి అక్కయ్య వితంతు వివాహం చేసుకుంది. అదీ తప్పు.

కేశ : వితంతో ఏ తంతో అదంతా నాకు తెలియదు. మొగుడు చచ్చినాక ఇంకొకణ్ణి చేసుకోవడం మాదు మనువేగా ? దాని చెల్లెల్ని వీడు చేసుకుంటాడూ ? నేను చూస్తా ఊరుకోనా ! చెప్పండి పెద్దమనుషులు.

(వీరయ్య ముఖం వెలవెల పోతుంది.)

జగ : ఇప్పుడు ప్రతిఊళ్లో ప్రతిఇంటా మామూలుగా జరుగుతూనే ఉన్నాయలెండి. అయినా మీ అబ్బాయి చేసుకునేది ఆ మొగుడుగా, ఆమె చెల్లెల్ని.

వీర : (బాధపడుతూ) జగన్నాథం పద పోదాం ఏమిట్రా ఇదంతా ?

జగ : ఇంకో సోడా తాగు బావా !

కేశ : ఇప్పుడు సోడా ఎందుకు ? పదండి భోజ నానికి.

వీర : నే విప్పుడు భోజనం చేయను లెండి.

కేశ : ఏం ?

వీర : ఇవ్వాళ శనివారం వంటిపూట....

కేశ : అట్లయితే మేమిద్దరం తర్వాత వస్తాం. (జగన్నాథంతో) మీరిద్దరూ వెళ్ళి భోంచేసిరండి నాయనా.

జగ : సరే.

(జగన్నాథం, మాధవరావు వెళ్ళిపోయారు.)

కేశ : వీరయ్యగారూ! ఈ కాలపు కుర్రాళ్ళు మాట వినేటట్టు కనబట్టంలేదండీ!

వీర . కుర్రవాళ్లేమిటి, ఆడపిల్లలు మాత్రం వినేటట్లున్నారూ!

కేశ : అసలు వీళ్లని చదివించటమే తప్పయింది.

వీర : అదేంమాట లెండి. చదువులేకపోతే పిల్లనియ్యరు. చదువుకుంటే వీళ్ల మాటవినరు.

కేశ : ఇంతకీ మావాణ్ణి ఏం చెయ్యాలో తోచటం లేదు.

వీర : మనమే ఒక అడుగు వెనక్కి వెయ్యటం మంచిదేమో.

కేశ : ఈమాత్రానికే తగ్గుతానా! వీడిఅంతు తేల్చుకోకుండా.

(దశారి ప్రవేశం)

దశా : ఇంతాకటి గిత్తలబేరగాడు ఎటుబోయాడు మావాఁ.

వీర : ఎందుకు ?

దశా : పనుందిలే.

కేశ : ఏమిటో ఆ పని చెప్పవోయ్.

దశా : అతనెప్పుడూ ఎద్దుల మొఖం చూసినట్టులేదు. బంగారంవంటి గిత్తని చూపించితే పనికిరాదన్నాడు.

వీర : అదేమిటీ! ఇందాక బేరం కుదిరిందని వాడు చెప్పితే.

దశా : ఏంటేంటి. బేరం కుదిరింది! ఎట్టాకుదిరిందంట, ఎట్టా చెప్పాడంట.

వీర : కుదుర్చుకుంటే కుదిరింది.

దశా : నన్ను అవతలికి పంపి తనే బేరం కుదుర్చుకున్నాడా ఏంటి ?

కేశ : ఏమో! ఎవడికి తెల్సు!

దశా : నాకే బురిడీ కొడదా మనుకున్నాడేం ? సూద్దాం. అయనెట్టా అమ్ముతాడో - యీయనెట్టా కొంటాడో. ఏదీ! ఒక బీడీముక్క ఇటు పారేయ్ మావా. (బీడీ తీసుకుని నిప్పు త్రాటికి అంటించుకుంటూ) సరేగాని మాఁవా. మీ బావమరది కూతుర్ని నీకొడుక్కి చేసుకుందా మనుకున్నారేమో.

కేశ : అనుకున్నాం ఏం ?

దశా : ఏం ఏఁవిటి? ఆపిల్లని భద్రయ్యగారి అబ్బాయి కిస్తున్నారు.

కేశ : చాలు - చాల్లే - ఆగు.

దశా : వట్టి దనుకుంటున్నావా ?

కేశ : ఎవడా చెప్పింది నీకు ?

దశా : ఒకడు చెప్పేదేంటి ? నా కళ్ళతో నేను సూస్తేను. తాంబూలాలు కూడా తీసుకుంటేను

కేశ : నిజంగానా ?

దశా : కాదులే కళ్ళమూసు తెలుస్తుంది. అబద్ధం చెప్పాలని నాకేమన్నా వాగారిందంటావా ?

వీర : (కేశవయ్యతో) ఇదేఁవిటి !

కేశ : ఏఁవిటో తేల్చుకుంటా యిప్పుడే. ఆఁ! వస్తా వుండండి. (వెళుతూ దశారితో) రారా అబ్బాయ్ (అంటూ కేశవయ్య దశారి వెళ్తారు)

వీర : (చుట్టవెలిగించి అక్కడే పచార్లు చేస్తూ వుంటాడు. ఇంతలో మాధవరావు జగన్నాథం వస్తారు)

మాధ : (వస్తూనే) మా నాన్న ఎటువెళ్ళారండి ?

వీర : భద్రయ్య గారింటికి.

మాధ : ఎందుకూ ?

వీర : మీ మేనమామ కూతుర్ని అంటే నీ కిద్దా మనుకున్న పిల్లని...

మాధ : ఆయనకు ఇదే ఒక్క అమ్మాయిలెండి.

వీర : ఓహో! ఆ అమ్మాయిని భద్రయ్యగారు తన కొడుక్కి కుదుర్చుకుంటున్నాడట. అదేవిటో తెలుసుకొద్దామని వెళ్ళారు.

మాధ : అయితే యీయన వెళ్ళడమెందుకు పని లేక !

జగ : (వ్యంగ్యంగా) నీ గురించే.

వీర : యీయన అదుర్దాయేగాని (మాధవరావుతో) నీ వన్నట్టు వెళ్ళటం అవసరమే ననుకుంటా.

జగ : నువుకూడా అట్టా మాట్లాడితే ఎట్టా బావా! కాళ్ళుబట్టుకు గుంజితే చూరుబట్టుకు వేళ్ళాడ్డం మనకు అలవాటేగా.

వీర : (విసుగ్గా) మరీ కట్టలు తెగి మాట్లాడుతున్నావ్. ఇవ్వాళ నీకేదో పురుగు తొలిచినట్టుంది.

జగ : నాకా! (నవ్వుతాడు)

వీర : ఏఁవిటిరా నీ గొడవ. అర్థం లేకుండా.

మాధ : ప్రతిమాటకూ అర్థముండాలని ఎక్కడుంది లెండి.

జగ : వుంటేమాత్రం మనకు తెలియాలని ఎక్కడుంది?

మాధ : ఆయనకు చెప్పదల్చుకున్న దేదో స్పష్టంగా చెప్పరాదూ! ముసుగులో గుద్దులాటెందుకూ ?

జగ : దానికీ సమయా సమయా లుంటాయ్.

వీర : ఏఁవిటి వుందేది నీ పిండాకూడు.

జగ : ఆఁ. అదే అదే.

కేశ : (ప్రవేశిస్తూ) పీ డెంత? వీడి బ్రతుకెంత? చూస్తాను. నన్ను కాదని వీడు బాగుపడి చచ్చే దేఁవిటో !

వీర : ఏం జరిగిదండీ ? అరిచి చెప్పింది నిజమే నన్న మాట.

కేశ : నిజమే - నిజమే - పీడా వదిలింది.

జగ : అంతే, అందని ద్రాక్షపండ్లు పుల్లన.

కేశ : వీడి గుడ్డి కూతుర్ని ఇవ్వకపోతే మా వాడికి పెళ్ళి కాదంటావా ?

వీర : కాదని ఎవడంటాడు. అసలు మీ బావ మరదికి యీ దుర్బుద్ధి ఏఁవిటా అనిగాని.

మాధ : మా మామ చాలాదూరం ఆలోచించే ఈ సంబంధం చేసుకుని వుంటాడు.

కేశ : ఈ ఏడ్చు ఏడ్చేవాడు మనల్ని బజారుకు యీ డకడ మెందుకు ?

మాధ : ఎక్కడా గతిలేకపోతే ఆ పిల్లని నా కిద్దామనుకున్నాడు. ఇప్పుడు భద్రయ్యగారిలాంటి వియ్యంకుడు దొరికేసరికి ప్లేటు ఫిరాయించాడు. అంతే.

జగ : అదీ కిటుకు.

వీర : అయినవాడనీ లేదు, కానివాడనీలేదు. ఎవణ్ణి నమ్మటానికీ వీలులేకుండా వుంది.

జగ : ఎకరాల్ని నమ్మొచ్చు బావా.

మాధ : అదేగా భద్రయ్యగారు చేసిన పని.

జగ : ఆయన కట్నం తీసుకోడుగా !

మాధ : ఎందుకు కట్నం ? మా మామకు పది ఎకరాలుంది. ఒక్కటే కూతురు. మగపిల్లలులేరు.

వీర : ఎకరాలు రాగానే సరా ! పిల్ల మురికా, మొంగమూ, మంచీ - చెడూ చూడక్కర్లేదా ?

జగ : పిల్లవాడి మంచీ - చెడూ మనకు కావాల్సి వచ్చిందీ ! పిల్లను గురించి వాళ్ళు ఆలోచించటానికి.

మాధ : అందుకనే "తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు" అన్నాడు వేమన.

కేశ : అంటే ?

మాధ : అంటే కుమారుడు ప్రేమించిన పిల్లను కాదని ఆస్తికోసం గుడ్డిపిల్లను అంటగంట జూచే వారొకరూ--

కేశ : (బిగ్గరగా) మాధవా.

జగ : అంతేగాదు యువకుడు ఎంత యోగ్యుడైనా అతని తండ్రి కూరగాయలబేరం చేస్తున్నాడు గనుక తన కూతుర్నివ్వని ఘరానా తండ్రి యింకొకరు...

వీర : (బిగ్గరగా) జగన్నాథం.

జగ : (వ్యంగ్యంగా నవ్వుతూ) గుమ్మడికాయల దొంగలు !

మాధ : భుజాలు తడుము కుంటున్నారు.

కేశ : ఏఁ వీరయ్యగారూ.

వీర : ఆఁ.

కేశ : నాకు తెలియకడుగుతాను. ఒకడి నోరుచేతి క్రింద గంజినీళ్లు తాగకుండా కూరగాయల వ్యాపారం చేసుకుంటే తప్పా ?

వీర : అహాఁ. అదికాదు. యీడేర్ని వెధవపిల్లను ఇంట్లో వుంచుకుని ఎల్లకాలం ఏడుస్తూ కూర్చునేకంటే తగిన వరుడికిచ్చి పెళ్ళిచేస్తే తప్పా ?

మాధ : ఏదీ తప్పుగాదు.

(దళారి ప్రవేశం)

దళా : (జగన్నాథంతో) ఏఁవయ్యా ? నాకు కమీసను యివ్వాలిసుకుందని గిత్తను నువ్వేకుదుర్చుకుంటావ్. బలేవాడివే మొత్తానికి.

జగ : ఏం నువ్వు చూపించిన గిత్తనే కొనాలనుందా?

దళా : ఓయ్. నేను చూపించకుండా ఈ ఊళ్ళో నీకు గిత్తనమ్మే దెవడయ్యా.

జగ : నేనే చూసుకున్నా - నేనే కొనుక్కున్నా.

దళా : ఎక్కడుంది గిత్త ?

జగ : ఇక్కడే.

దళా : ఇక్కడా ! ఎక్కడయ్యా ?

జగ : ఇదిగో ! (అంటూ మాధవరావుకు షేక్ హాండ్ యిస్తాడు.

దళా : (నవ్వి) ఓ, సో, ఐ. బలే గిత్తలబేరమే. నాతోవచ్చి మీరిద్దరూ పెడ పెడగా గుస గుస లాడింది యిదా ? (కేశవయ్యవైపు తిరిగి) ఏఁమావో ! నీపని ఇల్లే.

కేశ : (తెల్లబోయి) ఏఁవిటోరా ఇదంతా మాయగా ఉంది.

జగ : మా పెద్ద మేనగోడలేనండి రెండో పెళ్ళి చేసింది. అంటే మా వీరయ్య బావ కూతురే.

కేశ : అట్లాగా ?

జగ : ఆఁ. ఆ పిల్ల చెల్లెల్నే మీ అబ్బాయి ప్రేమించింది.

కేశ : సరి సరి.

వీర : మన అమ్మాయిని యీ అబ్బాయి ఎప్పుడు చూచాడురా !

జగ : మాధవరావు చెడుగుడులో మంచి ప్లేయరు. మేం యిద్దరం ఒక టీములోనే ఆడుకూ వుంటాం.

కేశ : ఆఁ.

జగ : మనవూళ్లో ఆటల పోటీలు జరగలా బావా ?

వీర : ఊఁ. జరిగినయ్.

జగ : అప్పుడు యితను మా యింటికి వచ్చాడు.

వీర : ఆఁ. వస్తే !

కేశ : ఏముంది. అబ్బాయిని అమ్మాయి, అమ్మాయిని అబ్బాయి చూసుకుని వుంటారు.

వీర : మరి అయితే నాకు చెప్పలేదేరా ?

జగ : నువు వింటేనా ? అక్కయ్య చెప్పబోతే మండిపడి ఇటు బయలుదేరావ్.

వీర : అందుకేనా నువ్వు నావెంట బడింది.

కేశ : సరె, సరె లేవండి బావగారూ! భోజనానికి. (వీరయ్య - కేశవయ్య లేచివెళ్తూ వుంటారు. వాళ్ళను చూస్తూ దళారి)

దళారి : వారేవా ! యిన్ని బేరాలు చేశానుగాని యిట్లాంటి గిత్తలబేరం ఎక్కడా లేగల్లా !

[ తెర ]

ఎంత తియ్యటికల నా విశాలాంధ్ర !
ఎంత దూరపుతార నా విశాలాంధ్ర !
ఎంత బరువైన నిట్టూర్పు నా విశాలాంధ్ర !
ఎంత గర్వపు రొమ్ముచరుపు నా విశాలాంధ్ర !

శాంతిసౌఖ్య సౌభాగ్యసాంద్ర, విశాలాంధ్ర
వడగొట్టిన నాజాతికి చల్లటి చలివేంద్ర
ఏమికొరత ఏమికొదవ నా జాతికి ?
మూడుకోట్ల భగీరథుల కన్న నా తల్లికి ?

మూడుకోట్ల తెలుగువాళ్ళ మొక్కరమై,
విశాలాంధ్ర మనకందరికీ ఉమ్మడిపొలమై,
హలంపట్టి పొలందున్ని ఆంధ్రత్వం పండిద్దాం
ఇంటింటా ఆంధ్రత్వపు దీపావళి వెలిగిద్దాం.

ఎంత తియ్యటికల, ఎంత దూరపుతార !
ఎన్ని దశాబ్దాల పరివేదనాశ్రుధార !
మూడుకోట్లగుండెలలో మండిపడే అగ్నిధార !
నా విశాలాంధ్ర—మధుర మధుర దయాస్మేర,
ఎంత దూరపుతార !

—సవ్యసాచి.

# మన 'శారద'



ఎక్కడి పుదుక్కోట్టై, మరెక్కడి ఈ తెనాలి? ఆ తమిళనాడునించి ఈ తెలుగునాటకు పదమూడేళ్ళ కుర్రాడు తరలివొచ్చాడు.

అతనికదే మహా ప్రస్థానం.

తెనాలిలో అడుగుపెట్టిందే తడవుగా హోటల్‌లో వర్కర్‌గా ప్రవేశించాడు. రోజుకి పద్ధెనిమిది గంటలు ఎత్తిన నడుం వొంచకుండా పనిచెయ్యాలి; చేశాడు. అది మాత్రమే చేయలేదు. పరభాష అయినప్పటికీ తెలుగుభాషను నేర్చుకోసాగాడు.

మనిషి వస్తుతః అంత ఆరోగ్యవంతుడు కాడు. అనుక్షణం ఆకలితో పోరాడకలసినవాడు ఆరోగ్య వంతుడుగా ఎలా ఉంటాడు? కాని, అతని మనస్సుమాత్రం నిత్యాగ్నిగా వెలిగింది; జ్వలించింది.

వీటికితోడు తండ్రి చావుని కళ్ళారా చూశాడు. ఔను, అతని సున్నితహృదయం గాయపడింది. తట్టుకోలేక పోయాడు. మూర్ఛపోయాడు. ఆ మూర్ఛ మృత్యువుతో పాటే వెన్నాడుతూ వొచ్చిందతన్ని.

తెలుగు నేర్చాడు. చదివాడు. రాయాలనుకున్నాడు. మొదలు పెట్టాడు. జీవితం చాల అనుభవాన్ని ఇచ్చింది. అదే అతని రచనకు ఆలంబన. తనకు తానే ప్రయత్నించి, ఒకరిద్దరు తెలుగు మిత్రుల్ని కలుపుకొని 'ప్రజావాణి' పేరుతో వ్రాతపత్రికను ప్రారంభిం

చాడు. ఈ సాధన, తపస్సు అతనికి తెలుగు సాహిత్య రూపాల్ని ఆకళింపు చేసుకోడానికి ఎంతో తోడ్పడింది.

ఆకలి, దారిద్ర్యం, చీకట్లో బ్రతుకు, కన్నీళ్ళు ఇవే అతని కలంనుంచి వేయిముఖాలతో రూపొందాయి. ఇంతలో అతనికి నిండైన అవకాశం ఒకటి వచ్చింది. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం పెదపూడిలో సాహిత్య పాఠశాలను నిర్వహించింది. అందులో చేరాడు యస్. నటరాజన్. ఆ నెలరోజులు గొప్ప ఆత్మీయతనీ, వెలుగునీ, సంపాయించాడు. అది అతనికే చాతవును.

లోలోపలి ఆవేదన, స్వాతంత్ర్యేచ్ఛ విజృంభించింది. 'ప్రపంచానికి జబ్బు చేసింది' అన్నాడు చిన్న స్కెచ్‌లో. ఆ జబ్బు లక్షణాలేమిటో అతనికి పూర్తిగా తెలుసు. తొలిగా 'ప్రజాశక్తి' ఆ స్కెచ్‌ని ప్రకటించి, నటరాజన్‌ని ఆంధ్రదేశానికి పరిచయం చేసింది. తదాది అతని రచనలు ఒకదాని వెనుక ఒకటి వెలువడ్డాయి. పేరు మార్చుకుంటేగాని చోటు దొరకలేదు. 'శారద' అనుకొన్నాడు. సరస్వతిని సాధించాడు కాని సాదాన్ని మాత్రం సాధించలేక పోయాడు.

ఒడుదుడుకులు, వల్లమాలిన పస్తులు, తప్పలేదా యువరచయితకు.

'యదార్థవాదీ లోకవిరోధీ' అన్నట్లు అతని మనః ప్రవృత్తి యజమానులకు గిట్టలేదు. వాళ్లకు చాతయిందల్లా హోటల్‌నించి గెంటడమే. శారద వీధినపడ్డాడు. చెదరలేదు. నడివీధిన నిలబడి ఒక చేత్తో గారెలు అమ్మాడు. మరో చేత్తో 'మంచీచెడూ' నవలరాశాడు.

'మంచీచెడూ' చదివి ఆంధ్రదేశం శారదవేపు చూచింది. చిత్రంగా వశీకృతమైంది. 'శారద'మీద ఎన్నెన్నో ఆశలు పెట్టుకుంది. ఆ ఆశల్ని వృథా చెయ్యనని హామీ ఇచ్చాడు శారద. అలాగే ఇటు గారెలూ, అటు నవలల్నీ అందిస్తున్నాడు. గారెలబేరం గిట్టలేదు. తిరిగి హోటళ్లోనే తలదూర్చాడు. పేరు వెళ్ళినంత వేగంగా డబ్బుమాత్రం చేతికి రాలేదు.

ఆ ఆవేదనతోనే, ఐదవ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభలో 'శారద' ఓ చిన్న తీర్మానం తెచ్చాడు [ఆ తీర్మానం వేరేచోట చదవగలరు]. ఆ తీర్మానంలో రచయితలకు లభించే పారితోషికంగురించి ఎంతో హృదయావేదనని తెలియచేశాడు.

అంతే!

ఏ మిత్రులతో సాహితీద్వారంలోంచి ప్రవేశించాడో, ఆ మిత్రులకు 'మీ రచనలకు సరైన పారితోషికం పొందండి. అది మన హక్కు!' అని హెచ్చరిస్తూ వెళ్ళిపోయాడు.

పక్షం గడిచింది. 'జబ్బుచేసిన ప్రపంచం' నించి అతనికెన్నో దుఃఖాలు కలిగాయి. అదే అతన్ని లొంగదీసింది. కడకంటా పోరాడాడు జయించాలని. సరస్వతిని జయించాడు కాని, మృత్యువుముందు తల వొంచాడు.

ఆంధ్రుల అపారాభిమానాన్ని సాధించిన 'శారద' అకస్మాత్తుగా వెళ్ళిపోయాడు. ఎన్నో కలల్నీ, మరెన్నో జీవితప్రయోగాల్నీ అలానే వొదిలేసి వెళ్ళిపోయాడు. నూటకథల్ని రాసిన శారద, ఐదారు నవలల్ని రచించిన శారద, ప్రతిరచనద్వారా పాఠకుణ్ణి పలకరించిన శారద మృతుడు కాడు. అ మ రు డు.

అభ్యుదయ రచయితలందరికీ ఆత్మీయుడూ, అభిమాన పాత్రుడూ అయిన 'శారద'ను ఏనాడూ ఎవరూ మరిచిపోరు. మరిచిపోలేరు.

— చి రం జీ వి

# పాలపుంత

[ ఈ శీర్షికక్రింద ప్రముఖ రచనలను పునర్ముద్రించుతున్నాం. ]

## నేటి తేట తెలుగు

### కీ॥ శే॥ గిడుగు రామమూర్తి పంతులు

[1913 వ సంవత్సరం ఏప్రిలు నెల 9 వ తేది ఆంధ్రపత్రికలో ప్రచురించిన వ్యాసం నుండి కొన్ని భాగాలను పాఠకుల ఉపయోగార్థం ప్రచురిస్తున్నాము.]

"అనావశ్యకములయిన నిర్బంధములను తీసివేసి భాషను సుసాధ్యము చేయుట పరమ ప్రయోజనకరము...భాషాభివృద్ధినిబట్టియే జనుల నాగరికతయు వృద్ధిచెందుచుండును. కనుక జనుల యభివృద్ధినిగోరు దేశాభిమానులందఱును ముందుగా నాంధ్రభాషను మంచిస్థితికి దీసికొని వచ్చుటకై ప్రయత్నింపవలెను. మనవారు దేశభాషలు మంచిస్థితిలో లేవాయని యడుగవచ్చును. లేవనియే మేము దృఢముగా చెప్పగలము... (పండితులు) తమ పాండిత్యమును కనబఱుపజూచుచున్నారే కాని, జనులకు తెలివిని గలుగుటకై లేశమయినను ప్రయత్నింపకున్నారు."- కం॥ వీరేశలింగము పంతులుగారి బంగారపు పలుకులు.

• • •

మన తెలుగుదేశములో బ్రిటిషుగవర్నమెంటువారు సర్వజనసామాన్యముగా చదువు చెప్పించడానికి మొదలుపెట్టి రమారమి అరవైసంవత్సరాలు అయినది. ఇంత కాలమూ పండితుల పాతతెలుగులోనే పుస్తకాలు వ్రాసి ఫస్టుక్లాసు మొదలుకొని ఎమ్.ఏ. క్లాసుదాకా చదివిస్తున్నారు. పండితులే తెలుగు పాఠాలు చెప్తున్నారు. పండితుల తెలుగు ఎంతమట్టుకు వృద్ధి పొందినది? ఈ పాతతెలుగు ఎంతమంది మాటాడగలరు? తెలుగువారిలో, ఇంగ్లీషు పుస్తకములవల్లనా, తెలుగు పుస్తకములవల్లనా, వ్యాపించినంతమట్టుకయినా, ఇప్పుడు విద్య వ్యాపించినది? ఈ అరవై సంవత్సరములలో, ఎంతమంది ఇంగ్లీషు, అన్యభాషఅయినా, చదవడము, వ్రాయడము, మాటాడడము నేర్చుకొన్నారో చూడండి. పాతతెలుగు పండితులయినా మాట్లాడలేరే! పాత తెలుగు పండితులయినా పొరబాట్లు లేకుండా వ్రాయలేరే! తెలుగు కాంపోజిషన్ గురించి సెనిటులో మొన్న మొన్న చర్చజరిగినప్పుడు ఏమన్నారు విద్యాధికార్లు? తెలుగు పరీక్షలో నెగ్గిన బి.ఏ.లు తెలుగున సలక్షణముగా ఒకకథ అయినా వ్రాయలేరట!...ఇండియా గవర్నమెంటువారున్ను, దేశభాషలలో విద్య వ్యాపించవలసినంతమట్టుకు వ్యాపించలేదు అనిన్ని, ప్రజలకు లోకవ్యవహారములో తెలివితేటలు కలిగించే విద్యలు దేశభాషలలో చెప్పలేదు అనిన్ని, ఇంతకాలమూ విద్యావ్యాపనముకై చేసిన ప్రయత్నము, పెట్టినఖర్చు ఇంచుమించుగా వ్యర్థమైనది అనిన్ని, ఇకమీదట వాడుకలో ఉన్న భాషలలోనే తెలివి కలిగించే విద్యలు నేర్పడానికి ప్రయత్నము చేయవలసినది అనిన్ని వ్రాసి, రిజలూషన్ ప్రకటించి ఉన్నారు.

జనాభా లెక్కలలో చేసినట్టు, తెలుగున సంతకము చేయగలవారందరూ చదువు వచ్చినవారే అని ఒప్పుకొన్నా తెలుగువారిలో చదువుకొన్నవారు వేయింటికి 75 గురుమాత్రమే. అంటే, వేయింటికి 925 గురు తెలుగువారు సంతకమైనా చేయలేరు అన్నమాట. తెలుగువారి అందరిలో బ్రాహ్మణజాతివారు గదా విద్యాగురువులు, ఈ బ్రాహ్మలు తెలుగు వారిలో నూటికి ముగ్గురే వున్నారు... బ్రాహ్మలలోనే చదువు రానివారు ఇంకా నూటికి అరవైమంది వున్నారు. ఇకను ఇతర జాతులవారిమాట చెప్పేది ఏమున్నది?... నలుగురు పండితులు నాలుగు సంస్కృతపుముక్కలు, నాలుగు పాత తెలుగుముక్కలు వల్లించి, రెండు బండి ఱాలు, రెండు అరసున్నలు, రెండు బండమాటలు పెట్టి పాతగొడవలు, రెండు పురాణాలు తెలిగించగానే తెలుగుభాష వృద్ధిలోనికి వచ్చినట్టేనా? ఓనమాలయినా రాని కోట్లకొలది తెలుగువారందరూ తెలివిగలవారున్ను, నాగరికులున్ను అయినట్టేనా?...

నాగరికజాతిలో పూర్వకాలములో చదవడము వ్రాయడము అరుదే. ఇప్పటి లోకవ్యవహారమయితే ముక్కాలు మువ్వీసము కాగితముమీదనే జరుగుతూ ఉన్నది. వ్రాయలేనివారు, వ్రాసినది చదవలేనివారు,

ఎంత వెనకపడుతున్నారో, ఎంత నష్టము పొందుతున్నారో చూడండి....అర్జీలు, సమనులు, స్టైఇంట్లు, వాక్మూలాలు, నోటీసులు, డిక్రీలు, వకీళ్ళు, మని ఆర్డర్లు, రైల్వేటిక్కెట్లు, మందుల కేటలాగులు, ధరవరల పట్టీలు, ట్రేడు డైరెక్టరీలు, రిపోర్టులు, గెజట్లు, మ్యూనిసిపల్ ప్రొసీడింగ్సు, న్యూస్ పేపర్లు, పాంప్లట్లు, పుస్తకాలు, బులిటిన్లు మొదలయినవి ఎన్ని ఉన్నవో చూడండి......తెలివే ప్రధానమైతే నేటి నేటి తెలుగులోనే తెలివి సులభము కాదా?

...విద్యవల్ల కలిగే ఫలము. లోకవ్యవహారానికి పనికి వచ్చే జ్ఞానమా? లేక కేవలము శబ్దజాలమా? ఏదో ఒకటి వల్లించడమా? వల్లించిన దానిలోని విషయము తెలుసుకోడమా? జ్ఞానము కలిగించే సాధనము ఎంత సుకరముగా ఉంటే అంత మంచిది గదా!...

...పూర్వము వేదములలోని భాష లోకులు మాటలాడుకొనే రోజులలోనే, ఇప్పుడు బొబ్బిలిపాటలాగు వేదములు అందరికీ బోధపడేవి. రానురాను ఆభాష మారి, తుదకువాడుక లేక, ఎవరికీ తెలియకుండా అయినది. ఇట్లా మారి ఏర్పడిన కొత్తభాషే సంస్కృతము. భారతము పంచమవేదమని చెప్పి, పూర్వపు ఇతిహాసములు అన్నీ ఇమిడ్చి, అందరికీ తెలిసేటట్టు, అందరూ వాడుకొనే భాషలోనే తర్వాత తేటగా వ్రాసినారు. ఆ భాషను వ్రాసినవారు, పూర్వభాషతో కలపక, తమ కాలపు వాడుకను అనుసరించే వ్రాసినారు. వాడుకలో ఉన్న భాషకు మార్పు కలగడము అనివార్యము గనుక, ఆ సంస్కృతముకూడా కాలక్రమమున మారి, ప్రాకృత భాషలు ఎన్నో ఏర్పడినవి. ఆభాషలలో గ్రంథాలూ పుట్టినవి...సంస్కృతములో వ్యాకరణము వ్రాసినవారు అయినా వాడుకలో ఉన్న భాషనే పరీక్షించినట్టు అనేక నిదర్శనములు ఉన్నవి. శబ్దముల రూపభేదముల అంగీకరించినారు; స్వరము ఏర్పరచినారు, తూర్పు దేశమువారు ఈలాగు ఉచ్చరిస్తారని, ఉత్తరదేశమువారు ఈలాగు ఉచ్చరిస్తారని, లోకములో వాడుక ఈ లాగు ఉన్నది, ఛందస్సు (అనగా వైదికభాష)లో ఈలాగు ఉన్నది అని, ప్రత్యేకముగా పాతభాష, కొత్తభాష అని రెండుభాషలు ఉన్నట్టుగా చూపించినారు.

పాతవి పట్టుకొని పాకులాడేవారు కొందరు, కొత్తవి కొనియాడేవారు కొందరు, ఎప్పుడూ ఉంటారు. పాతగిల్లినకొద్దీ పరిచయము తక్కువ; గౌరవము ఎక్కువ; దూరమైన కొద్దీ దృష్టి సూక్ష్మము అవుతుంది. రామాయణముకన్నా, శాస్త్రముకన్న వేదము గొప్పది. శాస్త్రి గారికన్నా అవధానులుగారు గొప్పవారు. తెలుగు రామాయణముకన్నా సంస్కృత రామాయణము చదివితే పుణ్యమెక్కువ. తెలుగు పండితులకన్నా సంస్కృత పండితులు ఎక్కువ గొప్పవాళ్ళనుకుంటారు. తెలుగు పండితులుకూడా తమకు సంస్కృతములో పాండిత్యము ఉన్నా, లేకపోయినా ఉన్నట్టే నటిస్తారు. పాత తెలుగు పండితులు కవిత్రయమును ప్రమాణముగా ఉంచుకొని సంకర తెలుగు వ్రాసేవారిని తక్కువగా చూస్తున్నారు. కొత్త తెలుగున వ్రాసే వారిని చూసి వారు మీరు ఆక్షేపిస్తున్నారు. పల్లెటూళ్లో రవిక తొడుక్కుంటే సాని, పట్నములో కోటుతొడుక్కొంటే దొరసాని; అని ముసలమ్మలు అన్నట్లే.

...మొదటి తెలుగు కవులు తమ వ్యవహారములో ఉన్న తెలుగు భాషను వ్రాసినారు. వారి తెలుగు కాలక్రమమున మారినది ఎంతో కొంత. దానికిన్నీ, ఇప్పుడు వాడుకలో ఉన్న తెలుగుకున్నూ భేదముండబట్టి, పాతభాషలో చెప్పిన వాక్యముల అర్థము ఆ భాష బాగా చదువుకొన్న పండితులకుగాని స్పష్టముగా తెలియడములేదు...పాత భాషలో కల్పించిన వేదములలోని సారము కొత్త సంస్కృతములో భారత రామాయణములు వ్రాసి చెప్పినట్టుగా, పాత తెలుగులో వ్రాసిన పుస్తకములలోని విషయములు సర్వసామాన్యముగా తెలిసేటట్లు చేయవలెనంటే, కొత్తతెలుగు అనగా ఇప్పుడు వాడుకలో ఉన్న తెలుగుభాషలో తిరిగి చెప్పవలెనుగదా! కొత్తవిద్యలు నేటినేటి తెలుగులో కాకి తమువీరాద వ్రాస్తే సులభము కాదా? ఈలాగు చేయడము అన్ని దేశములలో జరుగుతున్నది కాదా? పది పదిహేనుమార్లు పాతగిల్లిన ఇంగ్లీషులోని క్రీస్తుమత గ్రంథములు మాటిమాటికి కొత్తకొత్త ఇంగ్లీషులో వ్రాస్తున్నారు కారా?......

విద్యలుకూడా కలకాలము ఒక్కరీతిని ఉండవు; ఉండలేవు. నాగరికత ఎక్కువ అయినకొద్దీ ఈ లోక వ్యవహారము శాఖోపశాఖలుగా భిన్నభిన్నమై దుర్బోధము, దుర్లభము అవుతుంది...సర్వజన సామాన్య విద్యవల్ల తెలిసేవి- వ్రాయడము, చదవడము, కొంత గణితము, దేశచరిత్ర, భూగోళ వివరము, జగత్తు ఉత్పత్తి వృద్ధి బోధించే శాస్త్రము, రాజ్యపరిపాలన, ప్రజల నడవడ, దేహారోగ్యము మొదలయినవి. ఈవిద్య ఎంతో కొంత వచ్చిన పిమ్మట, ప్రజలు తమ తమ వ్యాపారమునకు ఉపకరించే విద్యను గ్రహించవలసి ఉన్నది. కడుపుకూటి కోసము దివమంతా శ్రమ

పడవలసినవారికి అందరికీ అన్ని శాస్త్రవిద్యలు స్వాధీనమవుతవా? పాత తెలుగు పాండిత్యము పౌరాణికులకు, తెలుగు కవులకు కావలెను. లేదా భాషా తత్త్వము తెలుసుకొనేవారికి కావలెను; కాని అందరికీ ఎందుకు? అందరూ సంస్కృతము నేర్చుకోలేరు? వేదములు బ్రాహ్మణులయినా చదవలేరు?...

పూర్వకాలమున మన దేశములో పుట్టిపెరిగిన విద్యలలో ఎన్నో రూపుమాసిపోయినవి. నిలిచినవయినా అన్నీ ఇప్పటి లోక వ్యవహారమునకు అనుకూలములుగా లేవు. లోకములోకూడా మార్పు చెందినది. ఏదీ వృద్ధి పొందదు...మార్పునుబట్టే వృద్ధి...

...పూర్వకాలమున మన దేశములో ద్విజులేగదా విద్యలు నేర్చుకొనేవారు; వారిలోనైనా అందరూ కారు; సర్వసామాన్యముగా ప్రజలందరికోసము ఉద్దేశించి ఏ రాజున్ను బడులు పెట్టించి విద్యలు చెప్పించలేదు. బ్రిటిషు వారిపరిపాలనవల్లనే మనకుకలిగినది ఆ భాగ్యము. అయితే దురభిమానముచేత పండితులూ, పండితమ్మన్యులున్నూ, నిజము తెలియని విద్యాధికారులున్నూ, ప్రజలకు అందరాని పండుగా చేసినారు విద్యను. పండితులు కవనముకోసము కల్పించుకొన్న కృత్రిమభాషలో బాలబోధలూ, కథలూ, చరిత్రలూ వ్రాస్తూ పిల్లలు చదువలేకుండాను, చదివినా అర్థంకాకుండాను చేసి, ఫస్టుక్లాసు మొదలుకొని బి. ఏ. దాకా తెలుగు చదివినా ఇంగ్లీషు చదివినా, పండితులు, వేదాలు, శాస్త్రాలు చదివినట్లూ ప్రతిదీ బండవల్లన వల్లించడం మప్పి, పిల్లల బుద్ధి వికసించకుండా మాన్పి పాడుచేసినారు. తెలివిపుట్టడానికి తేలికగా తెలిసేమాటలతో విద్య చెప్పవలెనన్న సంగతి ఆలోచించరు...మన దేశములో పూర్వ సంప్రదాయము ప్రకారము తెలుగు భాష నేర్చుకొనేవారు ఓనమాలు నేర్చుకొన్న వెంటనే సంస్కృతములో వ్రాసిన బాల రామాయణం, తర్వాత అమరము, ఆంధ్రము, శబ్దాలు, సంస్కృతకావ్యాలు, నన్నయభట్టీయము ఈ వరుసను చదువుకొని ప్రబంధాలు ఆరంభించేవారట! ఇదే అనులోమ మార్గమట! వేదము వేంకటరాయశాస్త్రిగారు గ్రామ్యాదేశ నిరసనములో ఈ పద్ధతిని ఎంతో కొనియాడుతూ వ్రాసినారు. ఈ చొప్పున తెలుగు చెప్పక పోవడముచేతనేనట తెలుగు పిల్లలకు తెలుగు బాగా రాకపోవడము! భళీ భళీ! నిజము! శాస్త్రిగారు సెలవిచ్చిన సంగతి వాస్తవమే! ప్రతి తెలుగువాడు తెలుగు పండితుడు కావలెనంటే ఇదే ఉత్తమమైన పద్ధతి! అయితే, ఇప్పుడు "గ్రాంథికశైలిని", "వ్యాకరణశైలిని" నిర్దుష్టముగా వ్రాస్తున్నామని ప్రగల్భాలు పలుకుతూఉన్న ఎమ్. ఎ. పండిట్లు, బి. ఎ. పండిట్లు, ఉత్త పండిట్లు, అనులోమముగా శాస్త్రిగారు చెప్పిన పద్ధతిని తెలుగు అభ్యసించినట్లు కనబడరు. అంతా హాఫ్‌క్యా పండితులే. పండిట్ వావిలకొలను సుబ్బారావు పంతులవారంతటివారు "సందేహ నివృత్తి" అని సంస్కృతములున్ను, "బుజావు చేయుట", "మాటల ధోరణి"..."త్రోసెడి పిల్ల", "తీసివైచినది", "తిగిచి వేయుము" అని అసంస్కృతాలు, సంకరాలు, పాత - క్రొత్త తెలుగులు కలిపి పిసికి ప్రయోగించినారు. వీరు గుండెలు కుళ్ళ వల్లించినారట సంస్కృత నిఘంటువున్నూ, వ్యాకరణమున్ను!...వీరికే స్వాధీనముకాలేదీ భాష; ఈ కాలపు బడులలో చదివే పిల్లలకు పట్టుపడడము కష్టముకాదా? ఒక్కొక్క కాలేజీకిన్ని, ఒక్కొక్క హైస్కూలుకున్నూ, ఒక్కొక్క తెలుగు పండితుడు కదా ఉన్నాడు! తక్కిన మాష్టరులలో ఒక్కడయినా తెలుగు టెక్స్ట్ పాఠము చెప్పలేడు కదా! ఏమి గతి!...కారణము ఏమిటి? తెలుగు గ్రంథాలలోని తెలుగు యీ తెలుగు మాష్టర్లు నిత్యమూ వాడుకొంటూన్న తెలుగు కాదు. అది వేరేభాష. ఇంగ్లీషు గ్రంథాలలో వున్న ఇంగ్లీషు బోధపడని ఇంగ్లీషు మాష్టర్లను చూచినారా ఎక్కడయినా?...తెలుగు బి. ఎ. గారు తాము పరీక్షకు చదవని తెలుగు పుస్తకము ఒకటీ స్వతంత్రముగా చదవ గలరా?...ఇంతమందికి ప్రమాదము కలగడానికి కారణము ఏమిటంటే, బాగా పరిచయముగల స్వభాషలో గ్రంథములు వ్రాయక పరిచయములేనట్టి దిన్ని, పాణిని వ్యాకరణమువంటి విపులమయిన లక్షణము లేనట్టి దిన్ని, పూర్వకవుల కావ్యములే శరణంగా గలదిన్ని అయిన ఒక కృత్రిమభాషలో వ్రాయడమేను. స్వభాషలో వ్రాయడము స్వగ్రామములోను, స్వగృహములోను తిరుగడమువంటిది గదా...కర్రబొమ్మకూ, జీవముతో వున్న మనిషికీ ఎంతభేదమో అంతభేద ముంటుంది అట్టి కృత్రిమభాషకున్నూ, వాడుకలోవున్న భాష కున్నూ, కంటిచూపులో కనబడేటట్లు నోటిమాటతో వినబడవలెను మనోభావము...

అవిచ్ఛిన్నముగా సంప్రదాయానుసారము కవులు అందరు నన్నయ కాలము మొదలుకొని నేటివరకూ వాడుకచేస్తూ వచ్చిన భాషను విడిచి, గ్రామ్యభాషను గ్రంథములు వ్రాయడము ఉచితముకాదని వాదించే వారి వాదములో అనేక దోషములున్నవి. భాష మారదు అని వాదిస్తారా? ప్రత్యక్షముగా కనపడు

తున్నదానికి విరుద్ధముగదా! భాష మారకూడదని వాదిస్తారా? ఈ విధి ఎక్కడనున్నదో మొదట చెప్పవలెను. వ్యాకరణము చదువుకుంటే భాష చక్కగా వస్తుందంటే, అనుభవానికి విరుద్ధము. ఏ దేశములో అయినా గొప్పకవులు వైయాకరణులు కారు. వ్యాకరణంలోని మాత్రము ఒకటి అయినా రాకుండా చక్కగా వ్రాయగలవారు అనేకులున్నారు. గ్రామ్యమనగా అధమజాతుల వాడుక. ఇప్పటి ఉత్తమ జాతులవాడుక గ్రామ్యము అనకూడదు. ఒకవేళ గ్రామ్యమనగా పూర్వభాషా సంప్రదాయమునకు విరుద్ధము అయినది అంతే, నన్నయ వాడుకకు భిన్నముగా ఉన్న తిక్కనవాడుక, నన్నయతిక్కనల వాడుకకు భిన్నముగా ఉన్న, తర్వాతికవులవాడుక, గ్రామ్యమని చెప్పవలెను. అప్పుడు గ్రామ్యమందు దోషమే ఉండదు. మంచిగాని చెడ్డగాని, ఔచిత్యముగాని, అనౌచిత్యముగానిఏ శబ్దమునకూ శాశ్వతమైన లక్షణము కాదు...

అయితే, వాడుకలో ఉన్న భాష ఒక్కలాగు ఉన్నదా?...అని...కొందరు ఆక్షేపిస్తున్నారు. గ్రాంథికభాషమాత్రముఒక్కమాదిరినిఉన్నదా? చూడండి! సంధి విషయములో కొన్నిచోట్ల బహుళమట, కొన్నిచోట్ల వైకల్పికమట, కొన్నిచోట్ల లేదట!! పరశా దేశము పండితుల యిష్టము; విహితము కాదు. వాడు సూ (చూ) చె; వాడు వో (పో) యె!!! ఉయ్యేల మొ|| రమారమీ పదిభిన్నరూపములు; ఒకరిత మొ|| రమారమీఅరవై; తెప్ప, తేప మొ|| వాటికి ఎన్నటికేలండేసి ఉన్నవి రూపములు: IV బహువచన రూపములు అనేకరీతులు కొడవండ్లు మొ|| అయిదు. V ద్వితీయా విభక్తి రూపములు ఉ|| కంసునిన్, కంసునిఁ, కంసుని, కంసుఙ్, కంసుఁ, కంసుం!...ఇటువంటి వ్యత్యాసములు ఎన్నో ఉన్నవే గ్రాంధికభాషలో! వీటిలో పదోవంతు అయినాఉండునా ఈకాలపునాగరికుల తెలుగుభాషలో భేదములు? పోనీ, తక్కువకాదు, ఎక్కువే ఉన్నది వ్యత్యాసము అని ఒప్పుకొన్నా, లోకవ్యవహారములో ఉండి, నోటను పలుకుతూ, చెవికి వినబడుతూఉన్న భాషను ఏదైనా గ్రహించడము, మాటలాడడము బహు సులభము...బొత్తిగా ఒకరి మాట ఒకరికి తెలియనంత వ్యత్యాసము ఉన్నదా గుంటూరి తెలుగుకూ, కర్నూలు తెలుగుకూ?...నా అనుభవాన్ని పట్టిచూస్తే, తెలుగు దేశమంతటా చదువు నేర్చినవారందరూ మాట్లాడేభాష ఇంచుమించుగా ఒకటే భాష; దిగువజాతులవారికి చాలామందికి ఈ భాష వాడుకభాష కాకపోయినా, వింటే తెలుస్తుంది; ఇది సులభముగా మాటలాడడము నేర్చుకోగలరు...ఇదే కొత్తతెలుగు! నేటి తేట తెలుగు; వ్రాస్తూఉన్న నా తెలుగు; చదువుతూఉన్న మీ తెలుగు...ఈ తేటతెలుగులో తెలివి కలిగించే విద్య అందరికీ సర్వసాధారణముగా చెప్పితే సరస్వతి తెలుగు దేశములో తాండవమాడదా?...

...పండితులారా! మీ దురభిమానము విడిచిపెట్టండి. దేశమంతా విద్య కావలెనని మొరపెట్టుకొంటూఉన్నది. సులభముగావచ్చే తేట తెలుగులోనే విద్య నేర్పడము సులభమైనప్పుడు, పాతభాష నేర్చుకొంటేనేగాని విద్యసంపాదించడానికి వల్లకాదు అని మీరెందుకు అడ్డుపెట్టుతారు? మీరు గ్రామ్యులు కారు కదా! మీ నోటనువచ్చే మాట అశ్లీలము కాదుగదా! మీరు నిత్యమూ వాడుకొనేభాష శంఖములో పోసిన తీర్థమువంటిది. అదే అందరికి ఇచ్చి ఉద్ధరించరాదా?

---

# సరస్వతీపూజ

## చింతా దీక్షితులు

...వార్షికోత్సవము సమీపించిందనగానే కూటస్థులందరూ ఒక్కమారు ప్రాయశ్చిత్తం చేయించుకొన్నారు. పొరుగింటివారికి పాచి చేసుకోవడానికి కాస్త గోమయమైనా దొరకలేదు. ఆ రోజుల్లో, ప్రాయశ్చిత్తమైపోయిన తరువాత కొందరు చిట్టెయ్యనాశ్రయించి కొత్తకొత్త డబ్బాలూ, డప్పులూ సంపాదించుకొన్నారు. శ్రీరాములు మేస్త్రీ బాజాభజంత్రీలను సిద్ధంచేసినాడు. ఆనాటికని కొత్త కొత్తగా సంపాదించిన ఎముకలతో కొత్త కొత్త బొమ్మలు తయారు చేశారు. అనాచార వంతులనందరినీ నోటికి వచ్చినట్లు తిట్టడానికి లక్ష్మినరసుని నియమించారు. అందుకోసమని లక్ష్మినరసు కత్తులూ, కటారులూ సిద్ధము చేస్తున్నాడు. గ్రామ్యులందరికీ చిల్లంగి పెట్టి ప్రయోగము చేస్తానని కిష్టప్ప శాస్త్రుల్లుగారు పూనుకొన్నారు. అందుకోసమని ఆయన కొంతకాలము వరకూ చాటుకావ్యరచన కట్టిపెట్టినాడు. శ్రీరాములు మేస్త్రీ అంతా పైహంగు చేస్తున్నాడు. ఈ రూపకంగా రెండురాళ్ళు కొట్టుకుందామని బతుకు తెలివిగలవాళ్ళు శ్రీరాములు మేస్త్రీనిఆశ్రయించారు. కొత్తకొత్తవాళ్ళని కూటములో చేర్చుకొనుటకు చాలా ప్రయత్నాలు జరిగినవి. కిష్టప్ప శాస్త్రులు నన్ను కూటములో చేరమని చాలా బలవంత

పెట్టాడు. కాని "ఇంకా తనవంటివారి శుశ్రూష కొంతకాలము చేస్తేనేగాని అంత పదవికి తగ"నని సమాధానం చెప్పాను. నేను కూటములో చేరితే నాకు కోశాధ్యక్షపదవి యిప్పిస్తానని నాచేత పుస్తకాలు వ్రాయించి టెక్స్టుబుక్కులుగా పెట్టించి లాభము వచ్చేటట్లు చేయిస్తాననీ శ్రీరాములు మేస్త్రీ చాలా చాలా చెప్పాడు. కాని నాకు ప్రాప్తముండవద్దూ!

కూటస్థులలో ప్రసిద్ధులూ, కూటముమీద సానుభూతిగల తిత్తులయ్యలూ ఆనాడు వ్యాసములు చదువుటకు వప్పుకొన్నారు. కొందరీ వ్యాసములు సంస్కృత భాషలోనూ, కొందరు పద్యరూపకముగానూ, కొందరందులో గద్య చిత్రబంధ కవిత్వములతోనూ, కొందరు శ్లేష యమకాదులతోనూ బహుచక్కగా భారతి మంతేసి గ్రంథములు వ్రాసి మేస్త్రీకిచ్చారు. మేస్త్రీ వాటినన్నింటినీ పరీక్షించి చూచి ఆంధ్రదేశం వాఙ్మయ విషయంలో వెనకంజ వెయ్యడంలేదుగదాఅని సంతోషించాడు. వ్యాస విషయము లేమనగా ౧ గ్రాంథిక కృతకవాణీ కూట ప్రాశస్త్యము. ౨ తొమ్మిదవ శతాబ్దమున ఎముకలు వున్నవా? ౩ చిట్టెయ్య జన్మస్థానమునకు సంబంధించిన కంపునదీచరిత్ర ౪ కుసుమలుపండుటకు ఎట్టి ఎరువుపుపయోగించవలెను. ౫ అర్థచంద్రాకృతిగల అర్థానుస్వార ధారిణియగు ఆంధ్రభాషా యోషా చంద్రముఖి కాదా? ౬ ఆంధ్ర మందున్న అన్యభాషా పదముల నేల తొలగింపరాదు? ౭ చచ్చుము శబ్ద సాధుత్వాసాధుత్వములు. ౮ దోమకు కన్నులున్నవా? ౯ ప్రపంచభాషలయందాంధ్రమున కట్టిస్థానము లభ్యము కాగలదో కిట్టప్పగారి కావ్యములనుబట్టి నిర్ణయించుట ఇత్యాది.

ఈ వ్యాసములను చదువువారు ప్రౌఢకవి భయంకరులూ, కవిసామ్రాట్టులూ, సాహిత్యాంబుధులూ వగైరా! కూటమువారే ఉభయ కర్చులు పెట్టుకొని వీరందరినీ పిలిపించారు.

వస్తుంది వస్తుంది అనుకొన్న వార్షిక దినము వచ్చింది. తద్దినమున ఫెళ్ళుమని వారందరికీ పిండివంటలతో భోజనాలు పెట్టినారు. ఆంధ్రదేశములో దేశాభిమానులైన సంపన్నులకు లోటులేదుగదా, యింక సంతర్పణలకు లోటు వస్తుందా! రోజుకు రెండుమూడుమార్లు ఫలహారాలు వగైరా లాంఛనాలన్నీ జరిగినవి. ఈ భోజనపు తొందరలో వ్యాసముల సంగతంతా మరచిపోయారు. అందరికీ భోజనాలు ఫలహారము చెయ్యడంవల్ల అందుకోసమని అక్కడ ఏర్పాటుకాబడ్డ అవసర ఆంధ్రభిషగ్వైద్యశాలకు కావలసినంత పని తగిలింది.

చదవకపోతే ఏమిలెండి; తరువాత అచ్చువేసుకో వచ్చును గదా అన్నాడు శ్రీరాములు మేస్త్రీ.

ఏదిజరిగినా, ఏది జరగకపోయినా, సరస్వతీ పూజ మాత్రం ఆనాడు చాలా బాగా జరిగింది. ఎవరి విగ్రహాన్ని వారు పూజించుకొన్న తరువాత, అందరూ కలిసి నృత్యంచేస్తూ చిట్టెయ్య విగ్రహాన్ని పూజించారు. కిట్టప్ప శాస్త్రుల్లు మంత్రాలు చదువుతున్నాడు. వెంకటావధానులు పౌరోహిత్యం వహించాడు. సుబ్బయ్య అగ్ర తాంబూలంకోసం తంటాలు పడుతున్నాడు. లక్ష్మీనర్సు బూతులు తిడుతున్నాడు.

"వాయించవోయి మేస్త్రీ డబ్బాలు వాయించు." "ఏయి, బాజాభజంత్రీలు వాయించండి, బాగా వాయించండి" "కట్నాలు పుచ్చుకోండి. తెండి ఇలా తెండి" "వెయ్యండి అడుగు బాగా వెయ్యండి" ఇత్యాది కోలాహలములో సరస్వతీపూజ బహు చక్కగా జరిగింది. ఆ గందరగోళములో కూటస్థులందరికీ ఒళ్ళు గరపాడిచింది. కొందరికి ఒళ్ళు తెలియలేదు, కొందరు ఆవేశంవల్ల మూర్ఛపోయారు.

చివర అందరూ సరస్వతీ మంత్రమును చదివారు. ఎవరిమట్టుకువారు మంత్రమును చదువుకొనే సాంప్రదాయం లేదక్కడ. కూటస్థులందరూ కలిసి గ్రాంథిక వాణీ స్తోత్ర మహా మంత్రమును పారాయణచేశారు. ఆ మంత్రము నేను విని జ్ఞాపకం వుంచుకొన్నంత వరకు ఈ క్రింద ఇస్తున్నాను.

"గ్రాంథిక వాణీస్తోత్ర మహామంత్రము"

అస్య శ్రీ గ్రాంథికవాణీ స్తోత్ర మహా మంత్రస్య
చిన్నయసూరీ ఋషిః
అప్పకవీయం ఛందః
గ్రాంథిక కృతకవాణీ దేవతా
కవిరాక్షసీయం బీజం
సంస్కృత పండితవాదః శక్తిః
ధనార్జనం కీలకం
మమ గ్రాంథికవాణీ సేవనద్వారా
మహారాజ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః
వచ్చుము చొచ్చుము రూపిణీం
అంగుష్ఠాభ్యాం నమః
మీరు చేసిరి మయాం
తర్జనీభ్యాం నమః
కూతురుకు బొంబాయినకు పోషిణీం
అనామికాభ్యాం నమః
శకటరేఫ సమాశ్రయాం

కనిష్ఠి కాభ్యాం నమః
నావు డనవుడు పదశరణ్యాం
కరతల కరపృష్ఠాభ్యాం నమః
ఏవం హృదయాదిన్యాసః

కవిత్రయనామ్నా గ్రామ్యవాదినాం వాక్బంధః
ధ్యానం— గ్రంథవాణీం కీర్తిదాత్రీం

శబ్దాలంకార శోభితామ్
వ్యాకహారిక శబ్దానాం
ఖండనీమ్ పండితావనీం

తరవాత మంత్రం చెప్పారు. అంగన్యాసకరన్యాసములలో ఇమిడివున్న బీజాక్షరాలే కాబట్టి వేరేమంత్రం వ్రాయలేదు. అందరూ ఈ మంత్రం నూరుమార్లు జపించారు. తరవాత ఫలశ్రుతి.

గ్రంథవాణ్యా ఇదం స్తోత్రం
యః పఠే ద్రాజ సన్నిధౌ,
సిధ్యంతి సర్వకార్యాణి
పండితం కథ్యతే ధ్రువం.

* * *

అప్పుడు జరిగింది ఒక గొప్ప వింత.

అందరూ సొమ్మసిల్లి పడిపోయిన తరువాత మందిరమంతా చాలా నిశ్శబ్దముగా వున్నది. అప్పుడు మీరున్న తావుకు ఒక దివ్యసుందరవిగ్రహము వచ్చింది. ఆవిడను వర్ణించడం నాబోటివాడికి వశంకాదు. ఆ చూపులు, ఆ నడకలు, ఆ నవ్వులు, ఆ వయ్యారమూ, భయమూ, భక్తి, వాత్సల్యమూ, అనురాగమూ కలిగిస్తూ వున్నవి. ఆవిడ అందరి హృదయాలను ఆకర్షించగల శక్తి ఉన్న దివ్యస్త్రీ, అందరూ ఆమెను చూచి తమ హృదయాలను ఆమెకు అప్పజెప్పారు. అందరి హృదయాలకూ శాంతి కలిగింది.

ఉత్సాహం కలిగింది. ఆనందం కలిగింది, సృష్టికర్తా, సృష్టీ ఆవిడే.

ఆమె ధరించినవి పువ్వులూ, చిగుళ్ళూ,
ఆవిడ స్నేహితులు పిల్లలు,
ఆమె పలుకుచున్నది చిలకపలుకులు
ఆవిడ కంఠము కోకిల.
ఆవిడ కన్నులు లేటనీటిబుగ్గలు,
ఆవిడ పైట విసురు మందమారుతము
ఆవిడ కిరీటము ఆకాశము
కిరీటములో మణులు చుక్కలు
ఆవిడ సరస్వతి

సొమ్మసిల్లిపోయిన జనమంతా లేచి నిలుచున్నారు "ఎవరు నువ్వు? కూటస్థుల రహస్య మందిరములోకి ఎందుకువచ్చావు" అని ఆవిడను వారంతా గద్దించారు.

ఆవిడ నవ్వింది. ఆవిడకళ్లు జవాబు చెప్పినవి. నేను "సరస్వతిని" అని. వాళ్ళంతా ఒకమారు ఆవిడకేసి చూచారు. ఒకమారు చిట్టెయ్య విగ్రహంకేసీ చూచారు. అన్నారు అందరూను, "ఆఁ! ఆఁ! ఏమిటి! ఏమిటి! నీవు సరస్వతివైతే యీ విగ్రహం ఏమికావలసినది. కలికాలంలో ఎంతవాళ్లయినా ఉంటారు" శ్రీరాములు మేస్త్రీ కిష్టప్పశాస్త్రుల్లుకేసి చూచాడు. కిష్టప్పశాస్త్రుల్లు లక్ష్మీనర్సుని పరామర్శ చేశాడు. లక్ష్మీనర్సు శ్రీరాములుమేస్త్రీకి సైగచేశాడు. శ్రీరాములుమేస్త్రీ అన్నాడు. "చూస్తారేమి ! ఇంకా !"

అందరూకలిసి డబ్బాలు వాయించారు, కొందరు కర్రలు తీసుకొని వచ్చారు. ఆవిడను జడిపించారు.

ఆవిడ అదృశ్యమైనది. నాటినుంచి నేటివరకూ లక్ష్మీనర్సు, కిష్టప్పశాస్త్రుల్లూ ఆవిడను అసభ్యమైన బూతులు తిట్టుకూనే వున్నారు.

కాని, ఆవిడ ఆ ఊళ్ళో పిల్లలతో ఎప్పుడూ ఆడుకొంటూ ఉంటుందనీ, వాళ్లకి కావలసిన ఆట వస్తువులు ఇస్తూవుంటుందనీ వినికిడి.

సరా — నేను వ్రాసిన గ్రాంథికకృతికవాణీ స్తోత్ర మహామంత్రము నేను కల్పించినదనీ, అటువంటి మంత్రము కూటస్థులు చదవడము అసంభవమనీ కిష్టప్పశాస్త్రుల్లుగారు ఒక కావ్యం వ్రాస్తున్నారని తెలిసింది. నేను ఈ మంత్రమును ప్రకటించబోతున్నానని ఆయనకి ఎవరో చెప్పారట.

నాకూ కిష్టప్పశాస్త్రుల్లుగారికీ ఈ మధ్య అభిప్రాయభేదం కలిగిందిలెండి. కిష్టప్పశాస్త్రుల్లుగారితో అభిప్రాయభేదం అంటే ప్రబల శత్రుత్వమన్నమాట !

('జయంతి' పత్రికలో శ్రీ దీక్షితులుగారు వ్రాసిన పెద్దకథలో చివరిభాగాన్ని మాత్రమే ఇచట పొందుపరిచాం.)

# గ్రామ్యమా? వాడుకభాషా?

## విశ్వనాథ సత్యనారాయణ

....అసలు గ్రామ్యం అంటే మన పూర్వుల ఉద్దేశ్యమేమిటి? మన మేమనుకుంటున్నాము? పూర్వుల ఉద్దేశ్యం అసభ్యమైన భాష అని. కొన్ని బజారు మాటలు వెలుగురు పెద్దమనుష్యుల్లో సభలలో మాటాడ రానివి వుంటాయి. అవీ పూర్వం సంస్కృతంలో కటి గల్లాదు లట్లాంటివి, ఇప్పుడు ఇప్పుడు అట్లాంటివి.

సభలలో మాట్లాడేది సభ్యం...ఈ వాడుకభాష సభలలో, అది గ్రామ్యం అనేవారుకూడా మాట్లాడుతున్నారు. బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ఉపన్యాసం రక్తిగావుంటుంది అంటే యెందుకని? వారు వాడుకభాష ప్రయోగిస్తారు. కాకుస్వని వాడుక భాషలోనే వున్నది. గ్రాంథికభాషలో కాకువు సాధించుకోవాలి. గ్రాంథికభాషావాది అన్నకొద్దీ కాకువు రమ్యత తెలియనివాడని అర్థము.

ఈ కాకువు గ్రాంథికభాషలో ఇమిడ్చేటందుకు తిక్కన్నపడ్డ కష్టం భగవంతుడికి తెలుసు. అందుకనే భాగవతం చెప్పటం కష్టం. భారతంచదవడం కష్టమనీ అంటారు. భాగవతంలో వేదాంతార్థం ఎక్కువ. భారతంలో కాకుస్వరం తెలియదు; అది తెలియకనే భారతంలో ఏముంది అంటారు కొందరు.

కాకువు అంటే భావద్యోతకానికి ఉచ్చారణలో చూపే ఒడుపు ఒక భాషా సామర్థ్యం ఆ భాషలో కాకు ధ్వనిని పట్టి తెలుస్తుంది. ఆ కాకు ధ్వనిని గ్రాంథికభాషకన్నా వాడుకభాష మిక్కిలిగా ప్రయోగిస్తుంది. వాడుకభాషా అంటే ప్రత్యయాల మార్పు మాత్రమేగా అనుకోవచ్చు. నేటి కొందరు కవులభాష ప్రత్యయాలు మారిస్తే, వాడుకభాషకన్న అమిత కనాకష్టం అవుతుంది. ఏ శ్రీనాథుడి కవిత్వమో ప్రత్యయాలుమారిస్తే దానికి గ్రామ్యత్వం సిద్ధించదు.

ఈ వాడుకభాష ఎందుకు వద్దు అంటే పండితులు చెప్పే కారణాలు ఏమిటంటే ఇందులో శబ్దాలు యిష్టం వచ్చినట్లుగా మారుతున్నవి. ఆ మార్పుకు హద్దులేదు. అందువల్ల గ్రాంథికభాష మారిపోతుంది అని. మార్పుకు హద్దులేదూ అంటే హద్దువున్నది. గోడని ఎవ్వరూ 'గెడ' అనరు. 'చూడడం' 'చూట్టం' అవుతుంది. 'ఒక్కరితరు' యూనైరూపాలు వ్రాసిన వ్యాకరణం ఈమాత్రం చెయ్యలేదూ?

బ్రహ్మశ్రీ అవంతు సాంఖ్యాయన శర్మగారు మన దేశానికి భీష్ములవంటివారు. వారు అన్నారుగదా, 'ఈ క్రొత్తభాషవల్ల భారతభాగవతాలు మూలపడతవి' అని. ఈ భాషవల్లనే అట్లాజరిగేటట్లయితే అదియిదివరకే జరగాలి. బొబ్బిలిపాటలు, కామమ్మకథలు, రామదాసు కీర్తనలు, కొంతదాకా త్యాగరాయ కృతులూ ఇవన్నీ వాడుకభాషలోనే వ్రాయబడ్డవి. అన్నీ అచ్చుపడ్డవి. దానివల్ల భారత భాగవతాలకు వచ్చిన నష్టంలేదు అన్నా.

ఈ భాష చదివితే పిల్లలు పాడయిపోతారు అన్నారు. ఈ యూనివర్సిటీవారూ, గవర్నమెంటువారూ పెట్టే గ్రాంథిక నామక గ్రంథాలవల్ల పాడవుతారేగాని, శక్తిగల జీవంగల మడికారం ప్రయోగించిన వాడుక భాషాగ్రంథాలు చదివితే చెడిపోరు అంటాను.

భాష స్వభావం తెలుసుకోకుండా గ్రంథస్థ భాషలోవున్న ప్రత్యయాలకిమాత్రమే ఆగౌరవంకలిపిస్తే దానివలన భాషకి చాలా నష్టం వుంది. పిల్లలకి అటువంటి భాష నేర్పరాదు. ఆ భాష తగినంత జీవంగల భాష అయివుండాలి. నిర్జీవమైతే గ్రాంథిక భాష అయినా పిల్లలకు నేర్పకూడదు. గ్రాంథికభాష అన్న పేరుతో తప్పురూపాలు కోటానుకోట్లుగా వున్న భాష (ఇప్పటి స్కూళ్లలోపెట్టే పుస్తకాల భాష) వాళ్లకి నేర్పరాదు. సామాన్యంగా పిల్లలచేత నేడు స్కూళ్లలో చదివించే నవలలూ అవ్వీనీ కుర్రవాడికి భాషలోవుండే శక్తిని తెలియనివ్వడంలేదు. భాషశక్తికారంకలో, కాకువులోనూ, హృదయోద్వేగం ప్రకటించే మాటల్లోనూ వుంటుంది. ఆ శక్తి తిక్కనరచనలలో సమృద్ధిగా వుంది. కొందరి కవుల్లో అది కనపడనే కనపడదు.

'వచ్చుచున్నది', 'వస్తున్నది', 'వస్తోంది' అన్న రూపాల దగ్గరకాదు తగాదా. బాహుళ్యంమీద, భాషాస్వభావంమీద. ఈ రూపాలన్నీ కూడా వాడికి తెలియవలసిందే. అవి వాడేచోట్లు వేరుగావుంటవి. పసిపిల్లలకి చెప్పే చిన్ని చిన్ని కథల్లో 'వస్తోంది' అని వాడవచ్చు. యింకేదైనా అయితే 'వస్తున్నది' అనవచ్చు. 'వచ్చుచున్నది' గ్రాంథికభాషా రూపం తెలిసేటందుకు.

మనభాషలోకి యితరదేశ్యాలు యథేచ్ఛంగా ప్రయోగింపవచ్చు. 'ఫీలు'కూడా భాషలోకివచ్చింది. 'సప్లయి'

ముక్తమైనవి శబ్దరత్నాకరంలోనే వున్నవి. 'వస్తాడు' అన్నది నింద్యగ్రామ్యం. ఇది యెట్లావుందంటే, దొర గారితో కలిసి 'టీ' త్రాగవచ్చుకాని పంచముణ్ణి దగ్గరకు రానీయరాదు. మహమ్మదీయుడికి శూద్ర మర్యాద వచ్చింది. దొరకి దొర మర్యాదే సిద్ధించింది. మాలవాడికి ?

భాష ప్రవాహిని మారుతూ వుంటుంది. కనుక మారే భాషని పట్టుకోటానికి వీలులేదు అని భాషా వాదులతర్కం. దీనికొక పండితులు చక్కని అభ్యంతరం చెప్పారు. ఏమనీఅంటే అవును మారటం స్వభావం, ప్రకృతిలో ఆదోషం వున్నది. ఆ దోషం తీసివేసేం దుకే మేము దాన్ని యిట్లావుండాలని నిశ్చయించాము. దాన్ని సూత్రబద్ధంగా చేశాము అని. ఇది బాగుంది. కాని సూత్రబద్ధం చేయకమునుపు ఆ భాషయొక్క పరిణామానికి, దానివైశాల్యానికి ఎడమిచ్చి చెయ్యాలా? వద్దా! కుర్రవాణ్ణి అల్లరి చిల్లరగా తిరగనీయవద్దు. అయిదయింతరువాత, వాడు ఆడుకోవద్దూ ? యింట్లో అదేపనిగా కూర్చుంటే గుదులెత్తి బోదకాళ్ళు వస్తవి. మన భాషకిదివరకే బోదకాళ్ళు వచ్చినై. కొంచెంకాలు సాగనివ్వాలి.

మార్పుకోసమే మార్పుకాదు. వాడుక భాషలో చెప్పేకొన్ని భావాలు సరిగా తెలియ చెయ్యటానికి గ్రాంథిక భాషకి సామర్థ్యం చాలదు అని, పూర్వం వన్నయ్యగారు నిబంధించిన నిబంధన చాలకనే భాష యింతగా మారిపోయిందని, కనక ఆ సామర్థ్యం ఎంత వరకువుందో అంతవరకూ వదలిపెట్టవలెనని అప్పుడు దానికి సూత్రాలు నిర్మించు. నీ సూత్రాలు దాటి దేవ్వడూను.

అట్లా అయితే వాడుకభాషకే సామర్థ్యంచాలదు. వాడుకభాష వాడుకలోవున్న భావాలని మాత్రమే చెబుతుంది. గ్రాంథికభాషలో మనకు వాడుకలోలేని భావాలు చెప్పవలసి వస్తుంది. పైగా గ్రాంథిక భాషకి అటువంటి భావాలతోనే యెక్కువ పనివుంటుంది. అని అన్నారు. అవును ఆ భాషాసామర్థ్యము ఆభాషది. ఈ భాషా సామర్థ్యం యీ భాషది. రెండునూ కావలయునని నా వూహ.

నిజమైన మాటకి పద్యము, గద్యము రెండేమార్గాలు. మూడవది పాట ఏభాషలోనైనా వుండవచ్చు. పద్యము గ్రాంథిక భాషలో వుండాలి. గద్యము వాడుకభాషలో వుండాలి. పద్యము ఎందుకు గ్రాంథిక భాషలో వుండాలి అంటే, ఛందోబద్ధమైన భాషకు పద్యమూ, పద్యానికి ఛందోబద్ధమైన భాషా సరిపోయినది. ఇది వరకు మనవాళ్లు సృష్టించి యేర్పరచిన వృత్త భేదాలు గ్రాంథిక భాషా స్వరూపానికి తగి వోతివి. వాడుక భాషలోనే పద్యాలు వ్రాయాలి అంటే, ఆ వృత్తాలు మారాలి.

వచనంలో వాడుక భావాలు చెప్పటానికి వాడుక భాష కుదిరినట్లుగా గ్రాంథికభాష కుదరదు. వాడుకలో లేని భావాలకు గ్రాంథిక భాష కుదరవచ్చు. మిక్కిలి వాడుకలో వుండే భావాలు ఆ భాషలో చెప్పటం పరమ అసహ్యం.

ప్రాంతీయ శబ్దాలు అని తోసివేయటం గ్రాంథిక భాషచేయదు. ఆ విషయంలో గ్రాంథికభాష భాషా వైశాల్యం పరిగణించిందన్నమాట. అట్లా తప్పు పట్టకుంటే వాడుకభాష తన వైశాల్యం సంకుచిత పరచుకుంటోంది అని అర్థం. ప్రాంతీయశబ్దాలు భాషాదేవి విస్తారమైన తనువు. అవి తీసేస్తే ఆవిడ గుజ్జాఅయిపోతుంది. కావలిస్తే ప్రాంతీయశబ్దాల పట్టికలు ఇవ్వవచ్చును...

(జయంతి 1927 పత్రికనుండి)

# లియో టాల్‌స్టాయ్

## యు. గౌరాల్నిక్

[గౌరాల్నిక్ రష్యన్ భాషాశాస్త్ర పండితుడు. సోవియట్‌లో గోర్కీ పేరిట నెలకొల్పబడిన ప్రపంచ సాహిత్య పరిషత్తుకు కార్యదర్శి.]

రష్యన్ పత్రిక "సోవ్రెమెన్నిక్" (సమకాలిక) 1852 సెప్టెంబర్ సంచికలో 'బాల్యం' అనే నవల ప్రారంభమయింది. ఆ రోజుల్లో ఈ పత్రిక ముఖ్య అభ్యుదయ పత్రికలలో ఒకటి. దీని తర్వాత "కౌమారం", "యౌవనం" ప్రకటించబడ్డాయి. ఈ మూడు ఆత్మకథా సంబంధమైన నవలా త్రిధారా వాహిక. ఈ రచనలలో అసాధారణ ప్రతిభగల కొత్త రచయిత ఒకడు కనుపించాడు. రష్యా సాహితీ వేత్తల శ్రేణిలో ఆ విధంగా మహాకళావేత్త లియో టాల్‌స్టాయ్ నామం చేర్చబడింది.

టాల్‌స్టాయ్ 1828 లో మాస్కోకు దక్షిణంగా ఉన్న ఒక చిన్న ఎస్టేట్ "యాస్నయా పోలియానా"లో జన్మించాడు. ఆయన తన జీవితంలో ఎక్కువభాగాన్ని అక్కడే గడిపాడు. అందుచే నేడా ప్రాంతం ప్రపంచ ప్రసిద్ధి గాంచింది.

రష్యా ఉన్నత ప్రభుత్వవర్గాలకు చెందిన కుటుంబంలో టాల్‌స్టాయ్ జన్మించాడు. యువ ప్రభువుగా టాల్‌స్టాయ్ జీవితం "పెద్ద మనుష్యుల పుట్ట"లో కొనసాగింది. ఈ పరిస్థితులలో బానిస రైతాంగాన్ని, వారి జీవితాల్ని, ఆచారాల్ని, మనస్తత్వాన్ని, ప్రయోజనాల్ని - అన్నీ వివరంగా పరిశీలించడానికి టాల్‌స్టాయ్‌కి చిన్నతనం నుండీ అవకాశం కల్గింది. భవిష్యత్తులో మహాకవి కానున్న టాల్‌స్టాయ్ ఇక్కడనే, ప్రజల సంపన్న సౌందర్య భావనా, ఆభావంలో వున్న అసమాన కవితా చిహ్నాలనూ ఆకళింపు చేసుకొన్నాడు.

1884లో కజాన్ యూనివర్సిటీలో ప్రాచ్యభాషా విద్యాపీఠంలో చేరాడు. ఉన్నత విద్యాభ్యాసానికై ఏర్పడిన సంస్థల్లో ఇది అతి ప్రాచీనమైంది.

కాని అభ్యుదయ తాత్విక భావాలలో గాఢాభిలాష ఉండటం మూలాన, టాల్‌స్టాయ్ ఆ యూనివర్సిటీని వదలివేసి యాస్నయా పోలియానా లోకి వెళ్ళిపోయాడు. పుట్టి పెరిగిన పుణ్యభూమికి అంటుకొని స్థిరపడిపోయాడు. అక్కడ కష్టపడి స్వయంగా విద్య నభ్యసించాడు. బానిసల జీవితాన్ని బాగుచేయాలని, సామాజికంగా మార్పులు తేవాలని, టాల్‌స్టాయ్ తన యవ్వనదశలో చాలా పథకాలు వేశాడు: కాని వాటిని ఆచరణలో పూర్తిచేయలేక పోయాడు.

మొదటి నికలస్ చక్రవర్తి కాలంలో ఉన్న బానిస విధానం, (సెర్ఫడం) పెద్ద భూస్వాముల నిరంకుశాధికారం, దౌర్జన్యచర్యల వాతావరణమూ యువ టాల్‌స్టాయ్‌లో తీవ్రఅసంతృప్తిని రేకెత్తించింది. టాల్‌స్టాయ్ కాకసస్‌లో సైన్యంలో చేరాడు. యుద్ధాలలో పాల్గొన్నాడు. ఆ రోజుల్లోనే 'బాల్యం' అనే నవలతో ఆయన సాహిత్య జీవితం ప్రారంభమయింది. కాకసస్‌లోని సైనిక చర్యల ప్రభావంతో టాల్‌స్టాయ్, యుద్ధ సంబంధమైన కథలు చాలా వ్రాశాడు.

క్రిమియన్ యుద్ధ ఘటనల, ఆ యుద్ధ పరిణామాల ప్రభావం ఈ యువ రచయితపై ప్రగాఢంగా పడింది. సైనికోద్యోగిగా సెవాస్తపూల్ వీరోచిత సంరక్షణలో పాల్గొన్నాడు. బానిస విధానంపై ఆధారపడివున్న ఆనాటి రష్యన్ సామాజిక విధానం ఏ విధంగా కుళ్ళిపోతున్నదో చూశాడు. జార్ నిరంకుశ ప్రభుత్వం అట్టడుగున పునాదులు కదిలిపోతున్నాయని క్రిమియన్ యుద్ధం తెలియజేసింది. అయితే ఈయుద్ధంలో మరో విషయంకూడా స్పష్టమయింది. తాము ప్రేమించిన మాతృదేశంకోసం రష్యన్ స్త్రీ పురుషులు - సామాన్య ప్రజలు - ఎంతటి శౌర్యం నిరంతరం ప్రదర్శించుచూ వచ్చారో కూడా అప్పుడే వెల్లడి అయింది. సెవాస్తపూల్ నౌకాకేంద్రాన్ని రక్షించిన వీరుల శౌర్య గాథలు టాల్‌స్టాయ్‌ను ఉత్సాహపరచి "సెవాస్తపూల్ కథలు" అనే పుస్తకం

రచించడానికి ప్రేరణ కల్గించాయి. ఈ కథలను ప్రచురించడంతో టాల్‌స్టాయ్ ప్రథమశ్రేణి రచయితగా పేరుపొందాడు. రష్యా సాహిత్యానికి ఆశాజ్యోతి అని టాల్‌స్టాయ్‌ను అందరూ ప్రశంసించారు. ఆ ఆశను టాల్‌స్టాయ్ నిలబెట్టాడు కూడా.

1856 చివరభాగంలో టాల్‌స్టాయ్ సైన్యంనుండి విరమించుకొన్నాడు. ఆ తర్వాత పశ్చిమ యూరప్ దేశాలలో చాలా వాటిల్లో పర్యటన సాగించాడు. ఆకలితో దారిద్ర్యంతో అలమటించే కార్మిక ప్రజల పేద జీవితాన్ని స్వయంగా కళ్లారా టాల్‌స్టాయ్ చూశాడు. పరిపాలక వర్గాల దురాశను, మోసాన్ని, నిర్దయను తీవ్రంగా ఖండించుతూ టాల్‌స్టాయ్ వ్రాశాడు. యాస్నయాపోలియానాకు తిరిగిరాగానే, బీద ధనికులమధ్య, "రైతుల" "యజమానుల" మధ్యగల స్పర్ధను గురించి తీవ్రంగా ఆయన ఆలోచించాడు. బానిసలను విముక్తి చేయాలని ఆయన చాలా పథకాలను ఆలోచించాడు. రైతుల విద్యాభ్యాసానికి ఆయన చాలాకాలం వినియోగించాడు. రైతుల బిడ్డలకు ఒక పాఠశాలను తెరచి తానే స్వయంగా అక్కడ పాఠాలు చెప్పసాగాడు. అక్కడనుండి ఉపాధ్యాయ పత్రిక కూడా ఒకటి నడిపాడు.

ఆర్థిక పరిణామాలవల్ల కొంతా, రైతుల తిరుగుబాట్లవల్ల భయపడి కొంతా, జార్‌చక్రవర్తి 1861 లో బానిసవిధానాన్ని రద్దుచేయడానికి అంగీకరించవలసి వచ్చింది. 1860-70 నాటి కాలం రష్యాలో నూతన సామాజిక అభివృద్ధి శకం అనవచ్చు. ప్రముఖ చారిత్రక ఘటనల ప్రభావంతో టాల్‌స్టాయ్ తిరిగి తన సాహిత్య కార్యకలాపాలలో నిమగ్నుడయ్యాడు. ఆ రేండ్లలో (1864-69) "యుద్ధమూ- శాంతీ" (వార్ అండ్ పీస్) అనే మహోద్భుతమైన ఉత్తమ నవలను వ్రాశాడు. నెపోలియన్ దండయాత్రను ఎదిరించి 1812 లో మాతృదేశ సంరక్షణార్థం రష్యా యుద్ధం సాగించిన కాలం అది. రష్యా చరిత్రలోని సువర్ణ ఘట్టాలలో ఒకటి అది. ఈ కాలానికీ,చరిత్రకూ సంబంధించి వ్రాసినదే ఈనవల.

ఈ మహా గ్రంథ రచనకు టాల్‌స్టాయ్ ఎన్నో విషయాలను వివరంగా పరిశీలించవలసి వచ్చింది. ఈ నవలలో ప్రజల ప్రత్యేక లక్షణాలు, గుణాలు, వారి శౌర్య, స్వార్థరాహిత్యాలు, చిత్రించబడ్డాయి. రైతుల భూస్వాముల మధ్యగల సంఘర్షణను సంకీర్ణతనూ పూర్తిగా ప్రతిబింబించే జీవిత దృశ్యాలూ చక్కగా చిత్రించాడు.

1870-80 ల మధ్య "అనా కెరెనినా" వ్రాశాడు టాల్‌స్టాయ్. ఇది వ్రాసే కాలంలోనే ఆయన దృక్పథంలో తీవ్రమైన మార్పు కన్పడుతుంది. అంతకుపూర్వం ఈ మార్పుకు సూచనప్రాయమైన ఛాయలువున్నా, మార్పుమాత్రం ఇపుడే ప్రారంభమయింది. రష్యాసమాజంలో విలయతాండవ మాడుతున్న అన్యాయాలను ఆయన అంతరాత్మ సహించలేకపోయింది.

లక్షలాది శ్రామిక ప్రజలపైన కొద్దిమంది ప్రత్యేకాధికారాలుగల వర్గాలు ప్రభుత్వ సాయంతోను, మతాధిపతుల మద్దతుతోనూ సాగించుతున్న పరిపాలనకు వ్యతిరేకంగా, సాధారణ ప్రజలతో- రైతులతో- సన్నిహిత సంబంధంవున్న టాల్‌స్టాయ్ హృదయంలో తీవ్ర అసమ్మతి రేకెత్తింది. టాల్‌స్టాయ్, ప్రభువర్గాలతో తెగతెంపులు చేసుకొన్నాడు. స్వతంత్ర రైతాంగ వ్యవస్థను కోరేవాడు కాబట్టి టాల్‌స్టాయ్, ప్రభుత్వాన్ని, మతవ్యవస్థనూ, ఆస్తినీ, ఉన్నతవర్గాల నైతిక గుణాలనూ, వారి సంస్కృతినీ ఖండించాడు. ప్రస్తుత సామాజిక విధానంలోని వంచననూ అసత్యాన్ని బట్ట బయలు చేశాడు టాల్‌స్టాయ్. తన తోటివారిని అణచి వేసే హక్కు మానవుడికి కలదన్న భావాన్ని అతడు తిరస్కరించాడు. క్రీస్తు బోధించిన ప్రేమ, దుష్టకృత్యాలను సాత్వికంగానిరోధించడం టాల్‌స్టాయ్ తాత్విక సిద్ధాంతం. పైనచెప్పిన దురన్యాయాలనుండి బయటు పడటానికి ఇదేమార్గమని టాల్‌స్టాయ్ నమ్మిక. టాల్‌స్టాయ్ బోధనలోని, తాత్విక సిద్ధాంతాలలోని బలహీనతలను పేర్కొన్నాడు లెనిన్. కాని, దోపిడీ గాండ్రరాజ్యపు పునాదులను టాల్‌స్టాయ్ నిశితంగా విమర్శించడంలో, ఆయన గొప్ప కళాకారుడుగా రూపొందాడని లెనిన్ అన్నాడు. మానవ సంస్కృతి చరిత్రలో టాల్‌స్టాయ్ కళాప్రతిభ, అత్యున్నతమైనదని లెనిన్ అన్నాడు.

ఆ తర్వాత టాల్‌స్టాయ్ "రిసరక్షన్" (1898-99); "హాజ్జిమురట్" (1896 - 1904); "ఆఫ్టర్ దిబాల్" (1903); "ది రీన్ ఆఫ్ డార్క్‌నెస్"(1886)"ది ఫ్రూట్స్ ఆఫ్ ఎన్‌లైటెన్‌మెంట్" (1891) ఇంకా, అనేక చిన్న కథలూ వ్రాశాడు.ఇవన్నీ వాస్తవికధోరణిలో ఉన్నాయి. ఆనాటి సమాజాన్ని విమర్శనాదృష్టితో చూచేవిగా ఉన్నాయి. ఈ రచనలు సహృదయుల మనస్సులను ఆలోచింపచేసేటట్లు కదల్చాయి ; ఆ నాడున్న సామా

జిక విధానానికి వ్యతిరేకంగా తీవ్ర అసమ్మతిని ప్రదర్శించేటట్లు చేశాయి.

అంతర్జాతీయంగా ఖ్యాతినీ ప్రముఖస్థానాన్నీ సంపాదించుకొన్న మహాకవి టాల్ స్టాయ్ కార్యకలాపాలూ, జార్ ప్రభుత్వ క్రూర రాజకీయాలను ఆయన బహిరంగంగా ఖండించడమూ, ప్రభుత్వానికి కంటకమయింది. ఇది గాఢంగా నాటుకుపోయింది. అయితే ప్రత్యక్షంగా ఆయనను శిక్షించడానికి వీలు లేకుండా ఆయను ప్రపంచమంతటా ఉన్న ఖ్యాతి కాపాడింది. అయినా 1901 లో రష్యాలోని ఉన్నత మత వ్యవస్థ 'సైనాడ్', ఈ మహామేధావిని బహిష్కరించింది; శపించింది. కాని టాల్ స్టాయ్ విఖ్యాతి రోజురోజూ హెచ్చు సాగింది. 1908 లో ప్రపంచమంతా రష్యా మహారచయిత టాల్ స్టాయ్ 80 వ జన్మదినోత్సవం జరిపింది.

ప్రపంచ పీడిత ప్రజలందరికీ టాల్ స్టాయ్ స్నేహితుడు. తమ స్వాతంత్ర్యం కోసం వలసదేశ ప్రజలు సాగించిన పోరాటాన్ని ఆయన ఎక్కువ సానుభూతితో గమనించాడు. భారత ప్రజలపట్ల ఆయనకుగల సౌభ్రాతృత్వం అందరికీ తెలిసినదే. మహాత్మాగాంధీతో ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన విషయమూ లోకవిదితమే. ఆ ఉత్తరాలలో భారతదేశంపై పెత్తనంచేస్తున్న విదేశ యజమానులను గర్హించాడు. దక్షిణాఫ్రికాలోని భారతీయులపై సాగింపబడే దమన నీతినీ, వర్ణవివక్షతనూ ఖండించాడు.

టాల్ స్టాయ్ జీవితంలోని తుదిసంవత్సరాలు విషాదకరమైనవి. అధిక సౌకర్యాలను తిరస్కరించాలనీ, చెడు చేసిన వారిని క్షమించాలనీ ఆయన సిద్ధాంతీకరించుకొన్నా, ఆయన కుటుంబం ధనంవల్లకలిగే అన్ని సౌకర్యాలను అనుభవించుతూ నేవుంది. సామాజిక అసమానతనుచూచి ఆయనహృదయం సంక్షోభ పడింది. అందుకని ఆ సేకసాల్ల ఇల్లు విడిచిపెట్ట ప్రయత్నించాడు. నైతిక ప్రచారంవల్ల ఈ అసమానతను తొలగించలేక పోయానే అని ఆయన ఖేదపడ్డాడు. 1910 ఆకురాలు కాలంలో 82 వ ఏట రహస్యంగా టాల్ స్టాయ్ స్వస్థలం వదలివెళ్లిపోయాడు. త్రోవలో నిమోనియావచ్చి. రైల్వేస్టేషన్ వద్ద చనిపోయాడు. టాల్ స్టాయ్ మరణవార్త ప్రపంచాన్నంతటికీ పిడుగుపాటులా అనిపించింది. ప్రతిదేశంలోని సంస్కృతీపరులందరూ ఈ విషాదవార్త విని విలపించారు.

లియోటాల్ స్టాయ్ ను యాస్నయా పోలియానాలో సమాధిచేశారు. సోవియట్ ప్రభుత్వం ఏర్పడ్డాక ఇది సాహిత్య మ్యూజియంగా మార్చబడింది. "టాల్ స్టాయ్ రచనలను ఎప్పుడూ ప్రజానీకం హర్షించి, చదువుతుంది' రోపిడీగాండ్ర పరిపాలనను కూలద్రోసి మంచి జీవన పరిస్థితులను నెలకొల్పుకొంటుంది." అని 1910 లో లెనిన్ అన్నమాటలు ఆచరణలోకి వచ్చాయి.

రష్యా మహామేధావి టాల్ స్టాయ్ ను సోవియట్ ప్రజలు ఎప్పుడూ గౌరవించుతారు. ఆయన పుస్తకాలు లక్షలకొలది ప్రతులను సోవియటు ప్రభుత్వం ప్రకటించుతోంది. ప్రపంచమంతా ఆయన రచనల్ని ప్రేమించుతోంది.

"ఇక యుద్ధ భయంబుండదు;
వికసించును శాంతిసుమము; విజ్ఞానధనం
బిక సార్వభౌమమై తగు
నొక నాటికిగూడ యుద్ధ మొదవదు జగతిన్"

—దాశరధి.

# అభ్యుదయ రచయితల మహాసభ విశేషాలు

"అభ్యుదయ రచయితల సంఘం ఆంధ్రచరిత్రలో నవయుగ వైతాళికులైన కందుకూరి, గురజాడ, గిడుగు మొదలగువారి ఉత్తమ సంప్రదాయం అనుసరించి సాంఘిక శ్రేయస్సు, సాహిత్యంయొక్క ప్రధానలక్ష్య మని గుర్తించి సజీవమైన సాహిత్య సృష్టికి కృషి చేసింది. ప్రాచీన ఆధునాతన సాహిత్యాల్లోని ఉత్తమ లక్షణాలను స్వీకరించి, ఆంధ్రసాహిత్యంలో ఒకనూతన రచనా సంప్రదాయమును పాదు కొల్పింది. దేశ సాహిత్యం రీతులను పునరుద్ధరించడానికి సమకాలిక జీవితాన్ని ఆ యా రూపాల్లో చిత్రించి, ప్రచారంచేసి ఆంధ్రప్రజల ఆదరాభిమానాన్ని పొందక లిగింది. సాంఘిక జీవితానికి దూరమైన సాహిత్య ధోరణులను విడనాడి ప్రజల జీవిత సమస్యలను కావ్య వస్తువులుగా గ్రహించి ప్రగతి శక్తులకు చేదోడు వాదోడుగా నిలిచి, తెలుగు జాతికి వెలుగుచూపింది."

ఇవి డాక్టర్ ఉప్పల లక్ష్మణరావుగారు తమ స్వాగతోపన్యాసంలో అన్నమాటలు. ఇంత చక్కని చరిత్రని సృష్టించి, కృషిసాగించిన ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం అనేక కారణాంతరాలవల్ల ఐదారేళ్ళు నిర్మాణ కృషి చేయలేకపోయింది. ఈ నిస్తబ్ధత నించి తేరుకోవాలని, కదిలి, కదిలించాలనీ అనేకులు తలపోశారు. ఇటు మద్రాసునించి అటు విజయనగరం దాకా రచయితలు ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం తగిన కార్యక్రమాన్ని చేపట్టాలని ఉత్సాహించారు. తత్ఫలితంగా సన్నాహక సంఘం ఏర్పడింది. త్వరలోనే ఆహ్వాన సంఘం నిర్మాణమయింది. విజయవాడలో '55 జూలై 30, 31 తేదీల్లో మహాసభలు జరపడానికి ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. ఈ సంచలనానికి తెలుగుసీమ నలుమూలలనుంచీ అమితోత్సాహమూ, సహకారమూ లభించింది.

మహాసభలకు వందలాది ప్రతినిధులు పరిశీలకులూ వచ్చారు. ఆ రెండురోజులూ సభల్లో మహోత్సాహం వెల్లివిరిసింది. ఆహ్వానసంఘాధ్యక్షులైన డాక్టర్ లక్ష్మణరావుగారు చక్కని సమీక్షా పూర్వకమైన



అభ్యుదయ రచయితల ఐదవ మహాసభలో, ఆహ్వాన సంఘాధ్యక్షులు
శ్రీ ఉప్పల లక్ష్మణరావుగారు సభాసదులకు స్వాగతం చెబుతున్నప్పటి దృశ్యం.

ప్రసంగం చేశారు. మహాసభాధ్యక్షులు శ్రీశ్రీగారు "అభ్యుదయ రచయితలమైన మనం గిడుగు సంప్రదాయాలలో గురజాడ కావ్యవాహినులలో వీరేశలింగం విప్లవఘోరణులలో ప్రాణవాయువులు పీల్చుకుంటున్నా మనం, నిస్సందేహంగా ఆంధ్ర సాహిత్య పరిణామంలో అగ్రశ్రేణిని పయనిస్తున్న మనం పరిపూర్ణమైన బాధ్యతల్ని వేసుకొని మహాప్రస్థానం సాగించవలసి ఉంది" అని విశదం చేశారు.

ఈ సభలకు శ్రీ తాపీ ధర్మారావుగారివంటి పండితులూ, భాషావిశారదులూ, డాక్టర్ గిడుగు సీతాపతి, తెలికచర్ల వెంకటరత్నం గార్లవంటి భాషోద్యమ ప్రముఖులు శ్రీ పాటిబండ మాధవశర్మగారు, శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు మున్నగు ప్రముఖులెందరో విచ్చేశారు. శ్రీ తాపీ ధర్మారావుగారి అధ్యక్షతను జరిగిన తొలినాటి సాయంత్రం సభలో డాక్టర్ గిడుగు సీతాపతిగారు 'నేటి వ్యావహారిక భాషయే నేటి గ్రాంథిక' వ్యాసం చదివేరు. ఆ సభలో 'అభ్యుదయ కవిత్వ సమీక్ష'పై శ్రీ కె. వి. రమణారెడ్డిగారు; 'హాస్యం' గురించి శ్రీ పుచ్చా పూర్ణానందంగారు, 'బాల సాహిత్యం' గురించి శ్రీ బి. వి. నరసింహారావుగార్లు చక్కని ఉపన్యాసాలు చేశారు. ఆ రాత్రి వైజ్ఞానిక ప్రదర్శనాలు జరిగాయి.

మర్నాటి ఉదయం సభకు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు అధ్యక్షత వహించారు. 'నేటి రచయితల స్థితిగతులు' గురించి శ్రీ అనిసెట్టి సుబ్బారావుగారు, శ్రీ మా. గోఖలేగారు చిత్రకళను గురించి, మరికొందరు కూడా ఉపన్యసించారు.

ఆ సాయంత్రం కావ్యపఠనం జరిగింది. ఈ సభలో చాలమంది రచయితలు తమ కవితను గానంచేశారు. చాల చక్కని వాతావరణాన్ని సృష్టించారు.

ఆ రెండురోజుల్లోనూ ప్రతినిధులు సమావేశమైఅనేక విషయాలను చర్చించారు. మనసువిప్పి అనేక సంగతి సందర్భాలను మననం చేశారు. ప్రయోజనాత్మకమైన తీర్మానాలను, నిర్మాణాత్మకమైన సూచనలను చేశారు.

ఆ రాత్రికి చలనచిత్రాల ప్రదర్శనంతో మహాసభలు పూర్తి అయ్యాయి. ఆ మహాసభల్లో పాల్గొన్న ప్రతివారికీ ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం కృషిపట్ల మరింత విశ్వాసం, ఉత్తేజం కుదురుకొన్నాయనడంలో ఎలాంటి సందేహంలేదు.



ఆంధ్రదేశం నలుమూలలనించీ వచ్చిన ప్రతినిధులు : సభా దృశ్యం.

# తీర్మానాలు

విజయవాడలో '౫౫ జూలై 30, 31 తేదీల్లో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల ఐదవ మహాసభవారు, ఆంధ్ర సంస్కృతి వికాసానికి అపారమైన కృషిసల్పి కీర్తిశేషులైన శ్రీ అడివి బాపిరాజు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, శ్రీ కిళాంబి రంగాచార్యులు, శ్రీ వోలేటి పార్వతీశం, శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి, శ్రీ తోలేటి వెంకటరెడ్డి మున్నగు వారికి తమ జోహార్లను సమర్పించారు. వారి వారి కుటుంబాలకు తమ గాఢ సంతాపాన్ని తెలియచేస్తూ తీర్మానాలు చేశారు.

ఆ తర్వాత మహాసభవారు అనేక చర్చోపచర్చలు జరిపి, ఈ దిగువ తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించారు.

## ౧. వ్యావహారిక భాష

శ్రీ గిడుగు సీతాపతిగారు వ్యావహారిక భాషను గురించి ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఈ తీర్మానాన్ని శ్రీ తెలికచర్ల వెంకటరత్నం, శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగార్లు బలపరుస్తూ ప్రసంగించారు. ఆ తీర్మానంలో ఇలా ఉంది.

"నేడు తెలుగుదేశములో వేలకొలదిగా తెలుగు రచనలు నేటి వ్యావహారిక భాషలో ప్రకటితములగుతూ ఉన్నవి. వ్యావహారిక భాషావాదము నేటి తెలుగు వారిలో అత్యధిక సంఖ్యాకులకు సమ్మతమైనది గనుక ప్రభుత్వ విద్యాశాఖవారున్నూ, విశ్వకళాపరిషత్తు వారున్నూ, బడులలోను, కళాశాలలలోను విద్యార్థుల వ్యాసరచన సభ్యమైన వ్యావహారిక భాషలో సాగనీయవలసినదనిన్నీ అందుకు అనుకూలమైన వచనరచనలు పాఠ్యగ్రంథములుగా నియమించవలసినదనిన్నీ కోరుతూ, ఈ కోరిక విద్యాధికారులకు విశ్వకళాపరిషత్తువారికి తెలియచేయుటకు కావలసిన కార్యకలాపము ఆలోచించిపని సాగించుటకు ఈ క్రిందివారిని ఉపసంఘముగా ఏర్పడవలసినదని ఈ మహాసభవారు తీర్మానిస్తున్నారు."

ఉపసంఘసభ్యులు

శ్రీ గిడుగు సీతాపతి
శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం
శ్రీ కొడవటి గంటి కుటుంబరావు
శ్రీ తాపీ ధర్మారావు
శ్రీ రంగం శ్రీనివాసరావు [కన్వీనర్]

ఈ ఉపసంఘము వారికి బలముచేకూర్చే ఉద్దేశ్యంతో వివిధప్రాంతాల ప్రజలందరి సంతకాలతో కూడిన ఒక విజ్ఞప్తిని అధికారులకు అందజేయాలని ఈ సభవారు నిర్ణయిస్తున్నారు.

## ౨. పురావస్తు ప్రదర్శనశాల

మహాసభాధ్యక్షులు ఈ తీర్మానాన్ని ప్రతిపాదించారు:

"ఆంధ్రదేశంలోని ప్రధాన నగరాల్లో ఏదోవొక చోట ఆంధ్రప్రభుత్వంవారు ఒక కేంద్రపురావస్తు ప్రదర్శనశాలను నెలకొల్పాలని, ప్రస్తుతము బ్రిటిష్ మ్యూజియములో, మదరాసు మ్యూజియములో, నందికొండ ప్రాంతంలో ఉన్న ఆంధ్ర కళాఖండాలను ఆ ప్రదర్శనశాలకుచేర్చి భద్రపరచాలని ఈ సభవారు కోరుతున్నారు"

## ౩. కేంద్ర గ్రంథాలయం

ఇది మహాసభాధ్యక్షులు ప్రవేశపెట్టిన తీర్మానం:

"ఆంధ్రదేశంలో నెలకొల్పబడనున్న కేంద్రగ్రంథాలయానికి, తంజావూరు సరస్వతీ మహాలు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారముల లోని ప్రాచీన ఆంధ్రగ్రంథాల నన్నిటిని సేకరించి భద్రపరచవలెనని, అర్హమైన గ్రంథాలను వెంటనే ముద్రించవలెనని ఈ మహాసభవారు ఆంధ్రప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నారు"

## ౪. చిత్రకళా కేంద్రం

మాధవపెద్ది గోఖలేగారు ప్రతిపాదించగా, రాంభొట్ల కృష్ణమూర్తిగారు బలపరిచిన తీర్మానం ఇది:

"ఆంధ్రుల శిల్పచిత్రకళ ప్రపంచ ఖ్యాతి ఆర్జించుకుంది. కాని, ఆ ఉత్తమ సంప్రదాయాన్ని అభివృద్ధి చేసుకునేందుకు ఆంధ్రకళలు సజీవంగా ఉన్నాయని చెప్పుకునేందుకు మనకు అత్యవసరంగా ఒక ఆంధ్ర చిత్రకళా కేంద్రం ఏర్పడడం అవసరమని అభ్యుదయ రచయితల మహాసభ భావించుతున్నది."

## ౫. సంస్కృత భాషాబోధన

"తెలుగు భాషకు పుష్టి చేకూర్చడంలో సంస్కృత భాషకుగల ప్రత్యేక ప్రాముఖ్యాన్ని గుర్తిస్తూ, ఐచ్ఛికంగా సంస్కృత భాషాబోధనకు జరిగే అన్ని

ప్రయత్నాలను అభ్యుదయ రచయితల సంఘం బల పరుస్తుంది. కాని సంస్కృతాన్ని నిర్బంధంగా బోధించడం సమంజసమైన విధానం కాదని ఈ మహా సభ అభిప్రాయ పడుతున్నది"

ఈ తీర్మానాన్ని అమరేంద్రగారు ప్రవేశపెట్టగా అనిసెట్టి సుబ్బారావుగారు బలపరిచారు.

## ౬. గ్రంథనిషేధం

ఈ తీర్మానాన్ని కె. వి. రమణారెడ్డిగారు ప్రతి పాదించగా సోమసుందర్‌గారు బలపరిచారు:

"అవిభక్తమదరాసు ప్రభుత్వం ప్రజాదరణను చూర గొన్న 'మాభూమి', 'ముందడుగు' నాటక ప్రదర్శనలను నిషేధించింది. "వజ్రాయుధం" కావ్య ప్రతులను స్వాధీనపరచుకొన్నది. ఆంధ్ర ప్రభుత్వంకూడా ఈ నిషేధాలను రద్దుచేయకపోవడాన్ని ఈ మహాసభవారు తీవ్రంగా ఖండిస్తున్నారు. అంతేగాక హైద్రాబాద్ ప్రభుత్వం 'ఎర్ర కెరటాలు', 'ఆదర్శ కుటుంబాలు' అనే కథా సముచ్చయాలను 'కల్పన' అనే కావ్య సంపుటిని 'తెలంగాణా వీరయోధులు' అనే బుర్ర కథను, 'సింహగర్జన' నవలను నిషేధించారు. ఆంధ్ర ప్రభుత్వం ఈ నిషేధాలను తాముకూడా అమలు జరుపుతున్నారు. ఈ గ్రంథాలపై నున్న నిషేధ నిర్బంధాలను వెంటనే రద్దుచేయవలసిందిగా మదరాస్, ఆంధ్ర, హైద్రాబాద్ ప్రభుత్వాలను ఈ మహాసభ వారు కోరుతున్నారు."

## ౭. సాహిత్య నిషేధం

"విదేశాలనుండి వెలువడే అభ్యుదయ సాహిత్యాన్ని రైల్వేబుక్‌స్టాల్సులో అమ్మకూడదంటూ కేంద్ర ప్రభుత్వం చేసిన నిర్ణయాన్ని ఈ సభవారు నిరసిస్తు న్నారు. ఈ నిషేధాన్ని తొలగించాలని యీ సభ వారు కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతున్నారు'."

ఈ తీర్మానాన్ని అట్లూరి పిచ్చేశ్వరరావుగారు ప్రతిపాదించగా, యస్. టి. రంగాచారిగారు బలపరి చారు.

## ౮. విశ్వశాంతి

కే. వి. రమణారెడ్డిగారు ప్రతిపాదించిన ఈ తీర్మా నాన్ని, డాక్టర్ నారాయణరావుగారు బలపరిచి ప్రసంగించారు:

"మహామానవ సమూహాలను నిర్విచక్షణగా రూపు మాపి నిస్తులమయిన మానవ సంస్కృతి మహానిధులను అంతమొందించే, ఘోరదారుణ ఫలితాలతో కూడుకొని యున్న అటం హైడ్రోజన్ బాంబులవంటి మారణాయు ధాలను ప్రయోగించడం గురించి తత్సంబంధమైన పరి శోధనలు జరపడం గురించి ప్రభుత్వాలు సకలాలో చనలు మానవలెనని ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ విజ్ఞప్తి చేస్తున్నది.

"శాంతియుత సహజీవనాదికాలైన ఉత్తమ సూత్రాలు అమలుపెట్టి సంస్కృతీ సంపదను ఇచ్చి పుచ్చుకొనుటద్వారా స్నేహసౌహార్ద సౌభ్రాతృభావా లను పెంచినప్పుడే విశ్వశాంతి సాధ్యపడగలదని ఈ మహాసభ నమ్ముతున్నది."

"భారతప్రభుత్వ విదేశాంగనీతి ద్వారా ప్రపంచ రాజకీయోద్రిక్త వాతావరణంలో తీవ్రతను తగ్గించ డానికి దేశాలనడుమ అవిశ్వాసాలను, అనుమానాలను సడలించడానికి కృషిచేస్తున్న పండిత నెహ్రూ శాంతి విధానాన్ని ఈ మహాసభ హర్షించుతోంది."

## ౯. సంస్కృతీ బాంధవ్యాలు

"ప్రాచీన, అధునాతన ఆంధ్రసాహిత్యపు ఔన్న త్యాన్ని రాష్ట్రాంతరాలలో, దేశాంతరాలలో ప్రచారం చేయడం కొరకు ఉత్తమమైన తెలుగు రచనలను ఇతర భాషలలోనికిఅనువదించడము, విదేశీరచయితలతో సన్ని హిత సంబంధా లేర్పరచు కొనడము ఆంధ్రసంస్కృతికి ప్రాతినిధ్యం వహించగల రచయితలను, కళాకారులను విదేశపర్యటనకు పంపడము మొదలైన కార్యకలాపా లను ప్రోత్సహించవలెనని ఈ సభవారు కార్యనిర్వాయక సమితిని ఆదేశిస్తున్నారు."

## ౧౦. సాహిత్య పాఠశాలలు

చాకలి రామచంద్రరావుగారిచే ప్రతిపాదించబడి ఆమోదించబడిన తీర్మానం :

"యువకరచయితలకుస్వదేశవిదేశసాహిత్యరీతుల్లోనూ, శిల్పాలలోనూ సంప్రదాయాలలోను అవసరమైన శిక్షణ నిచ్చి వారికి రచనానైపుణ్యాన్ని అభివృద్ధిచేసి ఉత్తమ మైన అభ్యుదయ కళాసృష్టికి తగిన ప్రోత్సాహం కలిగించ టానికై సాహిత్య విద్యార్థులకు ఉపయోగపడే పాఠ్య ప్రణాళికను అనుసరించి సాహిత్య పాఠశాలలను నడ పడంద్వారాను తదితర విధానాలుగను కార్యవర్గం కృషి చేయాలని ఈ సభవారు కోరుతున్నారు."

## ౧౧. లిపి సంస్కరణ

"ప్రస్తుత కాలంలో భాషావ్యాప్తి జరగాలంటే తెలుగు ముద్రాలేఖినికి, అచ్చు పనులకు అనువైన రీతిగా మన లిపిని మార్చుకోవలసిన అగత్యం ఏర్పడింది. ప్రస్తుతలిపి చాల ఇబ్బందుల్ని కలిగిస్తోంది. కాబట్టి లిపిలోని అక్షరాల సంఖ్యను, ధ్వనులు పోకుండా తగ్గించాలి. దానికి శ్రీ కొరుమంచి వెంకటేశ్వరరావు గారొక పద్ధతిని సూచించారు. ఇదివరలో పలువురు రచయితలు అనేక సూచనలు చేశారు. ఈ మహాసభ లిపి సంస్కరణోద్యమమును గురించి ఆయా రచయితల సూచనలు పరిశీలించుటకు సాధన లాలోచించాలని తీర్మానించుచున్నారు."

పి. హనుమయ్యగారు ప్రతిపాదించిన ఈ తీర్మానాన్ని కొత్తపల్లి రంగారావుగారు బలపరిచారు.

## ౧౨. రచయితకు తగిన పారితోషికం

'శారద' ప్రవేశపెట్టిన తీర్మానం.

"ఈనాడు రచయితలకు పత్రికలనుండి, పుస్తకాల ప్రచురణ కర్తలనుండి సవ్యమైన పారితోషికం లభించటంలేదు. అనేకమంది రచయితలు ఈ విషయంలో అనేక విధములైన అక్రమాలకు గురిఅవుతూ వున్నారు. ఈ అక్రమాలు అరికట్టుటకై ఈ సభవారు ఈ క్రింది తీర్మానం చేస్తున్నారు.

"పత్రికలుగాని, ప్రకాశకులుగాని రచనలు ప్రచురించి రచయితలకు ప్రతిఫలం ఇవ్వకపోవటం గర్హ్యం.

"ప్రతి పత్రికా, ప్రతి ప్రకాశకుడూ తాము రచయితలకు ఇచ్చే పారితోషిక వివరములను బహిరంగంగా ప్రకటించాలి.

"పత్రికలవల్లా, ప్రకాశకులవల్లా మోసపోయిన రచయితలు తమకు జరిగిన అక్రమాలను తెలిపినట్లయితే అభ్యుదయ రచయితల సంఘం తగిన ఆందోళన సాగిస్తుంది."

తీర్మానాన్ని కార్యనిర్వాహక సమితి తర్వాత సమావేశంలో చర్చించడానికి అంగీకరించనైనది.

## ఎన్నికలు

మహాసభ ఉపసంఘంవారు తయారుచేసిన నిబంధనావళిని ఆమోదించారు. ఆ తర్వాత ఎన్నిక జరిగింది. ఎన్నికయినవారు :

### కార్యనిర్వాహక సమితి వర్గం

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు, [అధ్యక్షులు]
శ్రీ తుమ్మల వెంకటరామయ్య, [కార్యదర్శి]

### సభ్యులు

శ్రీ అనిసెట్టి సుబ్బారావు
శ్రీ మా. గోఖలే
శ్రీ కొడవటిగంటి కుటుంబరావు
శ్రీ సుంకర సత్యనారాయణ
శ్రీ కే. వి. రమణారెడ్డి
శ్రీ కె. ఆంజనేయులు
శ్రీ ధనకుధరం
శ్రీ కొరుమంచి వెంకటేశ్వరరావు
శ్రీ పి. లక్ష్మీకాంతమోహన్
శ్రీ బి. వి. నరసింహారావు
శ్రీ రెంటాల గోపాలకృష్ణ
శ్రీ శ్రీనివాస చక్రవర్తి
శ్రీ ఉప్పల లక్ష్మణరావు
శ్రీ రాంభొట్ల కృష్ణమూర్తి
శ్రీ నార్ల చిరంజీవి
శ్రీ అవసరాల సూర్యారావు
శ్రీ కవులూరి వెంకటేశ్వరరావు
శ్రీ సోమసుందర్
శ్రీ గంగినేని వెంకటేశ్వరావు
శ్రీ పూసపాటి కృష్ణంరాజు
శ్రీ ఆకెళ్ళ కృష్ణమూర్తి
శ్రీ డి. ఎ. ఎస్. నారాయణరావు
శ్రీ కాళోజి నారాయణరావు

శ్రీ పి. సదాశివరావు

శ్రీ యం. శివనాగయ్య

కార్యవర్గం

శ్రీ కాళోజీ నారాయణరావు

శ్రీ నార్ల చిరంజీవి

శ్రీ అనిసెట్టి సుబ్బారావు

శ్రీ రమణారెడ్డి

శ్రీ సోమసుందర్

శ్రీ గంగినేని వెంకటేశ్వరరావు

శ్రీ కొరుమంచి వెంకటేశ్వరరావు

సంఘం పక్షాన వెలువడే "అభ్యుదయ" సంపాదక వర్గంగా ఈ క్రిందివారు ఎన్నికయ్యారు:

సంపాదక వర్గం

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

శ్రీ అనిసెట్టి సుబ్బారావు

శ్రీ తుమ్మల వెంకటరామయ్య

శ్రీ కె. వి. రమణారెడ్డి



చిత్రకారులు: శ్రీ పైడిరాజు

# పుస్తక పరిచయం

## ప్రేమచంద్ జీవితం

రచన: శ్రీమతి శివరాణీదేవి

అనువాదం: సీతా దేవి

వెల ; 2–0–0

ప్రచురణ:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

సుప్రసిద్ధ హిందీ రచయిత ప్రేమచంద్ జీవితాన్ని ఆయన సతీమణి శ్రీమతి శివరాణీదేవి రచించారు. సుప్రసిద్ధ తెలుగు రచయిత్రి సీతాదేవిగారు ఈ గ్రంథాన్ని అనువదించారు.

ప్రేమచంద్, నవలలు ఆంధ్ర పాఠకులకు చిరపరిచితములే. ప్రేమచంద్ 1880 లో బీద కాయస్థకుటుంబంలో కాశీవద్ద ఒక కుగ్రామంలో జన్మించారు. చిన్నప్పుడే తల్లి చనిపోయింది. సవతితల్లి ఆరడని అనుభవించారు. సవతితల్లి మాటను కాదనలేక, తండ్రి ప్రేమ్‌చంద్‌కు 14 వ ఏటనే వివాహం చేశాడు. ఆమె ప్రేమచంద్ కంటె పెద్దది. 'ఆమె ఆకారం చూడగానే నా రక్తం చల్లబడింది.' పైగా ఆమె మాటకారి.

చిన్నపుడే మాతృప్రేమను కోల్పోయిన, ప్రేమచంద్‌కు మాటకారి భార్యతో కాపరం అసంభవమైంది. తగాదాలు పెరిగి పెద్దవయి, భరించలేక ప్రేమచంద్ మొదటిభార్యను వదలివేశాడు.

శివరాణీదేవి మున్షీ దేవి ప్రసాద్ కూతురు. బాల వితంతువు. శివరాణీదేవిని వివాహ మాడటంతో ప్రేమచంద్ జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమైంది.

ప్రేమించి, గౌరవించే, భార్య ఏర్పడిన మీదట ప్రేమచంద్‌లోని నిగూఢ రచనాశక్తులు పైకి రాసాగినవి. ప్రైవేటు ట్యూషన్సు చెప్పుకుంటూ జీవితం ప్రారంభించిన ప్రేమచంద్ స్వయంకృషి ద్వారా యం. ఏ. వరకు చదివాడు. స్కూళ్ళ ఇన్‌స్పెక్టరు ఉద్యోగం వరకు పైకివెళ్ళాడు. పత్రికా రచయితగా నవలా రచయితగా పేరుసంపాదించాడు.

ప్రేమచంద్ 1935 లో అఖిలభారత అభ్యుదయ రచయితల మహాసభకు అధ్యక్షత వహించాడు. ప్రసిద్ధ సోవియట్ రచయిత గోర్కీ 1936 లో మరణించినప్పుడు తన అనారోగ్యాన్ని సైతం లెక్కచేయక స్మారకోత్సవసభకు హాజరయ్యారు. 'గోర్కీవంటి మహా రచయితకు జాతీయత, దేశం అడ్డురావు.' చిట్టచివరకు 1936 అగస్టులో, జలోదర వ్యాధితో దీర్ఘకాలం బాధపడి మరణించాడు.

భార్యాభర్తలిద్దరూ సాహితీపరులై ఒకే లక్ష్యంతో ఒకే మార్గాన పయనించేవారైనప్పుడు, వారి సాంసారిక జీవితం ఎంత మధురతరంగా వుంటుందో, ఈ గ్రంథంలోని ప్రతిపుట సాక్ష్యమిస్తుంది. శివరాణీదేవికి సాహిత్యపిపాస కలిగించింది ప్రేమచంద్. అందుకు ప్రతిగా ప్రేమచంద్ జీవితాన్ని సర్వసమగ్రం చేసింది శివరాణీదేవి. తాగుడుకు ఒకప్పుడు ప్రేమచంద్ అలవాటు పడతాడు. ఒక్క వారంరోజులు భర్తతో మాట్లాడకుండా మౌనవ్రతం వహించి, శివరాణీదేవి ఆ దురలవాటును మాన్పించ గలిగింది. ఒకరిలోని మంచిని మరొకరు పెంపుచేస్తూ లోపాలను అణచివేసుకుంటూ, కోపతాపాలను తగ్గించుకుంటూ, సహన సామరస్య మార్గాన వీరు పయనించారు.

పుస్తకం ఆఖరున రచయిత్రి బయటపెట్టిన ఒకఘటన హృదయానికి హత్తుకుపోయేట్లుగా ఉంది. ప్రేమచంద్ మరణశయ్యమీద ఉండి తన భార్యవద్ద తానుచేసిన ఒక నేరాన్ని బైట పెడతాడు. మొదటి భార్య, ఉన్నప్పుడు రెండవ వివాహం ఐనతర్వాత కూడ ప్రేమచంద్‌కు మరొక స్త్రీతో సంబంధం ఉండేది. ఆ విషయం బైటపెట్టి శివరాణీదేవి ఏమంటుందో అని ప్రేమచంద్ ఎదురుచూస్తాడు. "నాకు తెలుసు" అని మాత్రమే ఆమె సమాధానమిస్తుంది. అప్పుడు "నువ్వు నాకంటే చాలా గొప్పదానివి" అని ప్రేమచంద్ పశ్చాత్తప్తుడౌతాడు.

పుస్తకంలో ఎక్కువభాగం సంభాషణ ఫక్కీలో నడిచింది. గతించిన ఘటనలను వర్తమాన ఘటనలతో కలిపి, ఫ్లాష్‌బాక్ పద్ధతిలో, ఒకే సంభాషణక్రమంలో అతికించటంలో రచయిత్రి ప్రత్యేక సామర్థ్యం ప్రకటించింది.

పుస్తకం మొదలు పెట్టినప్పటినుంచీ, చివరి వరకు ఒక్క బిగిన చదవాలనిపించేటట్టుగా అనువాదం ఉంది. ఇట్టి చక్కని గ్రంథాన్ని అనువదించిన సీతాదేవిగారు, ప్రచురించిన విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ప్రశంసార్హులు.

— బలరామమూర్తి.

# ప్రజా వాఙ్మయము

రచన : శ్రీ చింతా దీక్షితులు

వెల : రు 1-8-0

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

"ఇప్పటి తెలుగు సారస్వత శాఖల కన్నిటికీ అయనే ఉపోద్ఘాతం" అని శ్రీ చలం ప్రస్తావించి ప్రస్తుతించిన శ్రీ చింతా దీక్షితులుగారు ఆంధ్ర సారస్వత లోకానికి చిరపరిచితులు. స్త్రీల సారస్వతం, ఆడవాళ్ల పాటలు, బాలవాఙ్మయం, బాల సాహిత్యం, యక్షగానం, కొరవంజి అనే శీర్షికలతో "ప్రజావాఙ్మయ స్వరూపాన్ని దిఙ్మాత్రంగా" సూచించారు: "ఒకమూల పండితుల సారస్వతము దీనిపీక నొక్కివేస్తోంది. కవి చరిత్రకారులూ, వాఙ్మయ చరిత్రకారులూ, ప్రజా సారస్వతాన్ని నిరసించారు. పండితకవులు నిరసిస్తున్నారు. ఈవిధముగా ఇది నశిస్తుందేమో అనిపిస్తోంది" అనే బాధతో ప్రజావాఙ్మయ స్వరూపాలను పరిచయంచేసి, వాటిని సంరక్షింపచేయాలనే ఆశయంతో దీక్షితులుగారీ రచనలను చేశారు.

ప్రజావాఙ్మయం, ఈనాడు ప్రామాణిక వాఙ్మయం అని పండితులు పేర్కొన్న దానికంటె ముందునుంచే ప్రచారమై వుంది. 'కుశలాయకము' వ్రాసిన రామచంద్ర రాజకవి తన భాషనుగురించి ఇలా చెప్తూ వున్నాడు.

"పరగమూఢుల కైన బాగుగా తెలియగా
... ... ... ... ...
కఠినంబులుంచితే కాపులకు తెలియదని.
మరుగులుంచుటమాని మాటలుంచితిని" అన్నారు.

స్త్రీల సారస్వతమునకు సంబంధించిన వివిధ శాఖలను వివరించి రసవంతమైన భాగాలను అనేకం ఉల్లేఖించి, స్త్రీల సారస్వత విశేషాలను శ్రీ దీక్షితులుగారు ఇలా వివరించుతున్నారు.

"స్త్రీల సారస్వతములో ఒక విశేషం ఏమిటంటే చెప్పదలచుకున్న విషయం సూటిగా హృదయానికి తగిలేటట్లు చెప్పడమే. అందువల్లనే రసము చిలుకుతూ ఉంటవవి. అఖండకావ్యాలు చేద్దామని గాని, అర్థము చేసుకోలేని కావ్యాలల్లు దామనిగాని, వారు తలపెట్టరు.......ప్రబంధ లక్షణములను ఎదుట పెట్టుకొని, వరవడి దిద్దుకొనే ప్రబంధ కవుల కావ్యాలకంటె సహజమై, సెలయేళ్లవలె ప్రవహించే ఈ పాటలలోనే గుణము అతిశయముగా ఉన్నది."

"ఇప్పటి కవుల చరిత్రలూ వాఙ్మయ చరిత్రలూ సంపూర్ణములు కావు" అనీ, ఆంధ్ర దేశములో పుట్టి పెరిగి ప్రచారములోవున్న ప్రతి సారస్వత శాఖకూ కవుల చరిత్రలో స్థానమున్నపుడే అది సంపూర్ణమనిపించుకొంటుంది. లేనివాడు కాదు. స్త్రీల సారస్వతములో భాషజీవద్భాష......వ్యాకరణానికది బానిసకాదు. ఇదే వ్యాకరణాన్ని బానిసగా చేసుకోగలదు."

"శిశువు జన్మించినది మొదలు బాల్యదశ వీడేవరకు కూడా వాని మనస్సుకు రంజకంగా ఉండే" ప్రాచీన బాలవాఙ్మయాన్ని ఉద్ధరించ వలసిన ఆవశ్యకతను బాలవాఙ్మయంలో వివరించారు. 'నన్నయకుకూడా పూర్వమందు పుట్టి నేటివరకూ నిలిచివున్న' కొన్ని పాటల స్వరూప స్వభావాలను పరిచయం చేశారు. 'బాల సాహిత్యం'లో స్థూలంగా బాల సాహిత్యానికి ఎన్నో కావలసిన విషయాలను తెలియజేశారు.

"యక్షగానము" అనే శీర్షికలో యక్షగానమంటే నాటకము కాదనీ, యక్షగానాలు వీధినాటకాలుగా పరిణమించి వుండవచ్చునీ దీక్షితులుగారు నిర్ధారించుతున్నారు. యక్షగానం ప్రశస్త సారస్వతశాఖ అని నిరూపించుకుంటూ వచ్చారు. యక్షగానాలవల్ల ఆ కాలపు సంఘమందలి ఆచారవ్యవహారాలనూ, వారి పలుకుబళ్ళనూ, వేషభాషలన్నీ తెలుసుకోవచ్చుననీ, చరిత్ర, భాషా పరిశోధనలకు ఇది ఉపయోగకరమనీ రచయిత గాఢవిశ్వాసం.

దీక్షితులుగారు దిఙ్మాత్రంగానే ప్రజా వాఙ్మయాన్ని తరచిచూచామని అన్నారు. అయినా ప్రజల బంగారుగని అనదగిన ఈ వాఙ్మయాన్ని పునరుద్ధరించవలసిన ఆవశ్యకతను దీక్షితులుగారు చక్కగా వివరించారు. ప్రస్తావనలో చలంగారన్నట్లు "ఇపుడు చెయ్యవలసిం దేమంటే, ఈ వాఙ్మయాన్నంతా తెలుగు సారస్వతంలో కలిపెయ్యడం. దానికి అభ్యంతరం చెప్పగల గుండెవున్నవాళ్ళు ఈనాడులేరు, దీక్షితులుగారి అకుంఠిత కృషివల్ల."

చలంగారి "ప్రస్తావన" ఈగ్రంథానికి ఒక ప్రత్యేక విశిష్టతనుకూర్చింది. వ్యావహారికభాష ఆవశ్యకతను పునరుద్ఘాటించుతూ, కృతకభాషనునిరసించారీ ప్రస్తావనలో.

ఈ గ్రంథానికి శ్రీ వెంబుగారు చక్కని ముఖచిత్రం రచించారు. సారస్వత ప్రియులందరూ చదువవలసిన గ్రంథం.

—తుమ్మల

విజయవంతముగా నడుచుచున్న ....



# పునరీక్షణకై చేరిన గ్రంథములు.

1. సైన్సు కథలు: శ్రీ వేమరాజు భానుమూర్తి.
2. విశ్వ కథ
3. గీతా సుధ
4. బాపూజీ
} శ్రీ పి. రామకృష్ణరావు, బి. ఎ., బి. ఇడి., జయహింద్ హైస్కూలు, మనుల.
5. జనకరాగ కృతి మంజరి. శ్రీ యం. బాల మురళీకృష్ణ.
6. బ్రహ్మానంద బోధామృతము. శ్రీ స్వామి చిరంతనానంద, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు.
7. భక్తిసారము: శ్రీ పరమానందస్వామి, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు.
8. అరుంధతీ వసిష్ఠము. శ్రీ బులుసు వెంకటేశ్వరలు, బి. ఏ., బి. వి. అండ్ సన్సు, రామరావుపేట, కాకినాడ.
9. శ్రీ రమణాశ్రమ లేఖలు—ద్వితీయ భాగము: శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామల.
10. వేదభూగోళము: శ్రీ కుర్రివేటి తిప్పాశాస్త్రులు, యాడికి గ్రామము పోష్టు.

# భారత జ్యోతి.

సంపుటము 6. | శ్రీ నందన సం॥ మాఘ బ॥ ౧౨, ఫిబ్రవరి 11, 1953. | ప్రతి బుధవారము ప్రకటింపబడును.


## ఎంతటి దౌర్భాగ్యస్థితి ఏర్పడినది.

భారత దేశము బాహ్య నొక్కుడుల నుండియు, విదేశీయుల పరిపాలనము నుండియు విడుదల పొంది, స్వతంత్ర దేశమై ఇప్పటికి ఐదు సంవత్సరములు ఆరు మాసములు దాటినది. సర్వతంత్ర సంతంత్ర రిపబ్లిక్ దేశమని ప్రకటింపబడి మూడు సంవత్సరములు దాటినది. గడచిన ఐదున్నర సంవత్సరముల కాలములో, వివిధ రంగములలో, మన నాయకులు దేశ పరిపాలకులుగా కొన్ని ఘనకార్యములను సాధించిరి. లేదనుట లేదు. వానిని చులకన చేయుట మా ఉద్దేశ మెంత మాత్రము కాదు. కాని దినములు, నెలలు, సంవత్సరములు గడచు చున్న కొలది ప్రజలనుండి నాయకులు దూరమునకు పోవుచున్నారనియు; దినదినమునకును ఎక్కువగుచున్న (ప్రజల) వారి కష్టములను నిర్లక్ష్య భావముతో చూచుచున్నారనియు అసందిగ్ధమైన పదములతో చెప్పుచో మా ధర్మము నెరవేర్చిన వారము కాజాలము.

నిజమును తెలిసికొనవలెనని కానీ, తెలిసికొనిన నిజమును ప్రకటింపవలెననికాని ఎవ్వరికైన కుతూహలము ఉండినచో — ఇండియా సర్వతంత్ర స్వతంత్ర రిపబ్లిక్ దేశముగా మార్పొందినదని కానీ, దేశముపై గల హక్కు (అధికారము—సావరింటి) తమకు (ప్రజలకు) మార్పు చేయబడినదని కానీ లేక తమ నాయకులే దేశ పరి పాలనమును సాగించు చున్నారనికాని సామాన్య ప్రజలు భావించుట లేదని చెప్పి తీరవలెను. బ్రిటీషు వారి నిరంకుశ పరిపాలనా విధానముతో, — ఇప్పుడు అమలులో నున్న ప్రజాసామ్య పరి పాలనమును పోల్చి చూచినచో—సామాన్య పౌరుని ఆర్థిక పరిస్థితిలో ఆవగింజంతయైనను మార్పు కనబడుట లేదు.

శరణార్థుల సమస్య; వారి పునరావాస సమస్య. కాశ్మీర సమస్య. 600 పైగా కోటలవలె ఉండిన స్వదేశ సంస్థానములను తొలగించి దేశములో అంతర్భాగముగ చేర్చుకొన్న విషయము, చిత్తరంజన రైల్వే కార్మాగార నిర్మాణము, దామోదర లోయ ప్రాజక్టు, ఇండియా యూనియన్ విదేశాంగ విధానము మొదలైనవి ఒక్కొక్కటి చిక్కులతో కూడుకొనిన పెద్ద పెద్ద సమస్యలు. కానీ ఇవి బీద ప్రజలు, దౌర్భాగ్యులు అనుభవించుచున్న నిత్య నికృష్టమైన జీవితములపై ఎంత మాత్రము మార్పు కలిగించినవి కావు. ఇట్టి ఘనకార్యములను సాధించితిమని మన నాయకులు సగర్వముగా ప్రకటించుకొని, తమలో తాము తృప్తి

పడవచ్చును. సామాన్యపౌరునికి ఈ సమస్యలు అర్థమే కావు. 1939 సంవత్సరము నుండి రూపాయ విలువ 100 టికి 500 మొదలు 600 వఱకు తగ్గిపోయినది. జీవితావసరములైన ఆహార ధాన్యముల ధరలు, గుడ్డల ధరలు విపరీతముగా పెచ్చుపెరిగి పోయినవి. ఇండియా దేశమునకు స్వాతంత్ర్యము రాకముందుకాని, లేక స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత కాని రూపాయ విలువ ఎక్కువ చేయ బడినదా—ఆహార ధాన్యముల ధరలు, గుడ్డల ధరలు తగ్గింప బడినవా లేదా అను ఈ రెండు ముఖ్య సమస్యలే సామాన్య ప్రజలకు పట్టినది కానీ మిగత వేమియు పట్టలేదు. పట్టవు.

ఈ పైన తెలిపినవి రెండే దేశీయులను దినదినము ఎదుర్కొనుచున్న ముఖ్య సమస్యలు. వృద్ధులు, బాలురు, స్త్రీలు, పురుషులు, అను వివక్షణలేక కోట్లకొలది ప్రజలకు సంబంధించిన సమస్యలు ఇవి. పొలములలోను, కార్మాగారములలోను, ఇతర సంస్థలలోను పనిచేయు నౌకరుల కెల్లరికిని సంబంధించిన సమస్యలు ఇవి. ఈ రెండు సమస్యలను దృష్టియందుంచుకొని మన జాతీయ ప్రభుత్వములు ఏమి సాధించినవో, ఎంత మాత్రము సామర్థ్యమును చూపినవో చర్చింపవలెను.

యుద్ధము తీవ్రరూపముదాల్చి, జర్మనీ బాంబులుపడుచు కట్టడములను, కార్మాగారములను బూడిదగా చేయబడుచున్న దినములలోకూడ, ఇంగ్లాండు దేశములో ప్రజలకెల్ల ముఖ్య ఆహారమైన రొట్టె ఖరీదును, ఒక్క ఫార్థింగు వఱకైనను (ఒక్క దమిడీ) పెంచ లేదు. జీవించుటకై ప్రతి మనిషికిని ఒక కనీసమైన పరిమాణముగల రొట్టె ఇవ్వవలెనను నియమ ముండినది. అట్టి కష్టదశలో కూడ ఆ దేశములో ప్రజల కందజేయురొట్టె యొక్క పరిమాణమును ఒక్క గురిగింజంతైనను తగ్గింపలేదు. ఈ విషయమును ఇండియా దేశ నాయకులమని చెప్పుకొనుచు వ్యవహరించుచున్న నాయకులెల్లరు గమనించెదరుగాక. రష్యా దేశమునకు యుద్ధములో ప్రత్యక్ష జోక్యముండినది. శ్మశానభూమిగ చేయబడినది. అధిక చలామణిచే అనేక కష్టములనుభవించినది. కాని యుద్ధము పరిసమాప్తమైన వెంటనే మానవ జీవితమునకు అత్యవసరమైన వస్తువుల ధరలను తగ్గించుటకై రష్యా ప్రభుత్వమువారు తమ దృష్టినంతయు కేంద్రీకరించిరి. చెలామణి విధానములో (ప్రాంతరాబుల్ లున్కు క్రొత్త రాబుల్ లున్న) తీవ్రమైన మార్పు తెచ్చిరి. పెచ్చు పెరిగిన ధరలన్నియు టప టపమని క్రింద పడెను. సామాన్య ప్రజలకువలయు అవసర వస్తువులు అందుబాటులోనికి వచ్చెను. ఈ విషయమును కూడ మన నాయకులు గ్రహించెదరుగాక.

కడచిన యుద్ధములో ఇండియా దేశమునకు ప్రత్యక్షముగా ఏలాటి జోక్యము లేదు. ప్రపంచమునగల పెద్ద పెద్ద దేశములన్నియు యుద్ధములో పాల్గొనుచుండినందున, ఇతర ఏ దేశమునుండి కాని, ఆహార ధాన్యములు, గుడ్డలు, ప్రత్తి, చక్కెర మొదలైనవి ఈ దేశములోదిగుమతి చేసుకొనుటకు బొత్తిగా వీలులేకుండెను. అమేరికా, బర్మా, జపాన్ దేశములనుండి దిగుమతులు బొత్తిగా నిలిచి పోయెను. ఇతర దేశములనుండి ఏ విధమైన సహాయము ఈ దేశమునకు రాలేదు. కాని బ్రిటను పక్షమున నిరంకుశ పరిపాలనము కొనసాగించుచున్న తెల్ల దొర, ఇండియా దేశ సంపదనుండియే ఆహార ధాన్య

మును సేకరించి, ఈ దేశములోను, ఈ దేశ సరిహద్దులలోను ఉంచబడిన అమెరికా, బ్రిటను, ఆఫ్రికా సైనికులకు ఇచ్చుటేకాక, దేశ ప్రజలకు, రేషన్ డిపోలద్వారా (ఫేరుప్రయిజు డిపోలు) రూపాయకు 2 1/2 పడి బియ్యము అందజేయుచు వచ్చెను. ఈ విషయము మనలను ఇప్పుడు పాలించు కాంగ్రెసు మంత్రి పుంగవులు కాదనగలరా! యుద్ధ అవసరములకును, ఇండియా దేశ ప్రజలకును వలయునంతటి ధాన్యమును చేకూర్చుటేగాక సింహాళ ద్వీపమునకుకూడ బియ్యము ఎగుమతి చేయబడెను.

గుడ్డల మిల్లులన్నియు యుద్ధావసరములకై పనిచేయవలెనని ఆర్డినెన్సు ప్రకటింపబడెను. రాత్రింబగళ్లు మిల్లులు యుద్ధావసరములకై గుడ్డను తయారు చేయుచు వచ్చినవి. బ్రిటనునుండి, జపానునుండి గుడ్డ దిగుమతులు నిలిచిపోయెను. కాని తెల్లదొర, దేశప్రజల అవసరములను మఱచిపోలేదు. ఇండియా డిఫెన్సు రూల్సుక్రింద ప్రతి మిల్లు కొంత భాగము బీద ప్రజలకై ముతకగుడ్డ (కోరా) ఎఱ్ఱగీతతో తయారు చేయవలయునని ఉత్తరువు జారీచేసెను. ముతక చీరలను కూడ తయారు చేయించెను. గజము 1 టికి 8 అణాలు, 10 అణాలకు మించకుండా బీద వారికి అమ్మకము చేయవలెనని నిర్ణయించెను. ఆ ప్రకారమే అంత తక్కువ ధరలలో యుద్ధకాలములో బీదలకు గుడ్డ లభింప జేయబడెను. కాని జలగలవలెనున్న కొందఱు హోల్‌సేల్ వర్తకులు అధిక లాభములను పొందుటకై అట్టి చౌక గుడ్డను బీదలకు అందచేయక పోయిరి.

యుద్ధకాలములోనే ఈ దేశములో సైనిక అవసరములను తీర్చుకొని, దేశ ప్రజలకు ఒక్క రూపాయకు 2 1/2 పడి బియ్యమును, 8 మొదలు 10 అణాలకు ఒక గజము గుడ్డను బ్రిటీషు పరిపాలకులు ఎటుల అందజేయగలిగిరి— యుద్ధము పూర్తియైనది. విదేశ సైనికులులేరు. యుద్ధావసరములు ఇప్పుడులేవు. విదేశములనుండి ఆహార ధాన్యము, ప్రత్తి, మొదలైనవి దిగుమతి యగుచున్నవి. ఇప్పుడు రూపాయకు రెండు పళ్ళ బియ్యము, 8 అణాలకు ఒక గజము గుడ్డను ఏల పంచిపెట్టలేకున్నామని ఒక మంత్రికి కాకున్న మఱియొక మంత్రికైనా తట్టినదా! ఒక నాయకునికి కాకున్న మఱియొక నాయకునికైనా తట్టినదా? దేశములోగల బీదలను, నిర్భాగ్యులను ఉద్ధరించుటకై ఆహార ధాన్యము, గుడ్డలయొక్క ధరలను తగ్గింపవలెనని (రూపాయ విలువను ఎక్కువ చేయవలెనని) పరిపాలనతో సంబంధముగల ఒక్క నాయకుడైన శ్రద్ధగా యోచించిన పాపమున పోలేదు. దీనిని మనమెల్లరము సిగ్గుతో తల వంచుకొని అంగీకరింపవలెను.

యుద్ధము తీవ్రముగా యున్న రోజులలో ఇంగ్లాండు దేశము తన ప్రజలకు కావలసిన రొట్టె ధరను పెంచకుండ ఎటుల సప్లయి చేయగలిగెనో అటులనే యుద్ధము ముగిసిన తర్వాతనైనను ఇండియా దేశములో ఆహార ధరలు పెరుగకుండ చూచుటకు వీలుండితీరునుకదా? విదేశములనుండి దిగుమతులు వచ్చుటకు ప్రారంభమైనప్పటి నుండియైన ధరలను తగ్గించుటకు వీలుండెడిది కదా! అధిక చలామణిని తగ్గించి, రూబుల్సు విలువను ఎక్కువచేసి, అవసర వస్తువుల ధరలను రష్యాదేశము ఏతీరుగా తగ్గింపగలిగెనో ఆ దేతీరున ఈ దేశములోకూడ చేసి

యుండుటకు వీలుండెడిదికదా? అధిక చలామణిని తగ్గించుటకు ఎట్టి విధానము రష్యా ఆర్థిక శాఖా మంత్రికి స్ఫురించెనో, అదే ఇండియా ఆర్థిక శాఖా మంత్రికిని, ఆర్థిక సలహా దారులకును తట్టి యుండవలసినది కదా? కోట్ల కొలది ప్రజల జీవితములకు సంబంధించిన ఈ ముఖ్య సమస్యలను పరిష్కరించుటకు ఎవ్వరు తీవ్రమైన కృషి చేయక—బీదల కష్టములను గూర్చి సానుభూతి ఉన్నట్లు నోట్టితో ఇరువది నాలుగు గుంటలు వదరుటతో, మన నాయకులు తృప్తి పడుచున్నారు.

అయితే పైన తెలిపిన సమస్యల లోను, వ్యవహారములలోను, అవినీతికరము లైన లంచగొండి తనములోను—సాధారణమైన పౌరునికి—అస్పష్టహక్కులు గల వీధుల లోని మనిషికి, ఏలాటి సంబంధము లేదను విషయము ఎవ్వరు మఱవ కుందురుగాక! అట్టివారు ఇట్టి పాపమును ఒడి కట్టుకొన లేదు. దేశ పరిపాలనముతో కాని, రాజకీయ పార్టీలతోకాని ఏ విధమైన సంబంధము లేని విజ్ఞాన వంతులకు కూడ, పై అవినీతికరమైన కార్యములతో సంబంధము లేదు. వీరందరు ఏమి చేయలేని అసహాయులై, విదేశీయుల పరిపాలన క్రిందనే ఉన్నామా లేక తమకు ఆశాజ్యోతియైన అపూర్వ నాయకోత్తముని పరిపాలన క్రిందనున్నామా అని ఆశ్చర్య పడుచున్నారు. ఒక కోసన, పండిత జవహరిలాలుగారు దేశపరిపాలనా బాధ్యతను వహించి యుండుట, మఱి రుక కోసన సామాన్య ప్రజల పరిస్థితులు ఉపేక్షింపబడి ఇంకనూ హీన దశకు వచ్చుచుండుట—వాస్తవ పరిస్థితులకును, భావములకును పరస్పర విరుద్ధముగా నున్నది. నిజము ఎప్పటికి నిజమే. పైన తెలిపిన విషయములను సవాలు చేయుటకు వీలులేదు.

ఎ కొంత మందోతప్ప, అధిక సంఖ్యాకులైన ప్రభుత్వోద్యోగు లెల్లరు ఉత్తమ శ్రేణికి చెందిన నాయకులను దిగవిడిచినారని తోచుచున్నది. వారు వారి దేశమాతకును, దేశీయులకును ద్రోహము చేసి యున్నారు. ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన కాంగ్రెసు సభా సందర్భములో, విషయ నిర్ణయ సభలో, శ్రీ ప్రకాశ చంద్ర సెల్ గారు మాటలాడుచు:—

"ప్రజలు తమ సహకారమును ఇచ్చుటకు ప్రభుత్వ యంత్రము అడ్డుపడు చున్నట్లున్నది. ఈ ప్రభుత్వోద్యోగులను సంస్కరించి వారు న్యాయమైన పరులుగను, దయాళువులుగను మార్పొందునట్లు చేసినే కాని, ప్రజలు అభివృద్ధి నొందజాలరు. జీపుల అపవాదములు, ప్రీఫాబ్రికేటెడ్ ఇండ్ల ఆరోపణలు మొదలైనవి చూచిన చో, ప్రభుత్వోద్యోగులు, న్యాయ దీక్ష, దేశ సేవ అనుభావములకు చాల దూరములో ఉన్నారని స్పష్టమగును. దీనికి తోడుగ ఈ ఉద్యోగుల అవినీతి చర్యలు ఆవకాశము చిక్కినప్పుడెల్ల పార్లమెంటులో సమర్థింపబడు చున్నవి. నిజములో కాంగ్రెసువారు (ప్రజలు) బాధ్యులు కాకున్నను, వారే బాధ్యులని ఆరోపించు చున్నారు." అని తెలిపిన దానిలో సత్యమున్నటుల తోచుచున్నది.

కడచిన 200 సంవత్సరములుగ హృదయములేని ఉక్కుతో, ఒక ప్రత్యేకమైన పనికై, బ్రిటీషువారు ఈ పరిపాలనా యంత్రమును నిర్మించియున్నారు. ఒక

(మిగత 24-వ పేజీలో)

# సందేహాలు—సమాధానాలు.

పాఠకులకు కలుగు సందేహాలను మా కార్యాలయానికి పంపిన ఎడల పై శీర్షిక క్రింద వానికి సామాధానములు ఒసగబడును.

సహాయ సంపాదకురాలు:

వివాహితులైన పురుషులు తమ భార్యాబిడ్డలతో ఆనందముగా జీవిస్తుండికూడ ఒకొక్కసారి వేశ్యాలోలురైపోయి, తమ కుటుంబాలను అనేక కష్టనష్టాలకు గురిచేసేటందుకు కారణమేమి?

ఇందుకు ముఖ్యకారణము వారిలోని మానసికబలహీనత. మానసికబలహీనులైన పురుషులుగాని, స్త్రీలుగాని ఎప్పుడూ ఒకే విధమైన జీవితముతో — అదిసౌఖ్యప్రదయినాకూడా—తృప్తిని పొందలేరు. ఇటువంటి వ్యక్తులు తమ నిత్య జీవితములోని అనేక విషయాలలో వారిలోని ఈ మానసిక బలహీనతకు గురికాబడుచుందురు ఉదహారణమునకు కొందరు నిత్యమూ ఒకేవిధమైన ఆహారాన్ని- అదిరుచికరమైన పదార్థలతోకూడియుండినాకూడా—భుజిస్తూ తృప్తిపడలేరు. కొంతకాలానికది వారికి ఒకవిధమైన విసుగును కలిగిస్తుంది. కొందరుపెద్దపెద్ద నగరాలలో తమకు కావలసిన సౌఖ్యాలనన్నిటిని అనుభవించుచుండికూడా, ఆజీవితముతో తృప్తిపడియుండలేరు. కొంత కాలానికది వారికి విసుగును కలిగిస్తుంది. ఇదేవిధముగా కొందరు ఒకేవృత్తిలో జీవితమంతా విసుగుకొనకుండగడపలేరు. ఇంకా ఇటునంటి అనేక ఉదాహారణలు చూపించవచ్చు. ఈ తరగతికి చెందిన పురుషులు ఎంతో సౌఖ్య ప్రదమైన వైవాహిక జీవితాన్ని అనుభవించు చుండికూడ కొంతకాలానికి అదివారికి ఒకవిధమైన విసుగును కలిగిస్తుంది. దానిఫలితముగా తమ వైవాహిక జీవితములో నూతన మార్పు కలిగించుకొనేటందుకు వాంఛిస్తారు. తమకు వైవాహిక జీవితములో కలిగిన విసుగును పోగొట్టుకొనేటందుకు నూతన అనుభూతిని పొందేటందుకు,పరస్త్రీలోలురైపోతారు. సెక్సువిషయాల్లో అనేకసంవత్సరాలు పరిశోధనలు చేసిన హెవలాక్‌ఎల్లిస్ మేరీస్టూప్స్, వంటిప్రముఖులుకూడా వివాహితులు వేశ్యాలోలురయ్యేటందుకు ఇదే ముఖ్య కారణమని తెలిపినారు. ఇంకొక ముఖ్యవిషయ మేమన ఇటువంటి పురుషుడు వేశ్యతోడి జీవితముతో కూడా చాలా కాలము తృప్తిపడి ఉండలేడు. మొదటి వైవాహిక జీవితము వీరికెటువంటి విసుగుకలిగించినదో, వేశ్యతోడి జీవితముకూడ కొంత కాలానికి అటువంటివిసుగునే కలిగిస్తుంది. అప్పుడు తిరిగి జీవితములో నూతనమార్పు కావాలని వాంఛిస్తాడు. అటువంటిపరిస్థిలో తిరిగి తనభార్యతో జీవించేటందుకు వాంఛిచును. దానిఫలితముగా వేశ్యను విడిచిపెట్టి, తిరిగి తనకుటుంబములో చేరుకొంటాడు. ఇటువంటిమానసిక బలహీనుల జీవితచరిత్రలనే మన మనేక చలన చిత్రాలలో చూచుచున్నాము.

ఈ తరగతికి చెందిన వ్యక్తులకు వైవాహిక జీవితము విసుగును కలిగించునపుడు, నూతన మార్పును పొందేటందుకు తప్పని

సరిగ వేశ్యాలోలురై పోనవసరములేదు. తాత్కాలికముగా కొంతకాలము దాంపత్య జీవితానికి దూరముగా ఉండడమువలన తిరిగి ఆ జీవితములో నూతనాకర్షణ కలుగును. ఇంతకూ ముఖ్యవిషయమేమన, మానవుడు ప్రకృతి (తనమనస్సులో కలిగే) భావాలకు బానిస కాకుండా, ప్రకృతినే తనకు బానిసగా చేసికోగలితే ఆత్మకౌన్నత్యాన్ని పొందగలడు.

### వర్ణభేదాలు భగవన్నిర్మితాలా!

కాదు. భగవానుడు తనసంతతిలో కొందఱిని అల్పులుగా సృష్టించే టంతటి పక్షపాతి కాదు. అనాది కాలములో సంఘక్షేమము కొరకు నామమాత్రముగా విధించుకొన్న ఈ కుల భేదాలు రాను రాను బలపడి మానవులను తెగలు–తెగలుగ విభజించి, వారిలోని ఐకమత్యాన్ని నశింపజేసినాయి. ఈ భేదాలవలన ఐకమత్యము నశించి పోయినది. మన దేశము విదేశీయుల పాలయినది. ఈ నూతన స్వాతంత్ర్యయుగములోని ప్రబోధమువలన ఈ కులభేదాలకు స్వస్తి చెప్పడము ప్రారంభమయినది. బహుశా ఇంకొక శతాబ్దముగడిచే టప్పటికి మన దేశములో కుల భేదాలు నశించిపోవచ్చును. (కె. గి)

## గ్రంథ విమర్శనము.

## "జనకరాగ కృతిమంజరి"

గ్రంథకర్త:– శ్రీ మంగళంపల్ల బాల మురళీ కృష్ణగారు.

కళలు అరువది నాలుగని మనపూర్వుల నిర్ణయము. ఆంగ్లేయ పద్ధతిననుసరించి పైవానిలో గొన్నిటిని (Fine Arts) 'లలితకళలు' అనుట పరిపాటియైనది. సంగీత శిల్ప కవిత్వములు లలితకళలగును. వీనిలో ఆపాతమధురమగు సంగీతము సర్వప్రాణుల కానందపఱచునదిగా నున్నది.

హైందవ విజ్ఞానము 'అసురులు–సురులు' అను రెండు తెగలవారి ప్రత్యేక పరిశ్రమలవలన నభివృద్ధియైనట్లు పూర్వగ్రంథములలో సూచనలున్నవి. అట్లే సంగీత నాట్య విద్యలు పైరెండు తెగలవారి కృషివలన బెరిగి, లోకమున ప్రచారమొనరింపబడెనని తెలియుచున్నది. శ్రీ త్యాగరాజస్వామి 'విదులకు మ్రొక్కెద' అనుకీర్తనలో సామనిగమ విదుల పేర్లుపట్టికనిచ్చినారు. కమలా గౌరీవాగీశ్వరాదులును, గరుడ నందీశ్వరాంజనేయాది భక్తులును శారదశార్ఙ్గదేవ సోమేశ్వరాది ఋషులును, ఇతర దేవతలును సంగీత కోవిదులని యీ కృతిలోఁ గలదు. రావణాదులును సంగీత విద్యా పరిశ్రమ చేసినవారని మనము వినుచున్నాము. కాని, గాన విద్య పూర్వమునసే సర్వజన ప్రేమకు, పాత్రమై అన్ని తెగలవారిచేత భక్తి శ్రద్ధలతో సేవ్యఁబడుచున్నదనుట నిర్వివాదవిషయము.

భరత శార్ఙ్గదేవ జయదేవాదులును, వెంకటమఖి మొదలగు వారును సంగీత విద్యకు లక్ష్య లక్షణముల నేర్పరచిరి. డెబ్బదిరెండు మేళకర్తలుగా విభజింపబడిన గాన పద్ధతిని ప్రచారము చేయుటకే త్యాగరాజుగారు వేలకొలది కృతులు రచించి, కర్ణాటక సంగీతమునకు నాంధ్ర భాషా స్వరూపమిచ్చిరి. ఇట్లే క్షేత్రయ్య, ముత్తుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రులు, పట్నం సుబ్రహ్మణ్య అయ్యరు మొదలగు విద్వాంసులు సంస్కృతాంధ్రములలో బలుకీర్తనలు రచించిరి. సంగీత విద్య ప్రచా

* గ్రంథకర్తపేర "సత్యనారాయణపురము" విజయవాడ–2 అని వ్రాసిన పుస్తకము లభించును.

రమున మార్పు పొందుచు వచ్చినను, ఆ మార్పును శాస్త్రజ్ఞులు గుర్తించుచు, వాని నంగీకరించుచు, ప్రచారము చేయుచు, శాస్త్రమును విస్తరించుచు వచ్చుచున్నారు. 'శాస్త్రపఠనమువలనే విద్యా పరిశ్రమ పూర్తికాదు' అనుట ఇతర శాస్త్రముల యెడ నెట్లయినను సంగీతమునకు పూర్తిగాఁ జెల్లుచున్నది. శాస్త్రమాధారముగాఁగొని ఏండ్ల తరబడి గురుశుశ్రూషచేసి విద్యారహస్యము తెలిసికొని సాధన చేసిననేగాని సంగీత పాండిత్యము లభింపదు. ఇట్టి వైదుష్యముగల గాయకులనే రసికలోక మాదరించుచున్నది. ప్రకృతమున సామాన్య ప్రజలు సినిమా సంగీతమునెడల నపరిమిత ప్రేమ చూపుచున్నను కొన్నాళ్ళకా సినిమాపాటలు వెగటయి, క్రొత్తపాటల కబ్బులు సాచుట జరుగుచున్నది. శాస్త్రాధారముగల సంగీతమున విద్వాంసులు కీర్తనలను చాలకాలము సాధనచేసిననేగాని సభను రంజింపఁజేయలేరు. ఆ కీర్తనలు వేదమంత్రములవలె ననుదినము పాడినను, వినినను, వినుగు జనింపదు. సామాన్య ప్రజకు శాస్త్ర సంగీత మర్మము గానున్నను, వారు విద్వాంసులయెడ వినయపూర్వక భక్తి శ్రద్ధలను జూపుచునే యున్నారు. 'సంగీత విద్య ఘనమైనది' యను నభిప్రాయముతోనే యున్నారు. ఇట్టి ప్రజా సముదాయమున కర్థమగు 'సంకేతాదులతో' సంగీత గ్రంథముల రచించి వారి కందఁజేయుట విద్వాంసులకు విధియైయున్నది. 72 మేళ కర్తల భేదముచే నిర్మితమైన మన గాంధర్వ వేదమును పలువురు నేర్చియు, ప్రజాభిరుచికి దగిన క్రొత్తరాగముల ప్రస్తరించియు, శాస్త్ర పద్ధతికిని ప్రజల రుచికిని సమన్వయ మేర్పఱచుచు విద్యాప్రచారము చేయవలసియున్నది. ఇట్లు సంగీతవిద్య వెలయవలెనన్న, ప్రభుత్వమును, విద్వాంసులును పూనుకొన్ననే సాధ్యమగును.

సంగీత శాస్త్రము కొన్ని రాగములకు దిక్ప్రదర్శకము మాత్రమే యగును. భైరవి, తోడి మొదలగు రాగములు వత్సరములకొలది సాధన చేసిననేగాని జంత్ర గాత్రములలోఁ సౌష్ఠవముగఁ బలుకవు. భైరవీరాగము 20 వ మేళకర్తయగు నఠభైరవీ జన్యమని శాస్త్రమున నున్నను, నఠభైరవీ వ్యతిరిక్తములగు స్వరములన్నిటిని సహాయముగాఁ గొన్ననే ఈ రాగము రక్తికి రాఁగలదు. తోడి, కర్ణాటక సంగీతమందలి హనుమతోడి మేళ జన్యమనుటకన్న 'హైందవ సంగీత సంప్రదాయాల సార'మనుట మంచిది. కాఫీ బ్యాగు సారంగ మొదలైన రాగములు ఒక్కొక్క జనక రాగమునకే సంబంధించినవని శాస్త్రము సూచించుచున్నను, భిన్న భిన్న మేళముల స్వరములు పలికిననే గాని, ఆనందము నీయవు. స్ఫురింపనుగూడ స్ఫురింపవు. ఇట్టి విద్యా రహస్యములన్నియు జన సముదాయమునకు వ్యక్తమై వారు రసజ్ఞులు కావలెనన్న గాయకుల సంఖ్య యెక్కుడై, విరివిగా గ్రంథరచనము జరిగిననే గాని సాధ్యముకాదు.

ఆంధ్రరాష్ట్ర మవతరింపనున్నది. ఆంధ్ర విద్వాంసుల మూలమున నభివృద్ధియై మన సంగీతము విరివిగా ప్రచారము గావలసియున్నది. శ్రీ మురళీకృష్ణగారివంటి గాయక శిరోమణులు గాన సభల మూలమున మాత్రమేగాక, గ్రంథ రచనతోగూడ నీకార్య మారంభించుట ముదావహము.

శ్రీ మురళీ కృష్ణగారు, గాయక సార్వభౌములగు పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి శిష్యులు ఎనిమిది తొమ్మిదేండ్ల వయస్సుననే గానవిద్యా ప్రదర్శన మారంభించి మెప్పు బొందినారు. ఇపుడు వీరు పదునెనిమిదేండ్లవారు. ఆంధ్ర ద్రవిడ దేశములందు తమ గాన విద్యను ప్రదర్శించి, ప్రఖ్యాత విద్వాంసుల పొగడ్తను బొందినవారు.

ఈ 'జనకరాగకృతి మంజరి' యందు అధిక సంఖ్య కీర్తనలు సంస్కృత భాషలో రచింప బడినవి. పాటకు నందము నిచ్చునట్టి అంత్యానుప్రాసము సంస్కృత భాషచేతనే సాధ్యమని గీత గోవింద కృష్ణలీలా తరంగిణులలో సువ్యక్తము. కావున, మురళీకృష్ణగారు సంస్కృతముననే కృతులు రచించుట కిదియు నొక కారణమని యూహింపవలసి యున్నది. ఇందు 72 వ మేళకర్తయగు జ్యోతి స్వరూపిణీ రాగ కీర్తన గాయత్రి పరముగా నున్నది. 29 వ మేళ కర్తయగు ధీర శంకరాభరణ కీర్తన సుబ్రహ్మణ్యస్తుతిగా నున్నది. ఈ కృతులు ముత్తుస్వామి దీక్షితుల రచనల కేమాత్రము తీసిపోవు. ఇట్టి కీర్తన లీగ్రంథమున ననేకము లున్నను మచ్చునకొకటి రెండు మాత్రమే సూచించితిమి. ప్రతి కృతియందు పల్లవి అనుపల్లవి చరణము అను మూడు భాగములున్నవి. త్యాగ రాజాదుల కృతులలో చరణము లనేకము లుండును. కాని గాయకులన్ని చరణములను పాడక కృతికర్తృ నామముగల కడపటి చరణమునే పాడుట సంప్రదాయము గాన, ఈ గ్రంథ కర్తయు కీర్తనల కొక్కొక్క చరణమునే రచించిరని యూహింపవలసి యున్నది. ముత్తుస్వామి దీక్షితులు ఏకామ్రేశ్వరుని స్తుతించుచు "చింతయ మాకంద మూలకందమ్

చేత; శ్రీ సోమస్కంధమ్" అను కీర్తనలో శబ్దాలంకార తత్పరతతో ప్రౌఢార్థముగల సమాసములను వాడినట్లే ఈ గ్రంథకర్తగారుకూడా 'భుజగసహితనీలకంఠ' మొదలగు నర్థప్రౌఢిగల సమాసముల వాడినారు. ఆంజనేయుని 'సువర్చలాపతి' యనుటచే వీరికిఁగల గ్రంథ పరిచయాతిశయము వెల్లడి యగుచున్నది. ఇందు కర్ణాటక సంగీతమున రాగములకు మూలములైన 72 మేళకర్తలలోను మేళకర్తకొకటి వంతున 72 కృతులు కలవు. అవేగాక, రెండు గీతములు, రెండు తాన వర్ణములు గ్రంథారంభమున గలవు. మధ్యమావతీరాగ కీర్తనతో గ్రంథము పూర్ణమైనది.

గీతములలో రెండవది వరాళీరాగమునఁగలదు. ఇందు స్వర సాహిత్యములకు కుదిరిక చక్కఁగానున్నది. రాగభావములు వరాళీరాగ విశిష్టతను సువ్యక్తపఱచుచు హృదయాంగములై యున్నవి. తోడి రాగతాన వర్ణమున రాగభావము లన్నియు ప్రసిద్ధములును, మధురమైనవియుగా నున్నవి. తోడి రాగము 8 వ మేళమగు హనుమతోడియందుఁ జనించినది. ఇందు పంచమము వర్జ్యము. కాన సరిగమధనిస— సనిధమగరిస—యను ఆరోహ అవరోహణములు గలదిగా నున్నది. కాని, త్యాగరాజాదుల కృతులలోను, తానవర్ణముల యందును పంచమమును పలుకుట పరిపాటి. శ్రీ మురళీకృష్ణులు, ప్రసిద్ధమైన శాస్త్ర పద్ధతినే యనుసరించి, పంచమ రహితముగానే వర్ణము నుద్ధరించినారు. విద్యార్థులీ వర్ణము నభ్యసించినచో, తోడిరాగ భావములన్నియు హృదయస్థము చేసికొన్న వారగుదురు. మధ్యమావతికి 'సురాగము' అను నామాంతరము గలదు. గాయకులు కచ్చేరిని మధ్యమావతీ రాగమున నారంభించుట పూర్వుల పద్ధతి. ప్రకృతమున గానసభ పూర్తిచేయు సమయమున గాయకులీ రాగమాలాపించు చున్నారు. ఈ సత్పద్ధతిని మన గ్రంథకర్తగారు ననుసరించుట మెచ్చదగినది. 72 జనక రాగములందలి కృతులు స్వరయుక్తగా నభ్యసించి, సంగీత విద్యార్థిలోకము ధన్యత గాంచగలదని యాశింతుము.

జనక రాగములలో నొక్కొక్కదాని లక్షణమును వివరించుచు (నోట్సు వ్రాసి) ఆయా రాగముల పాఠకులకు పరిచయముచేయుట గ్రంథకర్తగారు పునర్ముద్రణమున మరువకుందురని కోరిక. గీతములు, తాన వర్ణములు, కీర్తనలు మొదలగువానిలో రాగభావములను చేర్వలుగాఁ జూపుచు (పాసని— ధనిపా— నిరిసని— ధమధని— ఇట్లు) స్వర సాహిత్యములకు పొత్తు కల్గించిన విద్యార్థులకు కీర్తన సుబోధమగును. విశేషించి తాన వర్ణములందీపద్ధతి యభిలషణీయము. కీర్తనలకు తాళాంగములగు లఘు ద్రుతములను ప్రత్యేక ప్రత్యేకముగ నిరూపించుటచే నేర్చుకొనుట సులభము. ముక్తాయి స్వరములకును, వర్ణములందలి చిట్ట స్వరములకు సాహిత్యములను రచించినచో బాగుండును.

ఉత్తమ రచయితలును, సద్విమర్శకులును విరివిగాఁ గావలసియున్న యీ కాలమున శ్రీ బాల మురళీకృష్ణవంటి సంగీత విద్వాంసులు గ్రంథ రచనము చేసి, వానిపైని సద్విమర్శన నాకాంక్షించుటచే, విద్యకు మహోపకారము జరుగుచున్నది. శతావధానులు, మహోపాధ్యాయులు నగు మధ్వ శ్రీ కాశీ కృష్ణాచార్యులును, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారును ఈ జనకరాగ కృతిమంజరికి తొలిపలుకును, పీఠికను వ్రాసిరి. ఇంకను విద్వాంసులు పలువురు ఈ గ్రంథ ప్రాశస్త్యమును వివరించుచు నభిప్రాయము లిచ్చినారు. శ్రీ మురళీకృష్ణగారికృషి అభినందనీయము. పాండిత్యము స్తవనీయము. ఇట్లే వీరు సంగీత సత్సాంప్రదాయము పోషించుచు, జన్యరాగములకు సంబంధించి గ్రంథమునుగూడ రచించి, గాయక లోకమునకు మహోపకారము చేయఁగోరుచున్నాము. వీరికి ఆయురారోగ్యములనిచ్చి, విద్యాప్రచారమునకుఁ దోడ్పడఁ బరమేశ్వరుని ప్రార్థించుచున్నాము. "—శ్రీ"

## గాంధీజీపై మీకు ప్రేమ ఉన్నదా?

ప్రేమ యున్నచో, జ్ఞాపకార్థము ప్రతి దినము ఆయన ప్రార్థన కాలమైన 5 గంటలకు, 5 నిమిషములపాటు, అన్ని పనులు చాలించి గాంధీజీని జ్ఞాపకము చేసుకొందురా?



# నిర్భాగ్య జీవులు



గ్రంథకర్త — విక్టర్ హ్యూగో.

(అనువాదకులు: శ్రీ వి. ఉమామహేశ్వరులు, బి.ఏ., బి.ఎల్.,)

ప్రథమ ఖండము — ఫాంటైన్ తృతీయాధ్యాయము.

ఫాంటైన్ వంటి వ్యక్తులు ప్రజాహృదయము నుండి యుద్భవించినవారు. సంఘము కల్పించిన ఆగాధాంధకారమునం దామె జననము. అజ్ఞాతత్వము, అనామధేయత్వమును ఆమె ఫాలమున అచ్చు వేయబడినవి. ఎవరామె పితురులు? ఎవరికి తెలియును? తల్లిదండ్రుల నామె యెఱుఁగనే యెఱుఁగదు. పేరు ఫాంటైన్. ఏల? ఇంకొక పేర పిలువబడకుండుటయే కారణము. ఆమె జననకాలమున, డైరక్టరీ ప్రభుత్వమే యుండినది. ఇల్లే లేదు కాబట్టి యింటిపేరు లేదు. రస్తాప్రక్కన వట్టికాళ్ళు జాడించుచు పడియున్న, పరోక్షజనిత శిశువును ప్రథమమున జూచినవాడెవడో 'ఫాంటైన్' అని పిలువ అదియే స్థిరపడినది. గురుప్రోక్తనామము లేదు—చర్చియుండినగదా? మేఘములు వర్షించినపుడు నీళ్ళువచ్చినట్లామె పేరు వచ్చినది. చిన్ని ఫాంటైన్! ఇంతకంటె ఏమియు తెలియదు. ఈ మానవతి ప్రపంచము ప్రవేశించిన విధానమిది. పదేండ్లప్రాయమున పారిస్ నగరము విడచి పరిసర కర్షకులకు కూలి చేయబోయినది. పదునైదేండ్ల ప్రాయమున "అదృష్టమును వెదకికొని" మరల పారిసుకు వచ్చెను. ఫాంటైన్ రూపసి. సాధ్యమైనంత కాలము కన్యాత్వము నిలిపికొన్నది. ముత్యములకు దీటైన పలువరుస, బంగారు వెంట్రుకలు—ఇవి యామె యర్పించిన కట్నము.

ప్రాణము నిల్పుకొనుటకు కూలి చేసెడిది. ప్రాణములు నిల్పుకొనుటకే ప్రేమించినది. హృదయమునకును ఆకలి కలదుకదా?

ఆమె తోలొమేసు ప్రేమించెను.

తోలొమే ముప్పదేండ్లుకడచిన విద్యార్థి. భోగము దప్ప దేనిచే కానీ అతడు గౌరవించినవాడు కాడు. ధనవంతుడు—సాలుకు నాలుగువేల ఫ్రాంకుల ఆదాయము. వృకోదరుడు కానీ, ముప్పదేండ్ల వయస్సుకే ముడుతలు, బట్టతల, ఊగుదంతములు, తెచ్చుకున్నాడు. ఏవిధముచేతనైన అనుభవించిన యతిభోగములఫలము! కన్నుల కాంతి తరుగుచున్నది. శక్తియుడుగుకొలదిని, లాలసత్వము పెరుగసాగినది. అమాయిక హృదయములను లోగొనుటలో నక్క. ఇట్టివాని వంచనకు లొంగిపోయి ఫాంటైన్ గాఢముగ ప్రేమించినది.

అతనికది వేయిన్నొకటవ కామకేళి—ఆమెకది ప్రథమ ప్రణయము. త్రికరణశుద్ధము. ఎన్నో నాళ్ళు మరికానినుండి తప్పించుకొని తిరిగినది. కానీ, ఆ తప్పించుకొనువిధానములోనే మరల కలుసుకొను మార్గమున్నది. తొలగిపోవుట వెదకుటకుగా మారుట కలదు. వేయేల? అమాయిక హరిణము వేటకాని యురిలో తగుల్కొన్నది.

ఇప్పటికి తోలొమె చదువుముగిసి సెలవులు వచ్చెను. కడపటి కొన్ని దినములను వీలైనంత మాధుర్యమును గ్రోలి పోవుదమని సందేహించు వ్యాఖాపమేలేని ఫాంటైన్ను తోడుకొని సెంట్ క్లౌడ్ అను సముద్రతీర ప్రదేశమునకు వెళ్ళి ఒకవారము రోజులు నౌకావిహారములు. ఉద్యానవిహారము జలక్రీడలు కామకోపాలు ప్రేరేపించిన సకల సుఖములనుభవించి ఉన్నట్టుండి యదృశ్యుడయ్యెను. పోయినివాడూరకపోక, ఈక్రింది శ్రీముఖ మంపిపోయెను.

"ప్రియురాలా!"

నీకు తెలియదు కాని, నాకు తలిదండ్రులున్నారు. తల్లిదండ్రులనగా నీ కెట్లర్థమగును? ఆ పితరులు నాకొఱకేడ్చుచుందురు. దుర్వ్యయము చేయువాడని చింతింతురు. నాకొఱకై కోళ్ళను బలుపెక్కించి చూపెట్టుకొనియుందురు. నీ వీ యుత్తరము చదువునప్పటికి వాయువేగమున ఉత్తమాశ్వమునన్ను, నిమిష నిమిషమునకును నా తలిదండ్రుల సమీపమునకు గొనిపోవుచుండును. నుడిగుండమునుండి యుత్తమాశ్వము నన్ను తప్పించును. ఆ నుడిగుండము

నా ప్రియురాలవు నీవే! ఇంక సంఘము, డ్యూటీ, నియమము—వీనిని మన్నింపవలెను. నేను ఈ నగరాధికారిగ, కుటుంబీకుడుగ, కాన్పలుడుగ కావలసిన యవసరము దేశమున కెంతేని గలదు. నన్ను గౌరవింపుము. నేను త్యాగధనుడను. నిన్నే త్యజించుచున్నాను. నీకేమి? ఇంకొకనిని చేపట్టుదువు. ఈ యుత్తరము చింపివేయుము. రెండేండ్లు మనము సుఖముగా నుంటిమి. ఇకమీద సుఖీభవ.

తొలాశె.

ఈ జాబుచదివి ఫాంటైన్ వెక్కి వెక్కి యేడ్చినది. ఇది యామె ప్రథమ ప్రణయ మంటిమి కదా. స్వల్పాలోచనలు లేక, అతనిని భర్తగా గణించినది. అతని హృదయమును, సాహచర్యము తప్ప, ఇతరమేమియు కాంక్షించినది కాదు. ఈ పరాయిచోట చేత పైసా లేక, ఒడిలో చిన్నియాడు నిసుగుతో చిక్కినది.

---

# అరగలురాణి.

( శ్రీ భూతపురి నారాయణస్వామిగారు. )

[ గత సంచిక తర్వాత. ]

రాజవదన దుర్గావతీ రాణిగారి
ధీర గంభీర భయద వాగ్ధార వినఁగఁ
దోఁకఁ ద్రొక్కిన పాముగాఁ దురకఱేఁడు
మండిపడి నిజయోధుల మందలించి 40

"అవమతి మీరు తగ్గి వెనుకంజను వేయుచునుండ, మానినీ
నివహము మధ్య నొక్క సతి నిల్చి వినం గొఱగాని వాక్యముల్
దవిలి వచించుచుండ నెటు దాళఁగవచ్చును; సిగ్గుచేటు; రెం
డువిదను బట్టి కట్టుఁడన, నొక్కటి వారలు హుంకరించినన్ 41

అరగలురాణి ధీరమతియై కరవాలముఁ గేలఁబట్టి యా
తురకల మూక పై కురికి దోర్బలమొప్ప నదల్చుచుండఁగాఁ
బరచుచు నంతలోనఁ గరవాలములం ధరియించి మొగలుల్
తిరిపడ హిందువీరు లరుదెంచిరి తోడ్పడ రాణిగారికిన్. 42

వారలు క్షత్రియాన్వయులు, అవారణ తేజులు, బాహువిక్రమో
దారులు, శత్రుభీకరు, లుదాత్తమనస్కు, లుదగ్ర మోహనా
కారులు, ధీసంచితులు, కాతర రక్షక లిద్ధకీర్తి వి
స్ఫారులు, వార్యవత్సలులు, సాహసధుర్యులు వీరసోదరుల్ 43

అభయ చందు, నిర్భయ చందులనఁగఁబరగు
నన్నదమ్ములు స్వామ్యార్థమరుగుచుండి
వైరి మధ్యగతను రాణిగారిఁజూచి
సింహరవములతో మ్లేచ్ఛ సేనఁజొచ్చి 44

జిత్తులమారి శాత్రవుల, స్త్రీలఁ జేరవఁ జేరనీక, చె
న్నొత్తుచు వారికత్తు లిల నూడిపడం బడఁగొట్టుచుం, గృపా
యత్తులు చండ సోదరులు సర్గలురాణికి నెందు పెట్టి యా
పత్తిని మూడనీయక యుపాంతము నందున నిల్చి పోరుచున్ 45

కత్తుల తళ్తళల్ పెరసి కన్నులకున్ మిఱుమిట్లుగొల్పఁగా
ఎత్తిన కత్తులం దివియ కిర్వురు చండులు సాహసాంకులై
మొత్తిరి దుత్తులం బగులమోదిన తీరున వైరి శీర్షముల్
తత్తఱ పాటుఁజెంది పిఱుదం జన సాగి రరాతి సైనికుల్ 46

కొట్టిన కత్తి వ్రేటులకుఁ గ్రూరతురుష్కుల పోడిమిత్తులం
బెట్టుగ గాయము ల్దగిలి వ్రీలి పడంపడి యేకధారలై
కొట్టము చూరులం దిగువకున్ స్రవియించెడు వాననీరుగా
నుట్టిపడంగ గడ్డముల నుండియుఁ గాఱఁగఁ జొచ్చె నెత్తురుల్ 47

పిడుగులఁ బోలు వ్రేటులను వేయుచు నార్చుచు రాజపుత్రు శే
ఖరుడలను దానెరయై మెలఁగి రొచ్చటికేగిన వెంటనంటుచున్
బెదురున నొంపఁగా బెదరు రోచి యయోధ్యనవాబు గుండియల్
దడదడ కొట్టుకోఁ దొడగ దాడికి జాగడి వాడిలేమినిన్. 48

చేరఁగ వచ్చువారిఁ దనచేతికటారునఁ బాఱఁద్రోలుచుం
బాఱనివారిఁ ద్రుంచుచుఁ గృపామతి చండులఁ బ్రోత్సహించుచున్
ఘోరరణంబున న్వికచ కోమల తామరసాయతాక్షి యా
వైరుల గుండియ ల్పగుల వార, విహార మొనర్చె ధీరయై 49

దూరమునుండి తైర్థికులు, తొయ్యలు లొక్కటఁ గూడి గుంపుగా
వైరుల మీదికి న్విసరి వైచుచు నుండిరి రాళ్లు రప్పలున్,
దూరి దోయిలించి మతే దుమ్మును జల్లి యథోచితంబుగాఁ
గ్రూర తురుష్క సైనికులకున్ మనముల్ వికలంబులై చెడెన్. 50

ముందుకుసాగి సోదరులు పోరుచునుండఁ దురుష్కుఁ డొక్కఁడా
పందున వెన్కవైపుఁ జని చంపెను నిర్భయు చండు; నింక నా
చండడి కయ్యమున్ దళియ చంద్రోకరుం దసహాయ శూరుఁడై
చిందర వందరై రిపులు చెంగగ వెంపరలాడె నయ్యెడన్. 51

కుందని వాఁడు ప్రాణములకున్ వెఱపందనివాఁడు, గాయముల్
పొందనివాడు, మోమునను బోడిమి మాయనివాఁడు, వీకతో
ముందుకు జొచ్చువాఁడు, రణమున్ జరుపం దలపోయువాఁడహో!
మందుకునైనఁ గన్పడఁడు మూని యొక్కండు తురుష్కసేనలో 52



# గ్రామాభ్యుదయము — మంటపంపల్లి.

శ్రీ పి. వెంకటసుబ్బయ్యగారు, యం. యల్. ఏ.,

భారతదేశము 7 లక్షల గ్రామములతో కూడినది. గ్రామీణ ప్రజలు కర్షకులు. కర్షకులభివృద్ధి చెందనిదే గ్రామములు, పట్టణములు, ఆతరువాత దేశము బాగుపడనేరవు. అందుకనే అధునాతన కాలములో పరిపాలించుచున్న ప్రభుత్వములు గ్రామాభ్యుదయ శాఖలను, స్త్రీ జనాభ్యుదయశాఖలను, హరిజనాభ్యుదయ శాఖలను స్థాపించి, కృషి చేయుచున్నవి. క్రొంగ్రొత్తగా కమ్యూనిటీ ప్రాజెక్టు లనునవి కూడా స్థాపింప బడినవి. ఇవన్నియూ గ్రామములను పూర్వసౌభాగ్యమునకు తెచ్చుప్రయత్నములే.

గ్రామాభ్యుదయము ముఖ్యముగా ఈ క్రింది కార్యక్రమములపై ఆధారపడియున్నది.

1. వ్యవసాయమును నూతన మార్గములతో కొనసాగించుట
2. గ్రామీణప్రజలు ఆరోగ్యవంతులై యుండుటకు ఆసుపత్రులు, శిశుసంరక్షణశాలలు, ప్రసూతిగృహములు స్థాపించుట
3. పాఠశాలలు వయోజన విద్యా కేంద్రములు స్థాపించుట.
4. గృహ పరిశ్రమలు నెలకొల్పుట
5. సహకార వస్తు విక్రయ సంస్థలు (స్టోర్సు) స్థాపించుట

ఈ కార్యక్రమము లన్నియూ ప్రజాసహకారములేనిదే కొనసాగవనుట తథ్యము. మీదుమిక్కిలి ప్రభుత్వమైనను ఖర్చును భరించి నిర్వర్తింప గలదనుట సంశయాస్పదము. అట్లగుటచే ధనవంతులగువారు సహకరింపలదే పురోగమించుట కష్టసాధ్యము. కమ్యూనిటీ ప్రాజెక్టు లనబడునవి ప్రస్తుతము మనదేశములో 55 ప్రదేశములందు ప్రారంభింపబడినవి. ఇవి ముఖ్యముగా గ్రామసౌభాగ్యమును చేకూర్చుట కేర్పడిన వనుట నిర్వివాదాంశము. అట్లగుచో సర్వవ్యవహారములను ప్రభుత్వమే నిర్వహింపనున్నదా లేక, ప్రజకేమైనా ఇందు పాలున్నదా యను ప్రశ్నలు తలనూపుచున్నవి. ఈ ప్రణాళిక క్రింద ఏ కార్యమైనను ప్రజల సంపూర్ణ సహకారము లేనిదే నెగ్గజాలదు. పైగా ప్రజలు ధనవ్యయముకూడా చేయవలసియున్నది. ఈపద్ధతి అమెరికా దేశమునుండి దిగుమతి చేయబడినదని వినబడుచున్నది. ఇట్టి కార్యక్రమములను అమలుపరచుపద్ధతి మనదేశములో నిదివరకులేదా? ఉన్నది. ఉండినది.

ఉన్నదనుటకు తార్కాణముగా కడపజిల్లా సిద్ధవటము తాలూకా యందలి మంటపంపల్లె గ్రామము నుదహరింతము.

ఈ గ్రామప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము. భూములు ముఖ్యముగా వర్షాధారమున సాగుచేయబడుచున్నను ముఖ్యముగా బావులవలన సాగుచేయుట కలదు. గ్రామీణప్రజలు శాంతియుతముగా జీవితము సాగించువారు. గ్రామమునకు సమీపమున నాలుగు దిశలయందు పర్వత శ్రేణులు కలవు. గ్రామ పరిసరములు, పచ్చనిచెట్లు పూవ్వుల పొదరిండ్లు కలిగి కనుల పండువుగా నుండును. ఈ గ్రామమున కిరువది యొక్క మైళ్ళ దూరమున కడప పట్టణము కలదు. గ్రామము నానుకొని కడప—చెన్నపురి సివిల్ రోడ్డు, ఈ గ్రామము పేరుతో రైల్వేస్టేషను గలవు. ఈ రవాణా సౌకర్యములవలన గ్రామమునకువలయు సామగ్రిని దిగుమతి చేయుటకు, వుత్పత్తియగు వస్తువుల నెగుమతి చేయుటకును అనుకూలములుగలవు. ప్రజలు వకరి యందొకరు ప్రేమభాజనులై ఐకమత్యముతో మెలగుచుందురు. అట్టి వాతావరణము గ్రామాభ్యుదయ కార్యకలాపములయందత్యవసరము. ఇయ్యది పెంపొందించుటకు ఈ గ్రామమున సర్వోదయ సమాజము నాలుగేండ్ల క్రిందట స్థాపించిరి. ఈసంస్థ నెలకొల్పబడినదాది ప్రజలకు మహాత్మాగాంధిగారి ఆశయములను తెలియపరచుటకు వీలగు నాటకములను, సభలను జరుపబడుచున్నవి. గ్రంథాలయ మొకటి తెరువబడినది. ప్రజలాసక్తితో గ్రంథముల చదివి విషయముల గ్రహించి సర్వతో ముఖాభివృద్ధి గాంచుచూ ఉవ్విళ్ళూరుచున్నారు.

జీవకారుణ్య సమాజమొకటి ఇచ్చట స్థాపింపబడియున్నది. ఇయ్యది భారతీయ థియసాఫికల్ ఫెడరేషన్ కు కలుపబడియున్నది. ఆత్మీయ విజ్ఞానమును కలిగించుటకు అప్పుడప్పుడు ఉపన్యాస కూటములు ఏర్పాటు చేయబడుచుండును. దైవభక్తి కలిగిననే కాని మానవుడు పాపకార్య విముఖత్వమును సాధించి పుణ్యకార్యములపొంద జాలడు. మానవుని పురోభివృద్ధికి ఇయ్యది ముఖ్యసాధనమనుట గ్రహించి అట్టి వాతావరణమును పెంపొందించుటకు ప్రభుత్వము ముందుకు వచ్చినవాడే గ్రామాభ్యుదయము నిర్విఘ్నముగా కొనసాగగలదు.

ఈ గ్రామమున అట్టి భక్తిప్రపత్తులు ప్రజలు కలిగి యుండవలయునను ఆశతో శివాలయమొకటి పునరుద్ధరింపబడి, నిత్యపూజాదులు కాక ప్రతి శుక్రవారము పూజావిధానము నెలకొల్పబడి యున్నది. స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు ఆ దైవ శిబిరమును దర్శించి భగవంతునికి కానుక లిచ్చుచుందురు. అచ్చటిగ రామమందిర మొండుగలదు. అందు నిత్య భజనలు, ప్రతి శనివారము నగర సంకీర్తనములు జరుగుచున్నది.

ఇట్టి అనుకూల వాతావరణము కలిగినందున ప్రజలకుపయోగపడు పెక్కు సంస్థలు ఈ గ్రామమున నెలకొల్పుటకు వీలయినది. ఇప్పట్టున ఈ కార్యకలాపముల భారమును వహించుచూ, ధనవ్యయమును అవసరమైన పట్టుల గావించుచూ గ్రామీణ ప్రజల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుచున్న శ్రీ. ఘట్టంరెడ్డి రమణారెడ్డిగారిని ప్రస్తావించుట సమంజసము. వీరు బి. ఎ. పట్టభద్రులైనవారు. అహర్నిశములు ప్రజల మేలుకొరకు కార్యములు చేయుచుండువారు. వీరి ఆధ్వర్యమున ఈ క్రింది సంస్థలు క్రమాభివృద్ధిని గాంచుచున్నవి.

1. శిశుసంరక్షణశాల:- 1950 సం॥ నవంబరు మాసములో తెరువబడినది. గ్రామీణ ప్రజలు రు2500/-లు విరాళముల ప్రావిన్షియల్ వెల్ ఫేర్ ఫండుకు నొసగిరి. ప్రావిన్షియల్ వెల్ ఫేర్ ఫండు ఆధిపత్యమున నెలకొల్పబడినది. డిస్ట్రిక్టుబోర్డువారు ఈ మూలధనముతో పై శిశుసంరక్షణశాలను స్థాపించిరి. ఇచ్చట స్త్రీ జనాభ్యుదయ కేంద్రముకూడా పని చేయుచుండుట ముదావహము. గ్రామస్థులు ఉచితముగ ఈ సంస్థకు ఒక భవనము విరాళముగ నిచ్చిరి. నెలకు 60/-ల వేతనముతో తర్ఫీదు పొందిన ఒక మంత్రసానియును నెల 1 కి 30/-ల వేతనముతో ఒక ఆయాయున్ను ఈ శిశుసంరక్షణ శాలలో పని చేయుచున్నారు.

2. వైద్యాలయము:- ఈ గ్రామమునకు వైద్యాలయము సమీపమున లేదు. 5½ మైళ్లు పోయిననే గాని రోగికి ఔషధము లభింపదు. ఇట్టి పరిస్థితులతో గ్రామీణులు ముందుకువచ్చి ఉచితముగా వైద్యాలయముకొరకు ఒక భవనమునుయిచ్చిరి. 16-9-1948 నుండి గాంధి నేషనల్ మెమోరియల్ వైద్యాలయము పేరుతో ఒక వైద్యాలయము నడుపబడుచున్నది. దీనికి ప్రజల విరాళములే మూలధనము,

సహకార సంస్థలు:- ప్రజాసామ్యము ఒకవైపు, పెట్టుబడిదారుల పరిపాలన ఒకవైపు, రాజకీయ క్షేత్రల నుక్కిరి బిక్కిరి చేయుచున్నది. ఇవి యట్లుండ సామ్యవాదము (Communism) మతియొకవైపు తలనూచి అన్నిటికంటెను ఉత్తమమైనపద్ధతి అని అంకె వేయుచున్నది. ఏ పద్ధతియైనను ప్రజలు సర్వతోముఖముల ననుభవించుట కనువైనదిగా నుండవలయును. ప్రజాసామ్యము మంచిదేయైనను పెట్టుబడిదారులకు ప్రవేశమున్న కారణముచేత సామాన్య ప్రజలకు న్యాయము చేకూరుటలేదు. సామ్యముపై పైపూత మెఱుగులు గలిగి యున్నను అసలు మానవపురోగమునకు మూలకందమైన స్వాతంత్ర్యమును భగ్నమొనరించుచున్నది: దైవభక్తి ఇత్యాదులను త్రోసి రాజనుచున్నది. అట్టిపరిస్థితులలో సర్వమానవ సౌభ్రాతృత్వముతో సర్వాభ్యుదయమునకు అనువైనట్టిది సహకార సిద్ధాంతము, ఇయ్యది ప్రజాసామ్యపద్ధతిపై నడచినను, ధనికవర్గమునకందు ప్రవేశమున్నను, ఉమ్మడిఉత్పత్తి, ఉమ్మడి వ్యాపారసరళి యుండి, సంవత్సరాంతమున లభించు లాభమును అందరికి సమానముగా పంచిపెట్టబడుచున్నది. లాభము ధనికులన్న కారణముచేత ఎక్కువగాని పేదలన్న నెపముచేత తక్కువగాగాని పంచుటలేదు. వాటాధనముమేరకు పంచబడుచున్నది. కనుక ఈ పద్ధతి భారతదేశ సంస్కృతి, జాతీయత ఇత్యాదులకు అనువైనది. గ్రామీణ ప్రజలు ఈ సంస్థల మూలమున పురోభివృద్ధి గాంచగలరనుట సందేహములేదు.

ఈ గ్రామమున ఈ సంస్థలు యావదాంధ్ర దేశమంతటిలోను మెఱుగుగా నున్నవనే చెప్పవలసి యున్నది.

మంటపంపల్లె సహకార క్రయ విక్రయ సంఘము W 492.

ఈ సంఘము 23_6_1947 లో ప్రారంభింపబడి ఈ క్రింది విధముగ పురోగమించు చున్నది.

| సం॥ | సభ్యులు, | వాటాధనము | కొనుగోలు | విక్రయము | లాభము. |
|---|---|---|---|---|---|
| 47_48 | 64 | 3880 | 6869 | 6611 | +221. |
| 48_49 | 69 | 1600 | 41704 | 42900 | 1420. |
| 49_50 | 89 | 890 | 33865 | 37397 | 976. |
| 51_52 | 90 | 900 | 46667 | 44156 | — |

మంటపంపల్లె చేనేత సహకార సంఘము_W739

ఈ సంఘము 14_8_1950 లో స్థాపింపబడినది.

| సం॥ | సభ్యులు | వాటాధనము | వ్యాపారము ఉత్పత్తి | అమ్మకము | లాభము. |
|---|---|---|---|---|---|
| 50_51 | 48 | 1050 | 37088 | 4095 | 5257. |
| 51_52 | | | | | |

సకలార్థ సహకార సంఘము_W 691

ఈ సంఘము 31_3_50 లో ప్రారంభింపబడినది._

| సం॥ | సభ్యులు | వాటాధనము | అప్పులు ఇచ్చినది | లాభము_ |
|---|---|---|---|---|
| 49_50 | 84 | 1200 | 10800 | 62. |
| 50_51 | 41 | 2387 | 21400 | 731_5_0 |
| 51_52 | 163 | 2883 | 14850 | —— |
| 52_23 | 262 | 5148 | 24712_8_0 | —— |

Now Creeit activities 11,6637/— F. D. Rs 100,000—0—0

సహకార పశు సంరక్షణ సంఘము W 581

ఈ సంఘము 16_7_49 లో ప్రారంభింపడినది. ప్రభుత్వ విరాళముతో ఈ సంఘమునందు ఒక ఆబోతు కోడె పెట్టబడినది

పురోగమనము.

| సం॥ | సర్వీసులు | దూడలు |
|---|---|---|
| 49_50 | 36 | 31 |
| 50_51 | 40 | 25 |
| 51_52 | 42 | 30 |

కూలి పనివారల సహకార సంఘము

ఈ సంఘము 3_12_50 న ప్రారంభింప బడినది. 103 సభ్యులు. రు 2495_0.0 లు షేరుధనము చెల్లించి యున్నారు.

పురోగమనము

| సం॥ | ఫారెస్టుకూపులు | అమ్మినకలపటన్నులు | క్రయము | లాభపడినకూలివారు |
|---|---|---|---|---|
| 51.52 | 4 | 2695 | 60480 | 700 మందికూలీలు. |
| | | రిజర్వు ఫండు 5000_0_0 / లాభము 224.0_0 | | 800 మంది బండ్లవాండ్లు. |
| 52.53 | 4 | పని జరుగుచున్నది | ...... | ఆడిటుకాలేదు |

పై వివిధ సహకార సంస్థల ద్వారా గ్రామీణప్రజలు పురోగమించుచు స్థానిక పరిపాలనా సంస్థల ద్వారా అనేక సౌకర్యములను పొందుచూ విరాజిల్లుచున్నారు.

స్థానిక సంస్థ:—

ఈ గ్రామమున 1950 సం॥ ఏప్రిలు నెలలో పంచాయితీబోర్డు స్థాపింపబడినది. ఆదాయమునుబట్టి, పెద్ద పంచాయితీ బోర్డులలో లెక్కింప బడకపోయినను పరిపాలనా విషయమున 4 ముఖ్య గ్రామములున్న పెక్కు మజరాలతోనూ గూడియున్నది. ఈ బోర్డు స్థాపింపబడినది లాగాయతి గ్రామ ప్రజలకు కావలసిన సౌకర్యములను చేకూర్చుట యందు వెనుదీయక నిర్విరామ కృషిని చేయు చున్నది.

గ్రామమునగల వీధులలోని బాటలను ఎత్తుగనిర్మించి పెడో కాల్వలను త్రవ్వించి వాననీరు పోవుటకు వసతి చేసినది. ఆరోగ్యసూత్రముల ననుసరించి దిబ్బలు గ్రామమునకు వెలుపలవేసికొనుటకును గ్రామమునందు చెత్త చెదరు తీసివేయుటకును, వీధుల నూడ్చుటకు స్వవహాయమున పనిచేయువారిని నియమించినది. మజరాలకు, ముఖ్య గ్రామమునకు బాటలు నిర్మించినది. ఇదిగాక ప్రతి చిన్న గ్రామమునకు మట్టిరోడ్లు, వేయబడి యున్నవి.—

1. మంటపంపల్లె—మారయ్యగారిపల్లె 6 Furlongs estimated cost 2000—0—0
2. ,,, కోనరాజుపల్లె 2½ Miles [Ten thousands 10,000—0—0
3. ,,, పోలు బుచ్చయ్యగారిపల్లె 6 ఫర్లాంగులు 3000—0—0

పై రోడ్లు నిర్మాణమునకు ప్రభుత్వమువారు పూర్తి గ్రాంటు యిచ్చి యున్నారు. ఒక పుస్తక భాండాగారము కూడా స్థాపించినది. ఒక కమ్యూనిటీ సెంటరు నెలకొల్పబడినది. ఇళ్లు వాకిళ్లను శుభ్రముగా నుంచుకొనునట్లు చేయుటయే ఈ సెంటరు యొక్క ముఖ్యోద్దేశము

ఈ గ్రామమునకు చేరువనేగల హరిజన వాడను దర్శించిన ఈ పంచాయితీబోర్డు చేయుచున్న పని విశదము కాగలదు. నలుబది కుటుంబములకు మించని వాడ యైనను రెండు చేద బావులు ఆధునిక పద్ధతిలో నిర్మింపబడి యున్నవి. ఇండ్లు వీధులు శుభ్రముగా నుంచుకొనునట్లు తీవ్ర ప్రచారము చేయుటచేత హరిజనులు పౌర విజ్ఞానము గలవారై వీధులను ఇండ్లను, శుభ్రముగా నుంచుకొని యున్నారు. సుమారు 30 మంది వరకు బాల, బాలికలు చదువుచున్నారు. ఈ వాడ హరిజనులు శ్రీ పుట్టంరెడ్డి రమణారెడ్డి గారికే కృతజ్ఞులై వారి యౌదార్యమును కీర్తించు చున్నారు.

శ్రీ. రమణారెడ్డిగారి కార్యదక్షత, ఒకనాడు నేనా గ్రామమునకు పోయిన సందర్భమున విశదమైనది. హరిజన వాడలోని ఇండ్లన్నిటిని పరీక్షించి ఎవరియిల్లు పరిశుభ్రముగా నున్నదో, వారికే చీరలు బహూకృతి చేయునటుల పోటీపెట్టిరి. ఇట్టి ప్రక్రియల వలననేగదా ప్రజలు ఆరోగ్య సూత్రముల నవలంబించుటకు మార్గ మేర్పడుట. చదువుకొన్న పెద్దలు వారి యాదర్శము ననుసరింతురు గాక.

విద్యా సౌకర్యములు:—

ఈ గ్రామమున జిల్లాబోర్డు ప్రాథమిక పాఠశాల 1914 సం॥ నుండి పని చేయుచున్నది. నేడు నలుగురు ఉపాధ్యాయులు పని చేయు చున్నారు. ఉపాధ్యాయులు ప్రత్యేక శ్రద్ధతో బాల బాలికలకు విద్య గరపుచున్నారు. పాలు, మల్టి విటమిన్ టాబ్లెట్సు యిచ్చుట మధ్యాహ్నము భోజనము పెట్టుట కలదు.

బాలుర స్నానపానాదుల కుపకరించునట్లు పాఠశాల ఆవరణమునందే మంచినీళ్ళ బావి కలదు. ప్రతి ఉదయము బాలురకు నూనెరాచి తల దువ్వుటకు ఏర్పాటు చేయబడినది. మంగలి అప్పుడప్పుడు పాఠశాలకు వచ్చి పిల్లలకు వెంట్రుకలు కత్తిరించుటకు ఏర్పాట్లు చేయబడినవి. ఉచిత గ్రంథ పఠనాలయము పుస్తక భాండాగారము 2-9-1950న ప్రారంభింపబడి పని చేయుచున్నవి. ఆంధ్రపత్రిక అను దినపత్రిక రావింపబడుచున్నది. ఈ వ్యయమును పంచాయితీ బోర్డే భరించు చున్నది.

గ్రామస్థుల విరాళముల చేతనే ఈ గ్రామము నందు రేడియో 6-2-1951 తేదీన నెలకొల్పబడినది. దీనివలన ప్రజలు ప్రపంచ విజ్ఞానమును బడయుటయే గాక, సంగీతమున గలుగు హాయిని అనుభవించు చున్నారు. ఈ యంత్రమును సరి అయిన స్థితిలో వుంచుటకు పంచాయితీబోర్డు సంవత్సరమునకు రు 100/- లు భరించుచున్నది.

ఉమెన్స్ గిల్డు ఆఫ్ సర్వీసువారు ఈ గ్రామములో ఒక ఉపశాఖను 1951 సం॥ మార్చి నెలలో స్థాపించిరి. వీరి ఆధ్వర్యముక్రిందనే పాల కేంద్రము నడుపబడుచున్నది. పాఠశాల విద్యార్థులకు మధ్యాహ్న భోజనము నిచ్చుట మల్టి విటమిన్ మాత్రల నిచ్చుట వారికి ప్రతిదిన ప్రాతఃకాలమందు నూనె

రాచి తలలు దువ్వుట వగైరా పనులు మంత్రిసాని, ఆయా నిర్వర్తించు చున్నారు.

ఈ గ్రామమున పౌర విజ్ఞానము పెంపొందించుటకు విద్యార్థులు భారత్ సేవక్స్ గా నియమింపబడియున్నారు. పాఠశాల ఆవరణమును శుభ్రముగా పెట్టుకొనుట, గ్రామ వీధులను శుభ్రముగా నుంచుట వీరి విద్యుక్త ధర్మమైయున్నది. వీరికి ఉడుపులు టోపీలు సరఫరా చేయబడుచున్నది.

ఈవిధముగా గ్రామ సౌభాగ్యమును పెంపొందించుటకు శ్రీ పి. రమణారెడ్డి గారు నిర్విరామ కృషి చేయుచుండుట కొనియాడ దగినది.

గ్రామాభ్యుదయము గ్రామ ప్రజలు సహకరింపనిదే కల్ల. విద్యాధికుల శ్రద్ధా భక్తులతో అమాయకులగు గ్రామీణ ప్రజలకు తోడ్పడి గ్రామాభ్యుదయ కార్యక్రమమును పై మంటపంపల్లె పురోగమించినట్లు విజయవంతము కావింప వలయును.



## కడప డి॥ మునసబ్ కోర్టులో

Claim No. 632/50-51.
E. P. No. 457/52.

Secretary Co-Operative Town Bank, Cuddapah } Plaintiff

And

1. కొల్లకుంట అచ్చమ్మ 2 కొల్లకుంట నారాయణ 3 కొల్లకుంట సుబ్బన్న కడప టవున్. } ప్రతివాదులు

పై వ్యాజ్యములో డిక్రీ బాకీగాను ప్రతివాదులతాలూకు అయకపు ఆస్తిని కోర్టు యెదుట 17_2_1953 తేదీన పగలు 11 గంటలకు యేలము చేయబడును. వాటిదినము సవాలుదార్లు కోర్టుకు హాజరు అయి సవాలు చేయవచ్చును.

### షెడ్యూలు

కడప టవున్ 11 నెంబరు గాండ్ల వార్డుకు చేరిన బాదరుఖాన్ మశీదు వీధిలో వుండే డోర్ నెం॥ 408 రు గల ప్రతివాదుల తాలూకు ఇంటికి చెక్కుబంది. తూ॥ గూడూరు సుబ్బలక్ష్మమ్మ ఇల్లు ప॥ యిడమడకల పెద్ద సిద్దయ్య ఇల్లు. ద॥ పబ్లికు రస్తా, ఉ॥ పబ్లికు రోడ్డు, ఈ మధ్యవుండే ఉత్తర దక్షిణం 40½ మూరలు తూర్పు పడమర 9 మూరలు గల మిద్దె ఇల్లు, ఉత్తర దిశన పెంకుల వసారా, మిద్దె యింటికి తూర్పు, పడమర దిశలలో వుండే గోడలలో అర్ధము హక్కు ఇంటి అనుగుణాగా పై సామానులు తలుపులు ద్వారబంధనాలు వగైరాలు క్రియం రు 6000_0_0.

కడప 31_1_1953 } పి. నారాయణరెడ్డి, బి.ఎ.,బి.ఎల్., వాది అడ్వకేటు.

## కడప డి॥ మునసబు కోర్టులో

ఇ. పి. నెం. 434/52. యస్. సి. నెం, 120/51.

మాదదాసు రాఘవరెడ్డి —వాది
పోతిబోయిన నారయ్య —ప్రతివాది

పైనెంబరులో ప్రతివాదితాలూకా షెడ్యూలు దాఖలా ఆస్థి యీ కోర్టులో 5_3_1953 తేది పగలు 11 గంటలకు వచ్చిచక్కగా యేలం వేయబడును. సవాల్ దార్లు సవాల్ చేయవచ్చునని తెలుపడమైనది.

### షెడ్యూలు

కడప తాలూకా చిన్నమాచుపల్లెగ్రామం పొలములో. సర్కారుతరి డి. నెం. 39/1 0_45 తరం 1_9_0 క్రియం రు. 500_0_0

కడప. 29_1_1953. } పి. సుబ్బరావు, బి.ఎ., బి.ఎల్., వాదివక్కీలు.

## కడప డిస్ట్రిక్టు మునసబు కోర్టులో

అప్పలు నెం॥ 345/52.

సోంపెం నాగమ్మ —వాది

ఎదిరి

పి. యిమాంఖాన్ వగైరాలు —ప్రతివాదులు

ఈ నెంబరువాది తన భాగమును పంచి యివ్వవలసినట్లు కోరుచూ దావా దాఖలు చేసినది. సదరు దావా (3) సలికిరి చిన్నప్ప [9] పై. బసమ్మ [11] అబ్బవరం వెంకటరెడ్డి గార్ల ఆక్షేపణకు గాను 4_3_1953 తేదికి వేయబడినది. ఏమైనా ఆక్షేపణ ఉన్నయడల పై తేదీన హాజరై తెలుపుకోవలెను.

కడప. 6_2_1953. } ఆర్కాడు సత్యాజిరావు, బి.ఎ.,బి.యల్., వాది అడ్వకేటు.

కడప డి॥ మునసబు కోర్టులో

ఇ. పి. నెం॥ 624/1952. ఒ. యస్. నెం. 99/52.

కనుపర్తి దుగ్గిరెడ్డి, కడప తాలూకా మోడమీదిపల్లె. — వాది.

ఎదిరి

షేక కాసుమియ్యా భార్య హుసేన్‌బి కడప తాలూకా మోడమీదిపల్లె. —ప్రతివాది

పై వ్యాజ్యములో వాదికి ప్రతివాది యివ్వ వలసిన డిక్రి బాకీకిగాను ప్రతివాది తాలూకు షెడ్యూలుదాఖలా భూమిని ఈ కోర్టు యెదుట 17-2-1953 వ తేది పగలు 11 గంటలకు ఏలము వేయబడును. సవాలుదార్లు నాటిదినం కోర్టుకు హాజరు అయి సవాలు చేయ వచ్చును.

షెడ్యూలు

కడప తాలూకా పాతకడప గ్రామములోని ప్రతివాది తాలూకు భూములకు నెంబరువారి.

సర్కారునంజె డి నెం 683 యం 1-7 సెంట్లు.

శిస్తు, రు. 7-8-0.

క్రయం రు 1500-0-0

కడప. 31-1-1953 } పి. నారాయణరెడ్డి, బి.ఎ.,బి.ఎల్., వాది అడ్వకేటు.

---

కడప స్మాలుకాజు కోర్టులో

యస్. సి. నెం॥ 714/52.

మూగిసాదుగారి ఈశ్వరయ్య —వాది

ఎదిరి

తురక పక్కీర్‌సాబ్ భార్య కమాల్‌బి —ప్రతివాది

ప్రతివాది భర్త పక్కీర్ సాబ్ వాదిపేర వ్రాయించిన ప్రోనోటు బాపతు రు. 199-8-0 లకు దావా తేబడినది. సదరు దావా 28-2-1953 తేది ఈ కోర్టువారు వాయిదా వేశినారు. వాయిదాకు ప్రతివాది హాజరై తన ఆక్షేపణ వున్న యడల తెలుపుకో వలసినది. లేనియడల యక్సపార్టి చేయబడును.

కడప. 11-2-1953 } యన్. సుబ్బరామయ్య, బి.ఎ.,బి.ఎల్., వాది వకీలు.

---

కడప జిల్లా కోర్టులో

ఇ. పి. నెం॥ 59/52.

in,

ఓ. యస్. నెం॥ 3/51.

డాక్టరు జాన్ మోసెస్ —పిటీషనరు

ఎదిరి

పాల్ దేవరాజ్ —రెస్పాండెంటు

ఈ నెంబరు పిటీషనరు, రెస్పాండెంటు తాలూకు షెడ్యూలు దాఖలా స్థిరాస్థిని యేలమునకు కోరినందున కోర్టువారు యేలము నిమిత్తము 9-3-1953 తేదీకి వాయిదా వేశినారు. కాన, 9-3-1953 తేదీన ఉదయం 11 గంటలకు జరుగ బోవు బహిరంగమైన యేలములో సవాలుదార్లు వచ్చి సవాలు చేసుకొన వచ్చునని ఎల్లరకు ఆజ్ఞాపించడము అయినది.

షెడ్యూలు

కడప టవున్ అయ్యా స్వామి. పిళ్ళె వీధిలోని వార్డు నెం॥ 14 రు డోర్ నెం॥ 429 రు గల మిద్దె ఇంటికి చెక్కుబంది వివరము.

తూర్పు; పాల్ దేవరాజు భార్య యొక్క 14/430 రు గల ఇల్లు. పడమట: మహమ్మద్ రహిమతుల్లా ఇల్లు. ఉత్తరం; కనుపర్తి వెంకటసుబ్బయ్య ఇల్లు, సందురస్తా, దక్షిణం పబ్లికురోడ్డు ఈ దిశలకు లోనైన మిద్దె ఇల్లు.

కడప 11-2-1953 } కే. యల్. శ్రీనివాసరావు, బి.ఎ.,బి.ఎల్., పిటిషనరు అడ్వకేటు.

---

కడప స్మాలుకాజు కోర్టులో

యస్. సి. నెం॥ 10/53.

కోంకల పాపిరెడ్డి —వాది

ఎదిరి

బందిరెడ్డిగారి చిన్నపురెడ్డి —ప్రతివాది

వాది ప్రతివాదిపైన ప్రోనోటు బాబతు రు. 230-11-0 లకు దావా దాఖలు చేయబడినది. సదరు దావా 28-2-1953 తేది వాయిదా వున్నది, పై వాయదాకు ప్రతివాది పగలు 10 గంటలకు హాజరై తన ఆక్షేపణ తెలుపుకోవలెను. లేని యడల ప్రతివాదిని యక్సపార్టి చేయబడును.

కడప 11-2-1953 } యు. నరసరామయ్య, బి.ఎ.,బి.ఎల్., వాది వకీలు

## కడప అడిషనల్ మునసబు కోర్టులో.

ఇ. పి. 533/52 ఓ. యస్. 116/52

గంటసాల వెంకట సుబ్బయ్య —వాది

ఎదిరి

పేరు గంగన్న —ప్రతివాది

వాది ఈ నెంబరు ప్రతివాది తాలూకు స్థావరాస్థిని యీ క్రింద జప్తి చేయించి యేలమునకు తెచ్చియున్నాడు. సదరు ప్రతివాది తాలూకు క్రింద కనుపర్చిన షెడ్యూలు దాఖలా స్థావరాస్తి యీ కోర్టువారియెదుట 3-3-1953 తేది పగలు 11 గంటలకు వేలం వేయబడును. సవాలుదార్లువచ్చి సవాలు చేసుకొనవచ్చును.

షెడ్యూలు.

పులివెందుల తాలూకు అలవలపాడు గ్రామంలో ప్రతివాది తాలూకు స్థావరాస్తి వివరం.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | స. పు. | 45/1 | 1.40 | 4-3-0 | |
| | ,, | 45/2 | 1.45 | 4-6-0 | |
| 2. | ఇనాం పు. | 42/1 | 25.1 | 31-4-0 | వాకల యినాంపై 1.75 సెంట్లు |

ఇంకుకు చెక్కుబంది తూర్పు వొడ్డెపట్ల శాలవెంకటప్ప చేను, దక్షిణము వొడ్డె మల్లె వెంకటప్పచేను, పడమర రస్తా. ఉత్తరము. మాల మారిగాని భూమి.

3. స. పు. 85/1. 0-28 0-1-0 పూరా.
4. ,, 85/2. 0-85 0-7-0 ,,
5. ,, 87/2. 0-33 0-3-0 ,,
6. ,, 87/4. 0-7 0-1-0 ,,

సదరు గ్రామ సెత్తములో వుండు ప్రతివాది తాలూకా కొటంచి బిడువు జాగా.

7. తూర్పు గంగమ్మ జాతర స్థలం, సర్కారు బిడువుజాగా. దక్షిణం. గంటసాల వెంకటసుబ్బయ్య ఇల్లు. కుప్పాల పుల్లన్న ఇల్లు. పడమర, కంచర్ల శేషమ్మ ఇల్లు, రోమన్ క్యాతలిక్ స్కూలు. ఉత్తరం. రోమన్ క్యాతలిక్ స్కూలు, గజ్జల గంగిరెడ్డి వగైరాల ఇండ్లు. ఈ మధ్య వుండు బిడువు జాగాలో కొట్టములో వేపచెట్లు వగైరాలలో ½ భాగము.

కడప
11-2-1953.

యన్. సుబ్బరామయ్య,
బి.ఏ., బి.ఎల్.,
వాది వకీలు.

---

## కడప అడిషనల్ మునసపు కోర్టులో

ఇ. పి. నెం|| 643/52.

ఓ. యస్. నెం|| 199/51.

కాలవ తిమ్మారెడ్డి —వాది.

ఎదిరి

షేక్ పక్కీరుసాబు వగైరాలు —ప్రతివాదులు.

ఈ నెంబర్లులో 2వ ప్రతివాది తాలూకు షెడ్యూలు దాఖలా స్థావరాస్థిని యీ కోర్టువారు, 2-3-1953 న తేది పగలు 11 గంటలకు యీ కోర్టు, యెదుట యేలము వేయబడును. సవాలుదార్లు వచ్చి సవాలు చేయవచ్చును.

షెడ్యూలు

కడప తాలూకా ఉక్కాయపల్లె గ్రామము పొలములో

స. తరి 51 1-72 పైకి 0-86 సెంట్లు వాకిన.

కడప
10-2-1953

యన్. సుబ్బరామయ్య,
బి.ఎ., బి.ఎల్.,
వాది వకీలు.

# దాంపత్య జీవితము.

( శ్రీమతి క. బాలసరస్వతి దేవిగారు. )

అది శరత్కాలపు వెన్నెల రాత్రి. నిర్మల నీలాకాశములో చంద్రుడు ప్రకాశించుచూ చల్లని వెన్నెలను కురిపించు చున్నాడు. ప్రకృతి కాంతి శాంతి దేవత ఒడిలో నిద్రించు చున్నట్లుగా ప్రశాంతముగా ఉన్నది. రామకృష్ణారావు తన గదిలో కూర్చొని ఏదో వ్రాసుకొను చున్నాడు. ప్రక్కన నిర్మల కూర్చొని భర్తకు తమల పాకులు చిలకలుగా చుట్టి ఇచ్చు చున్నది. బయట నుండి కిటికీ గుండా వచ్చుచున్న చల్లనిగాలికి ఆమె నుదుటి పైని ముంగురులు రెప రెప లాడు చున్నవి. తెల్లని మల్లె పువ్వులవంటి చీర, లేత గులాబి రంగు పోళీ, నల్లని ముంగురుల నుండి క్రీలాడుచున్న పూదండ, ఆమె సహజ సౌందర్యానికి మరిన్ని వన్నె కల్పించు చున్నవి. "మీరు వ్రాయుచున్న దేమని" ఆమె అమాయకముగా అడిగినది.

రామ:- నాకు తోచే పలురకాల భావాలను వృధాగా వ్యర్థము చేయుటము ఇష్టములేక ఈ కాగితాలపైన భద్ర పరచు చున్నాను" అని నవ్వుతూ అన్నాడు. ఇంతలో ప్రక్కింటనుండి తియ్యని జోలపాట వినపడినది వారికి. తన బిడ్డను నిద్ర పుచ్చుటకు ఆ ఇంటి ఇల్లాలు పాడుచున్న జోలపాటది. ఆ పాటలు వినుచున్న కొలది నిర్మల హృదయములో ఏదో ఆవేదన కలుగ నారంభించినది. స్త్రీ, పతిత్వాన్ని కోరినట్లే మాతృత్వాన్ని కూడ కోరును. మొదటిదానికి ప్రకృతి ప్రోద్బల మెంత సహజమో, ఆ రెండవ దానికి కూడ అంతే. నిర్మలరామకృష్ణారావుల వివాహమైన తరువాత అయిదు వసంతాలు వెళ్ళి పోయినాయి. కానీ వారికి సంతానము కలుగ లేదు, ఆ విషయము జ్ఞప్తికి వచ్చినప్పుడంతా నిర్మల హృదయములో ఆవేదన కలుగు చుండును.

ఆమె వింటున్న జోలపాట ఆగి పోగానే ఆమె మనసును ఆక్రమించుకొని వున్న ఆలోచనలు కూడ ఆగి పోయినాయి.

నిర్మల:- ఆ రమాదేవికి పెండ్లి అయిన ఏడేళ్ళకు ఈ పాపాయి కలిగిందట."

రామ:- "అందుకే ఆ పాపాయిని అంత ప్రేమతో పెంచుకొను చున్నారు."

నిర్మల:- పోయిన వేసవిలో వారు చాల తీర్థయాత్రలు చేసి వచ్చినారు. అందువలననే ఈ సంతానము కలిగినదట. ఈ వేసవిలో మనము కూడ......

రామ:- నీవు చాల అమాయకు రాలవు నిర్మలా. తీర్థయాత్రలు చేయడానికి సంతానము కలుగడానికి సంబంధ మేమి?

ప్రకృతి రహస్యాలు పూర్తిగా తెలియని పురాతన కాలములో ఇటువంటి అర్థ రహితమైన మూఢ నమ్మకాలపై ప్రజలకు చాల నమ్మక ముండేది. కాని ప్రకృతిలోని అనేక రహస్యాలను కనుగొన్న నేటి ఆధునిక శాస్త్రజ్ఞులు ఇట్టి మూఢ సిద్ధాంతాలలో సత్యమేమీ లేదని ఋజువు చేస్తున్నారు.

నిర్మల.- మరి కొందరు దంపతులకు సంతానము కలుగుచున్నది. కొందరి దంపతులకు కలుగదు. దీనికి పూర్వజన్మ కర్మ కారణము కాకపోతే మరేమి?

రామ.- జీవితములో ఎదురయ్యే ప్రతి చిన్న విషయానికి కూడ పూర్వ జన్మ కర్మే కారణమని నమ్మే మన దేశీయుల మూఢ నమ్మకాలలోనే వారి అమాయకత్వము ప్రతిబింబించు చున్నది. ఆలోచనా జ్ఞానములేని జంతువులకు, పక్షులకు, క్షుద్ర క్రిమి కీటాదులకు కూడ సంతానాన్ని కలుగ జేసి ఆ యా జాతులను నిరంతరము అభివృద్ధి చేస్తున్న ప్రకృతి మానవులలో కొందరికి మాత్రమే సంతానాన్ని కలిగించి మరి కొందరికి సంతానాన్ని కలిగించక వుండ పక్షపాతము వహించు చున్నదనడము ఎంత అవివేకమో ఆలోచించు. సంతానాన్ని పొందడానికి పూర్వ జన్మ కర్మకు సంబంధ మేమి? సంతానాన్ని పొందడము, పొందలేక పోవడము ఆ యా దంపతుల శరీర స్థితి గతులను, వారి ఆరోగ్యాన్ని బట్టి వుంటుంది. ఆరోగ్యవంతులైన భార్యా భర్తలకు తప్పకుండ సంతానము కలుగుతుంది. కాని వారిరువురి శరీరాలలో ఏ ఒక్కరి శరీరములోనైనా అనారోగ్యము ఉన్నా లేక శరీరస్థితి క్రమముగా లేకున్నా,

సంతానము కలుగదు. అటువంటివారు సంతానాన్ని పొందగోరితే సరియైన డాక్టరు చికిత్స పొందడము వలన ఫలిత ముంటుంది. కానీ తీర్థ యాత్రలు చేయడమువలన వ్రతాలు, నోములు, గోదానాలు, భూదానాలు, చేయడము వలన వారికి సంతానము కలుగదు.

నిర్మల:- అయితే మన పురాణాలలోని విషయాలన్ని అసత్యాలా?

రామ:- మన పూర్వులైన ఆర్యులు అసత్యాలను ప్రచారము చేయ డానికి సాహసించే టంతటి మోసకారులు కారు. నిజమే! ఆ పురాణాలు వ్రాసినవారి కాలములో ఇట్టి మూఢ సిద్ధాంతాలపై ఆనాటి ప్రజలకు మంచి నమ్మకము ఉండి యుండవచ్చు. అందువలన వారు ఆ సిద్ధాంతాలే సత్యమైనవని ఊహించి యుండవచ్చు. పూర్వులు చెప్పిన సిద్ధాంతాలన్ని సత్యమైన వని నమ్మేటందుకు వీలులేదు. ఎందుకనగా వారి కాలములో సత్యమైనవని ఊహించిన సిద్ధాంతాలు మరికొంత కాలానికి అసత్యమైన వని బుజువు చేయ బడినాయి. ఉదాహరణమునకు పూర్వము సూర్యుడే భూమిచుట్టు తిరుగుచున్నాడని, భూమి బల్లపరుపుగా ఉన్నదని ఇంకా ఇట్టి ఎన్నో నమ్మకాలు ఆనాటి కాలపు ప్రజల కుండేవి. కాని తర్వాత చేసిన పరిశోధనల ఫలితముగా ఆ నమ్మకాలలో సత్యము లేదని బుజువయినది. అదేవిధముగా ఈ సంతాన విషయముకూడా. నిర్మల భర్తవైపు చూస్తూ, దీర్ఘముగా నిట్టూర్పు విడిచినది. పూర్వ జన్మమందు పాపము చేసికొన్న స్త్రీలే ఈ జన్మమందు గొడ్రాళ్లుగా వుంటారనే ఆమె నమ్మకము ఆనాటితో తొలగిపోయినది. అంతవర కామెను వేధిస్తున్న సమస్యకు సమాధానము దొరకడముతో ఆమె హృదయము తేలిక పడినది. ఆ సమయములో ఆమె ముఖములో ఆనంద రేఖలు స్పష్టముగా కన్పించినవి.

... ... ... ... ...

ఆనాడు శుక్రవారము. ఉదయమే నిర్మల నదీ స్నానము చేసి వచ్చేటందుకు సిద్ధ మగుచున్నది. అది గమనించిన రామకృపాళు మనస్సు చివుక్కుమనినది.

రామ:- ఎక్కడికి నిర్మలా?

నిర్మల:- నదికి. స్నానము చేసి వచ్చుటకు.

రామ:- ఇంటిలో స్నానము చేయ కూడదా?

నిర్మల:- పవిత్రమైన గంగా నదిలో స్నానము చేయడము వలన పవిత్రులమైతామని మన పెద్ద లన్నారు కదా?

రామ:- గంగానది స్నానము వలన మాత్రమే పవిత్రత కలుగదు.

నిర్మల:- మీరు పెద్దలు చెప్పిన ప్రతి విషయాన్ని విమర్శించు చుందురు.

రామ:- వారు చెప్పిన విషయాల్లో సత్యముంటే వాటిని అవలంబించ వలసినదే. వానిలో సత్యము లేదని తెలిసి కూడ వాటిని ఆచరించడము ఆత్మవంచన అగును. లేదా! చాదస్తమనిపించు కొనును. గంగానదిలో స్నానము చేసినంత మాత్రమువలననే పవిత్రత కలగడము సత్యమయితే ఆ నదిలో నిరంతరము కాపుర ముంటున్న జల చరాలు ముక్తి మంటపానికి మొదట చేరుకుంటాయి.

నిర్మల:- మరి అనాది కాలమునుండి ప్రజలకు గల ఈ నమ్మకము?

రామ:- అర్థము లేనిది. అనేక ఓషధులకు పుట్టినిల్లయిన హిమాలయములో పుట్టి ప్రవహిస్తున్న గంగానదిలో స్నానము చేయడము వలన శరీరానికి మంచి ఆరోగ్యము కలుగుతుంది. శరీరములో అనారోగ్యమేమీ కలుగకుండ గంగానది జలాలు రక్షించ గలవు. ఆ నదీ జలాల ఉపయోగమంతవరకే. హృదయ పవిత్రత పొందుటకు గంగానది స్నానా లేమీ ఉపకరించవు. నిర్మలమైన జీవితాన్ని గడపడము వలన హృదయ పవిత్రత కలుగును.

ఆ సాయంత్రము రామకృపాళు ఆఫీసు నుండి ఇంటికి వచ్చినాడు. అప్పుడప్పుడే సంధ్య చీకటులు నలుదెసల అలము కొనుచున్నవి. పౌర్ణమి కావడము వలన పూర్ణ చంద్రుడు తూర్పు కొండపై కనుపించు చున్నాడు. నిర్మల పూజా మందిరములో ప్రార్థన చేయుచుండినది. రామకృపాళు కూడ ప్రార్థన చేయుటకు అక్కడికి వెళ్ళినాడు. ప్రార్థనా నంతరము భర్తను చూచిన నిర్మల.

ఎంతసేపయినది మీరిక్కడకు వచ్చి?

రామ:- ఇప్పుడే భగవానునికి నీవు లంచాలిచ్చెదనని మొక్కు కొంటున్నప్పుడు.

నిర్మల:- ఏమీ, లంచాలా? ప్రార్థన సమయములో కూడా పరిహాసాలేనా?

లంచాలు కాక మరేమి నిర్మలా భోగ లాలస జీవితము గడుపుటకు శరీర సౌఖ్యాలకు అనుభవించుటకు

ఐశ్వర్యాలను ప్రసాదించమని భగవానుని ప్రార్థించడము, కోరిన కోర్కెల నన్నిటిని ప్రసాదిస్తె ఆయనకు ఉత్సవాలు, ఊరేగింపులు, చేస్తానని వాగ్దానము చేయడము లంచము కాక మరేమి? ఇంతటి స్వార్థము తోను అమాయకత్వము తోను కూడిన ప్రార్థనల వలన ప్రయోజన మేమున్నది.

నిర్మల:– చాలమంది ఈ విధము గానే ప్రార్థించు చుందురే? మరి ఈ దేవాలయములు, గోపురాలు, ధ్వజస్తంభాలు కట్టించమను ఇందువలననే కదా?

రాము:– అది వారి స్వార్థాన్ని, ప్రాపంచిక సౌఖ్యాలపైగల మమకారాన్ని అజ్ఞానాన్ని తెలుపును. మనము భగవానుని బిడ్డలము. బిడ్డలకు అవసరమైన సౌకర్యాలను కలుగ చేయడము వారికి తగిన రక్షణ నివ్వడము తండ్రి కర్తవ్యమని భగవానునికి తెలియదా? అందుకొఱకేగదా, ఆయన తన బిడ్డల సౌకర్యము కొరకు, వారి ఆనందము కొరకు, ఈ అందమైన ప్రకృతి సంపదను సృష్టించినది. ఆనందముగా జీవించుటకు అవసరమైనవన్నీ భగవానుడు మన కొరకు ఇదివరకే సృష్టించుచాడు. ఆయన మన కొరకు ప్రసాదించిన ఈ ప్రకృతి సంపద విలువను, ఆయన మనకు కలుగజేయుచున్న రక్షణను మనము గుర్తించకుండ, తిరిగి ఆయనను ఏవో స్వార్థమైన కోరికలు కోరడములో అర్థ మేమున్నది.

ఇట్టి కోరికలు కోరడముతోనే ఆగక, ఆ కోటన హిరణ్యాక్ష వరాలన్ని ప్రసాదిస్తె ఆయనకు దేవాలయాలు నిర్మిస్తామని ఉత్సవాలు చేయిస్తామని వాగ్దానాలు చెయ్యడము అజ్ఞానము కాదా? మరి కొందరు మూర్ఖులు ఎన్నో అవినీతి కార్యాలను చేసి, తర్వాత వాని నన్నిటిని క్షమించమని భగవానుని కోరి ఆయన పేరట దేవాలయములు నిర్మించు చున్నారు. వీరి దృష్టిలో భగవాను డనిన తిరివలెనే స్వార్థపరుడైన లంచగొండి. వీరు నిర్మించే దేవాలయాలకు, వీరు కట్టించే ధ్వజస్తంభాలకు మురిసిపోయి భగవానుడు వీరి పాపాలన్నిటిని క్షమించి స్వర్గానికి పోవడానికి పర్మిట్ ఇస్తాడని వీరి భ్రమ. మానవుని దృష్టిలో ఈ దేవాలయాలు, ఉత్సవాలు, ఎందరైన వానికి విలువ వుండును కానీ భగవానుని దృష్టిలో వీని కేమి విలువ ఉండును? ఈ ప్రపంచాని కంతా రాజరాజేశ్వరుడైన భగవానునికి ఆయన మన కొరకు సృష్టించిన ఈ సంపదనుండే తిరిగి ఆయనకేమో ఇచ్చెద మనడము అర్థరహిత ప్రలాపము కాదా?

మనలను సృష్టించి మన ఆనందము కొఱకు అందమైన ప్రకృతికూడా నిర్మించిన ఆ ప్రేమమూర్తికి ఆయన చూపుచున్న కరుణకు కృతజ్ఞతలు వెల్లడించుచూ నిర్మలమైన జీవితాన్ని అనగా భగవానుని తండ్రిగా భావించుచూ మనము ఆయన సంతతిలో జీవిని ఎవ్వరిని ద్వేషింపక దేనికిని ఎవ్వరికిని హాని కలిగింపక, ఆచరణలోను, తలపులలోనుకూడ, నిర్మలమైన జీవితాన్ని గడపడము వలననే భగవానునికు మనము చేసే ప్రార్థన పరిపూర్ణత నొందును.

అంతవఱకు భర్త చెప్పే ప్రతి విషయాన్ని ఆసక్తితో వినుచున్న నిర్మల కన్నుల నుండి రెండు ఆనంద భాష్పాలు ఆమె చెక్కిళ్ళమీదుగా క్రిందకు రాలి పడినవి.

భార్యాభర్త లిరువురికి ఒకే ఆశయాలు, ఒకే భావాలు ఉన్నప్పుడే వారి జీవితము ప్రశాంతముగా గడచి పోవును. అప్పుడే గృహసీమ స్వర్గసీమ ఆగును.

కడప జిల్లా కోర్టులో

ఏ. యస్. నెం|| 153/1952.

షేక్ అబ్దుల్ ఖాదర్ సాహేబ్ అపిలెంటు.

ఎదిరి

ఇసబ్ సాహేబు వగయిరాలు రెస్పాండెంట్లు,

నోటీసు

5. మిరపకాయల లాన్‌ఖాన్ భార్య హాజరాంబి.
6. లాల్ ఖాన్ మయినరు గార్డియన్ తల్లి హాజరాంబి.
7. పులార్ మహబూబ్ సాహెబు భార్య వయిదాబి.
8. ఖాతుంబి మయినరు గార్డియన్ తల్లి హాజరాంబి.
సాకిన్ వాయిల్‌పాడు తాలూకా మహాలు గ్రామం.

కడప డి|| ము|| కోర్టు ఇ. పి. 480/50. ఓ. యస్. 40/41. దు లోని తీర్పుపైన అపిలెంటు పై నెంబరుగా అపీలు దాఖలు చేసుకొని యున్నారు. కనుక అందుకు మీరు యేదైనా ఆక్షేపణ యున్న యెడల ఈ కోర్టు యెదుట 5–3–1953 తేదీన హాజరై తెలుపుకొనవలెనని తెలియ చేయడమైనది.

కడప, 7–2–1953 } వి. వి. శేషాచార్లు, బి.ఎ.,బి.ఎల్., అపిలెంటు వక్కీలు.

## ఎంతటి దౌర్భాగ్యస్థితి ఏర్పడినది.

[6-వ పేజీ తరువాయి.]

ప్రత్యేక దృష్టితోనే తమ ఉద్యోగులకు తరిబీదు ఇచ్చియున్నారు. బ్రిటీషువారిది కర్త లేని పోలీసు పరిపాలనము. ప్రజలపై కాపుదారీ ఉండుటకు మాత్రమే వారు ఉద్యోగులకు తరిబీదు ఇచ్చి యున్నారు. వారు స్వదేశములోనే దేశ ప్రజలు, విదేశీయులగను, నేరస్తులుగను భావించు నటుల ఉద్యోగులకు తర్ఫీదు ఇచ్చి యున్నారు. ఉద్యోగులు మాత్రమే ప్రత్యేక తెగకు చేరిన వారనియు, స్వర్గమునుండి దిగి వచ్చిన వారనియు తలచునట్లు చేసి యున్నారు. ప్రజలను ఏలుటకే కాని, ప్రజలకు సేవ జేయుటకు కాదను భావమును వారిలో కలుగ జేసిరి. రామరాజ్య పరిపాలనా వ్యవస్థకు (వెల్ ఫెరుసేట్కు) త్రుప్పు పట్టి నటువంటి పరిపాలనా యంత్రము పనికి రాదు. నిరంకుశ పరిపాలనా విధానమునుండి ప్రజాస్వామిక పరిపాలిత దేశముగా మార్పొందిన ప్రతి దేశములోను, ప్రభుత్వ యంత్రములో నుండు సంఘద్రోహులను తొలగించి, పవిత్రవంత మొనర్చు ఆచారము కలదు. కాని దురదృష్ట వశమున అట్టి సంస్కరణము ఈ దేశములో జరుగ లేదు. అందులకు ఫలిత మేమనిన, మార్పు చెందుచున్న పరిస్థితులకు అనుగుణ్యముగా చైతన్యములేని ప్రభుత్వ యంత్రము సరి పడ లేదు. ఉద్యోగులు, ప్రజలను తమ యజమానుగ పరిగణింప జాల కున్నారు. అందువల్ల ప్రజలు వారి నాయకులనుండి దిన దినమునకు దూరముగ పోవుచున్నారు. వారి ఆర్థిక స్థితి దుర్భర మైనది. ఇదంతయు చూడ సర్వతంత్ర స్వతంత్ర రిపబ్లిక్, దేశములో (శ్రీ) జవహరిలాలు గారి పాలనము క్రింద ఉన్నామాయని సందేహము కలుగుచున్నది. అందువలన ప్రజాస్వామిక పరిపాలనము ప్రారంభమైన ఈ నూతన కాలములోనే, స్వాతంత్ర్య దినోత్సవములు, రిపబ్లిక్ దినోత్సవములు అనిన ప్రజలలో ఉత్సాహము నశించినది. ఏ ప్రజలయితే తమ జీవితకాలములోనే ఈ దేశము స్వతంత్ర్య దేశముగా మార్పొందుట చూడ గలిగిరో, అట్టి ప్రజలలోనే ప్రభుత్వమనిన భక్తిశ్రద్ధలు తొలగిపోయినవి.

దరిద్రులలో దరిద్రులైన వారికిని, బీదవారికిని, ప్రాణములను కాపాడు నిమిత్తమై ఏర్పాటు చేసిన గంజి కేంద్రముల ద్వారా లాభముల ఆర్జించుటకు వాని నిర్వాహకులు వెనుకాడినవారు కారు. రెండు రూపాయిలకు ఒక్క మణుము ఎఱ్ఱ గడ్డలమ్ము చుండగా, వాని ధరలు ఎంతో పెంచి, బిల్లులుచేసి, ధనము సంపాధించిన వారు కలరు. బీదలకు చీరలను పంచవలెనని చెప్పగా వానిలో కొన్నిటిని మాత్రమే పంచి, మిగత వానిని చీకటి మార్కెటులలో విక్రయించిన దృష్టాంతములు లేకపోలేదు. విదేశములనుండి, క్షామపీడితుల ప్రాణరక్షణార్థము కానుకగా పంపబడిన బియ్యము, గోధుమలు, పాల డబ్బీల, బహిరంగ మార్కెట్లు, చీకటిమార్కెట్లుగా మారినవని మాకు ప్రతిదినము వార్తలు చేరుచున్నవి. యూనియన్ ప్రభుత్వమునకు సంబంధించిన సి. ఐ. డి. శాఖవారు త్వరలో సంపూర్ణమైన విచారణ జరుపుట అవసరమై

యున్నది. తెసోము బాధితుల సహాయార్థమై ఆ దేశీయులు పంపిన బహుమాన రూపక మైన బియ్యము, గోధుమలు, పాలబుడ్లు దుర్వినియోగము చేయబడిన కేసు ఒక్కటి బుజువగుచో, అది కేంద్ర ప్రభుత్వమువారి కీర్తికి తీరని కళంకము తెచ్చును.

సామాన్య మానవుని దృష్టితో మన ప్రభుత్వముల చర్యలను చర్చించినచో అవి సాధించిన ఘనకార్యము సున్నయనియే చెప్పవలసియున్నది.

---

కడప డి॥ ము॥ కోర్టులో

ఓ. యస్. నెం॥ 382/52.

దేవిరెడ్డి అచ్చమ్మ —వాది

ఎదిరి

1. మిట్టా వెంకట సుబ్బయ్య
2. ,, రామిశెట్టి
3. ,, వెంకటరమణ
4. ,, శ్రీరాములు

—ప్రతివాదులు

పై నెంబరులో వాది, ప్రతివాదులపైన ప్రోనోటును బట్టి దావా దాఖలు చేసి వున్నది. సదరు వాయిదా 18_2_1953 తేదీకి నోటీసు నిమిత్తము, వాయిదా వున్నది. ఆక్షేపణ ఉన్న యడల హాజరయి తెలుపుకోవలెను. లేనంతట యక్సుపార్టి చేయబడును అని ఇందువల్ల తెలుపడ మైనది.

కడప, 11_2_1953 — యస్. సంజీవిరెడ్డి, బి.ఎ.,బి.ఎల్., వాది వక్కీలు.

---

కడప డి॥ మునసబ్ కోర్టులో

ఓ. యస్. నెం॥ 9/1953.

సోము కొండన్న —వాది.

ఎదిరి

గాజుల అబ్దుల్ అజీజ్. —ప్రతివాది.

ప్రతివాది అడ్రెసు తండ్రి అబ్దుల్ ఖాదర్ సాహేబ్ బజారువీధి రాయచోటి టవున్.

ప్రతివాదికి నోటీసు.

వాది నీపైన ప్రోనోటు బాపతు బాకీ మొత్తము రూ 1019_5_4 లకు దావా దాఖలు చేసియున్నాడు. సదరు దావా 3_3_1953 తేదీకి వాయిదా పడి వున్నది. ఆదినము నీవు హాజరయి నీ ఆక్షేపణ ఏదైనవున్నయెడల తెలుపుకో వలయును. లేనియడల నీ పరోక్షమందు దావా తీర్మానించబడును.

కడప 15_2_1953. — ఎం. శ్రీరాములు, బి.ఎ.,బి.ఎల్., వాది అడ్వకేటు.

---

నోటీసు.

కడప జిల్లా జడ్జి కోర్టులో

ఐ. పి. నెం॥ 28/52.

కంగరాజు చిన్నబ్బరాజు —ఇన్‌సాల్వెంటు

ఎదిరి

సి. చెంగల్‌రాజు వగైరాలు. —క్రెడిటర్సు.

ఈ నంబరు పిటీషనరును ఇన్‌సాల్వెంటుగా డిక్లేరు చేయుటకు కోరుచూ పిటీషన్ దాఖలు చేసుకొన్నాడు. సదరు పిటీషన్ 5 వ క్రెడిటర్ కె. చిన్నప్పనాయుడు ఆక్షేపణకు గాను 6_3_1953 తేదీకి వాయిదావున్నది. ఏమైనా ఆక్షేపణ వున్న యడల పై తేదిన హాజరై తెలుపుకోవలెను.

కడప 6_2_1953 — ఆర్కాడు సత్యాజీరావు, బి.ఎ.,బి.ఎల్., పిటీషనరు అడ్వకేటు.

---

కడప స్మాలుకాజు కోర్టులో

స్మాలుకాజు నెంబరు 738/52,

యస్. బి. పోదార్ —వాది.

ఎదిరి

మల్లెపు సోమిరెడ్డి —ప్రతివాది.

వాది కంపెనివారు ప్రతివాదిపైన లావాదేవిని బట్టి రు 172_13_3 లకు దావా దాఖలు చేసినాడు. సదరు దావా ప్రతివాది ఆక్షేపణ కొరకు 14_3_1953 తేదీకి వాయిదా వున్నది ఏమైన ఆక్షేపణ వున్న యడల పై తేదీన హాజరై తెలుపుకోవలెను.

కడప, 16_2_1953. — ఆర్కాడు సత్యాజీరావు, బి.ఎ.,బి.ఎల్., వాది అడ్వకేటు.

BHARATHA JYOTHI [MADRAS EDITION.] 18-2-1953

# "భారత జ్యోతి"

[ స్వతంత్ర వార పత్రిక. ]

ఇంగ్లీషులోను, తెలుగులోను ప్రచురింప బడుచున్నవి.

రాయలసీమలోగల 63,36,307 మంది ప్రజల పక్షమున మాటలాడగల పత్రికలివియే.

## చందా వివరములు.

| ఇంగ్లీషు: | | తెలుగు: | |
|---|---|---|---|
| సంవత్సరమునకు | రూ. 6-0-0 | సంవత్సరమునకు | రూ. 9-0-0 |
| అర్థ సంవత్సరమునకు | ,, 3-0-0 | అర్థ సంవత్సరమునకు | ,, 4-8-0 |
| విడి పత్రిక | ,, 0-2-0 | విడి పత్రిక | ,, 0-3-0 |

అన్ని రకములైన అచ్చుపనులు సకాలమునకు శుభ్రముగాను, సరసపు ధరలకు అందజేయుదుము.

వివరములకు:-

మేనేజరు, "భారత జ్యోతి"

మద్రాసు ఆఫీసు:

3, సుంకువారి అగ్రహారము,
మౌంట్ రోడ్డు, మద్రాసు-2.

పోస్టు బాక్సు నం. 10,
కడప.

No. 2. Printed at the "BHARATHA JYOTHI" Press; and issued at 16-92, Railway Station Road, Cuddapah.